





## 1947 వ సంవత్సరం

దేశానికి స్వాతంత్ర్యం లభించిన సరికొత్త రో[జు] జూబిలి. భారతీయులు యెంత శాంతియుతంగా పోరాడాలనుకున్నా బ్రిటిష్ [...]వాళ్ళ దౌర్జన్యంతో దేశంలో బోలెడంత హింసాకాండ జరిగింది. రక్తపు[...] [...]దులు ప్రవహిం చాయి. ఎందరో మనుష్యులు వికలాంగులయారు. ప్రాణాలు [...] [...]రువ కున్నారు. స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొన్న ప్రతివాళ్ళని స్త్రీ [...] భేదంగాని, వయో వివక్షతగాని చూపకుండా గొడ్డుల్ని బాదినట్టు [...] బాదారు. కొంచెం అనుమానం తగిలితేచాలు-వేటకుక్కల్లా వెంటబడి తరిమి తరిమి కాల్చి చంపారు. అయినా సరే, భారతీయులు ఉద్రేకం ఆపుకుని మహాత్ముని అడుగుజాడల్లో సహనంతో శాంతియుతంగానే పోరాడారు. చిట్టచివరికి మహాయజ్ఞంలో ఎలాగయితేనేం కొన్నివేల ప్రాణాలు బలిపెట్టి, కొన్ని లక్షలమంది వూహించలేనంత భయంకరమయిన చిత్రహింసలకి గురియై అనుకున్నది సాధించారు. దేశానికి స్వాతంత్ర్యం లభించి[న]ది. కొన్ని వందల సంవత్సరాల తర్వాత భారతమాత దాస్యశృంఖలాలని ఛేదించుకుని స్వాతంత్ర్యవాయువులు పీల్చగలిగింది.

సంవత్సరాల తరబడి జైళ్ళలో మ్రగ్గుతూ, జీవితాలమీద ఆశ [వ]దులుకున్న రాజకీయ ఖైదీలకు వెంటనే విడుదల లభించింది. [ఎ]ంతో ఆశగా, ఆత్మీయుల్ని సజీవంగా మళ్ళా కళ్ళారా చూడబోతున్నాం అనే ఆనందంతో ఆత్రంతో యిళ్ళకి ప్రయాణం అయారు.

ఇలా విడుదల లభించిన వాళ్ళలో ఒకతను ఇంటికి వెళుతున్నాడు. అతని వయసు సుమారుగా 24-25 సంవత్సరాల మధ్య వుంది. మనిషిని పరిశీలిస్తే మాసి బిరుసుతేలిన అతని గడ్డంలాగానే మనసుకూడా మహా కరుకేమో అన్న అనుమానం కలుగుతుంది. తీక్షణంగా వున్న ఆ కళ్ళు ఒకసారి దేనివేపయినా చూస్తే చాలు-ఆ క్షణంలో దాని పుట్టుపూర్వోత్తరాలు ఆకళింపుచేసుకోగలంత చురుగ్గావున్నాయి. సమున్నతంగా ఉండి చివర కొనతేలిన నాసికలో యేదయినా అనుకుంటే చివరికి ప్రాణాలకి తెగించి అయినాసరే అది సాధించి విజయం పొందగల పట్టుదల కన్పిస్తోంది. చప్పున తలెత్తి అందరివైపు ... లా అతని ముఖంలోకి సూటిగా చూడలేం. కొద్దిగా మోటుగా వున... ఆ పెదవులు చిరునవ్వు చిందిస్తున్నట్టు తోస్తుంది. కాని పరీక్షగా చూస్తే ... అక్కడ చిరునవ్వుకి బదులు ఓ విధమైన గాంభీర్యం కానవస్తుంది. ... లాంటి పరిస్థితుల్లోకూడా నా ఆత్మగౌరవం కాపాడుకోగలను-అనే ... ధీమా అలా కొంచెంగా గడ్డం పైకెత్తుకుని చూడటంలో స్పష్టమౌతు...ంది. హిందువుల్లో సాధారణంగా అంతటి పొడుగాటి మనుష్యులు ...దుగా కన్పిస్తారు. ఒకప్పుడు అతని శరీరచ్ఛాయ పచ్చటి రంగే కావచ్చు. కాని కొన్ని సంవత్సరాలు యెండనకా, వాననకా తిరగడంవల్ల చామనచాయగా మారింది. అన్ని సంవత్సరాలు జైల్లో మగ్గినా, యెన్ని యాతనలకి గురియైనా ఆ శరీరంలో దార్ఢ్యం యేం తగ్గలేదు. అతనిది అంత మంచి ఆరోగ్యంలా వుంది.

కొద్దిగా మాసిన బట్టల్తో జీప్‌లో వెనక్కు జారగిలబడి కూర్చున్నాడతను. తైల సంస్కారంలేని జుట్టు చెదిరి విశాలమైన నుదుటిమీద చిందరవందరగా పడుతోంది. అదికూడా ఓ అందంగానే వుంది.

బాట చాలా గతుకులుగా బొత్తిగా అధ్వాన్నంగా వుంది. రెండు మూడు రోజుల క్రితం బాగా వర్షం పడ్డట్టుంది-అక్కడక్కడా బురద గుంటలు వున్నాయి. రోడ్డు కిరుప్రక్కలా యెత్తుగా పెరిగిన చెట్లకి అడవి తీగెలేవో పెనవేసుకుని విరగబూసివున్నాయి. వాటినుంచి చిక్కనవస్తున్న సువాసనలు మత్తెక్కించేలా వున్నాయి.

"ఎంత మంచిగాలి!" ముక్కుపుటలు పెద్దవిచేసి గుండెలనిండా ఆ అడవిపూల వాసనలు పీల్చుకుంటూ అనుకున్నాడతను. కొన్ని సంవత్స

రాలు చీకటి గదుల్లో మ్రగ్గిన అతనికి యీ వెలుగు, ఈ ఆరుబయలు, ఈ స్వచ్ఛమైన గాలి అమృతంలా వుంది.

'ఈ రాత్రికి యెక్కడయినా ఆగాల్సి వస్తుందేమో! దోవ బొత్తిగా బాగుండలేదు' అన్నాడు డ్రైవర్.

'ఉహు! వీల్లేదు. ఎంత రాత్రి అయినాసరే వెళ్ళిపోవాలి. పిడుగులు పడ్తున్నా ఆగటానికి వీలు లేదు.' దృఢంగా అన్నాడతను.

'దోవ నాకు సరిగ్గా తెలియదు. ఎక్కడయినా తప్పితే-' సణిగాడు డ్రైవర్. 'నేనున్నాగా!' నిర్లక్ష్యంగా అన్నాడతను, మళ్ళీ ఆలోచనల్లోకి జారిపోతూ.

తదియనాటి వెన్నెల మెల్లగా చెట్ల సందుల్లోంచి తొంగి చూడాలని ప్రయత్నం చేస్తోంది. చీకటి, వెలుగుకాని మిశ్రమ వాతావరణం, ఘాటుగా వున్న అడవిపూల సువాసనలు, అంతా కంటికి మనోహరంగా మనసుకి ఆహ్లాదంగా, వుత్తేజకరంగా వుంది. పరుగెత్తుతున్న జీపు ఆగిపోతే కళ్ళ ముందు కన్పిస్తున్న ఈ సుందరదృశ్యంకూడా ఎక్కడ చెరిరిపోతుందో అన్పిస్తోంది. అతని ఆలోచనలు అటు తిరిగి, యిటు తిరిగి, మళ్ళీ ఇ మీదికి మళ్ళినాయి.

నాలుగు సంవత్సరాలక్రితం యిల్లు వదిలేసి వచ్చేశాడు. ఎలా వుందో? స్వాతంత్ర్యోద్యమంలో చేరతానని చెప్తే వద్దంట 'నాకున్నది నువ్వొక్క నలుసువి. ఆ వుద్యమంలో చేరటానికి చాలామంది వున్నారులే' అంటూ ఆటంక పరుస్తుందని, వెడతానంటే అడ్డుపడుతుందని చెప్పకుండా వచ్చేశాడు. మర్నాడు లేదని ఎంత క్రుంగిపోయిందో? అన్నం నీళ్ళు మాని ఎన్ని రోజులు ఏడ పడుకుందో? కాని ఏం చేస్తాడు తను! దేశం అత్యవసర పరిస్థితి ఉంటే పౌరుడిగా తన కర్తవ్యాన్ని ఏ విధంగా విస్మరిస్తాడు! విస్మరి తృప్తిగా బ్రతగ్గలడా! దేశమాత కన్నీళ్ళతో రమ్మని పిలుస్తుంటే వెళ కుండా యెలా? అందుకే కన్నతల్లిని బాధ పెడుతున్నానని తెలిసికూడా నిగ్రహించుకుని వెళ్ళాడు. సుధ వుంది కాబట్టి కొంత ఫర్వాలేదు. అసలు ఆ ధైర్యంతోనే తను వెళ్ళాడు. సుధని గురించిన ఆలోచనలు మెదలగానే అతని మనసంతా తీయని బాధతో నిండిపోయింది.

తను ఇల్లు వదిలి వచ్చేముందు, రాత్రి తనకీ సుధకీ జరిగిన సంభాషణ యిన్ని సంవత్సరాలలో ఒక్క క్షణమైనా మర్చిపోయాడా! అసలు జన్మలో మర్చిపోగలడా! ఆ రోజు పుచ్చ పువ్వులాటి వెన్నెట్లో పున్నాగచెట్టుక్రింద వీడ్కోలు తీసుకుంటూ ఆఖరిసారిగా మాట్లాడిన దృశ్యం కళ్ళముందు కదిలింది.

'వ్యక్తిగత అభిప్రాయాలకి, స్వసుఖాలకి స్వస్తి చెప్పాల్సిన అమూల్యమైనకాలం సుధా! ఉప్పెన వచ్చిన ప్రవాహంలో పొంగి పొర్లుతున్న యీ నవచైతన్యంలో నాలాంటివాళ్ళు ఉరికి, ఆ ప్రవాహ వేగానికి మరింత బలం తీసుకురావాలి. అలా పురక గలిగిన ధైర్యసాహసాలు నీలాంటివాళ్ళు యివ్వాలి. ఈసారి యీ గాలిదుమారం నుంచి ఆంగ్లేయులు తప్పుకోలేరు. దేశంలో వాళ్ళ అధికారానికి స్వస్తి పలికి, మూటా ముల్లె సర్దుకుని వెళ్ళిపోక తప్పదు!' ఆవేశంగా అన్నాడతను.

'కాదన్నానా బావా! కాదనలేదుగా నేను?' ఏడుపు దిగమింగుతూ అంది సుధ.

ఇద్దరూ ఆగిపోయి ఒకళ్ళని ఒకళ్ళు ఆత్రంగా అనురాగంగా కున్నారు.

'సుధా! ఒకవేళ-ఒకవేళ నేను తిరిగిరాకపోతే!-ఇదే ఆఖరి చూప -ఈ మహా హోమానికి నేనుకూడా ఒక సమిధనై పోతే?-'

'బావా!' సుధ వొళ్ళు భయంతో జలదరించింది. వణుకుతున్న చాచి పెదవులమీద వారిస్తున్నట్లు పెట్టి 'అలా-అలా అయితే ఈ నాకు శాశ్వతం అవుతుంది. నువ్వు వచ్చేవరకూ యీ క్షణంలో జీవి బావా! మాధవ్ లేడని తెలిసిన రోజున సుధకూడా యీ లోకంలో దదు.'

'సుధా!' ఆర్ద్రంగా అరిచిన తను ఆపుకోలేని ఆత్మీయతతో దగ్గిరగా ాక్కుని గుండెలకి హత్తుకున్నాడు. 'సుధా! నువ్విలాటి ఆలోచన కల్లో కూడా రానివ్వకూడదు. అమ్మని నీకు అప్పగించి వెడుతున్నానన్న సంగతి మర్చిపోకు. ఒకవేళ-నాకేదయినా అయితే అమ్మ బాధ్యత నీది. నువ్వున్నావనే నిశ్చింతతో నేను వెడుతున్నాను!'

తడికళ్ళు మెరుస్తుండగా నిండుగా నవ్వింది
గురించి నువ్వు ప్రత్యేకంగా నాకు చెప్పాలా? అమ్మా
నేను అత్తయ్యలో ఆ యిద్దర్నీ చూశాను. ఆవిడమీద
జాగ్రత్త వుందని నాకు తెలుసు. కాని-కాని, నువ్వు తిరి
తప్పకుండా తిరిగి వస్తావు. నా ప్రేమే నిన్ను బతికిం
కప్పగిస్తుంది. ఆ నమ్మకం ఉంది.'

'ఇది యెప్పటికి మర్చిపోను సుధా!'

సుధ హఠాత్తుగా రెండు చేతులూ అతని మెడ
'అదే కాదు ఇంకోటి కూడా మర్చిపోకు. నీకోసం యెని
యుగాలైనా సరే యెదురు చూస్తుంటాను. అది గుర్తుంచు
కళ్ళలో ఆ కాంతి, ఆ కంఠధ్వని ఇప్పటికీ చెవిలో మా
ఆ జ్ఞాపకమే, పవిత్రమైన ఆ ప్రేమే శ్రీరామరక్షలా ఆ
అనేకసార్లు మృత్యు ముఖంలో నుంచి తప్పించింది.
జ్ఞాపకమే లేకపోతే తనకి బతుకు మీద యింత ఆశ
నరకయాతనలని అలా చిరునవ్వుతో భరించగలిగేవా
రబ్బరు బంతిలాంటి సుధ మనసు పట్టి వెన్న ముద్ద. శ
దౌర్జన్యం క్రింద తను పడిన బాధలు చెబితే భరించగల
కోసం ఆశగా ఎదురు చూస్తూ ఇన్ని సంవత్సరాల సుధ
గురి అయిందో! బహుశా తింటానికి తిండికూడా వుండి
దరిద్రం బాధ అయితే ఫర్వాలేదు సుధ తేలికగా భరిం
లేక అల్లకల్లోలంగా వున్న యీ పరిస్థితుల్లో ఆక్కడ
అత్యాచారం జరిగిందా! క్షణం సేపు అతని మనసు
వణికిపోయాయి. లేదు, లేదు ఈ దావానలపు శ
ప్రాంతంలో వున్న ఆ మారుమూలకి బహుశా వా
దేశంలో యెక్కడో మారుమూల వున్న ఆ క
భీభత్సం ప్రాకివుండదు. తను వెళ్ళి కథలుగా చె
...నే సుధ భయంకరమైన యీ కథలు వినాలి.
అనుకోకుండా యిలా తను అకస్మాత్తుగా కళ
...సారి వెర్రికేక పెట్టి చేస్తున్నపని వదిలి

తుల్లో వాలిపోదూ! అలావచ్చి పెనవేసుకుపోయిన
మంతీ లేకుండా గుండెలకి హత్తుకుంటున్న దృశ్యం
కదిలేసరికి కళ్ళనిండా నీళ్ళు తిరిగాయి. అబ్బా! ఇంకా
అంత వేగంగా పరిగెత్తుతున్నా యీ దూరం తరగదే!
మ్మని చూడాలనే ఆత్రంవల్లనే జైలునుంచి విడుదల
టు విడుదల అయిన తోటిఖైదీ రామగోపాలరావుగారు
'జులు నాదగ్గరుండి విశ్రాంతి తీసుకొని వెళ్ళకూడదూ?'
మాలినా వినకుండా బైలుదేరాడు. తన ఆదుర్దాని అర్థం
చిరునవ్వు నవ్వి 'సరే! అయితే వెళ్ళు. వెళ్ళి వారం
ధని-మీఅమ్మని తీసుకుని తిరిగిరా' అంటూ స్వయంగా
రు.
లుదేరబోతుంటే ఆయన 'త్వరగా వచ్చెయ్ మాధవ్!
పంచంలో నువ్వుతప్ప నాకెవరూ లేరన్న సంగతి నీకు
రు. అది గుర్తుకురాగానే మాధవ్ కళ్ళు చెమర్చినాయి.
నా అనే ఆత్మీయులు తప్ప మిగతావన్నీ వున్నాయి.
ఆయన భార్య హృద్రోగంతో మరణించింది. ఆ వార్త
కుంగిపోయారో ఒక్క మాధవ్‌కు తెలుసు. ఆ సమ
గా ఆయనకి దగ్గరై వూరడించిన మనిషి మాధవ్
న్ని సంవత్సరాల యీ భయంకరమైన అనుభవం
సమయంలోనే రామగోపాలరావుగారి పరిచయం ఒక
, తల బిరుసుగా, మహా పొగరుగా వుండే మాధవ్
సాన్నిధ్యంలో పరిపూర్ణమైన వ్యక్తిత్వంగల నిండైన
మారిపోసాగాడు. ఈ ప్రపంచపు రీతిని గురించి,
గురించి, మనుషుల పోకడలను గురించి అనేకం
ప్రతి మంచిలోనూ ఒక చెడు; ప్రతి చెడులోను ఒక
లోకోక్తి అనుభవపూర్వకంగా తెలిసింది. సుధని
ఈ వార్ధక్యంలో నా అనే వాళ్ళకోసం తహ
సుధ, తనుకలిసి శాంతి చేకూర్చాలి! సుధని క
క్షణంకోసం అతని మనసు వేయికళ్ళతో

మాధవ్ అలా చెప్పవాల్సి ... చూడ

...తో ఆ అమ్మాయి సిగ్గుపడి కళ్ళు ... ను చక్రం

దగ్గరకు వెళ్ళి వూపి పరీక్ష చేశాడు. ... వెళ్ళి గుర్రా

లను విప్పమని ఆదేశించాడు. తర్వాత ముగ్గ... ంతా ...యో

గించి లేపితేగాని చక్రం పైకి లేవలేదు. మాధవ ... నిండా కూడా

చెమటలు పట్టాయి. షర్టు చేతులు పైకి ముడుచుకోవటంతో ... మోచేతుల

వరకూ బురద అంటింది.

'ఇక్కడెక్కడా నీళ్ళు లేనట్టున్నాయే?' రెండుచేతులు చూ...ను

కుంటూ తనలో తను అనుకుంటున్నట్టు అన్నాడు.

బండి అడుగునుంచి గడ్డితో చక్రానికి అంటిన బురద తీసేస్తున్న కోచ్‌మెన్ 'అదుగో! ఆ చివర నీళ్ళగుంట వుంది' అన్నాడు.

'ఎక్కడా?' చుట్టూ చూశాడు.

'నేను చూపిస్తాను రండి!' ఆ అమ్మాయి దోవతీసింది. మాధవ్ అనుసరించాడు. రోడ్డుకి దిగువగా, బాగా పల్లంవున్నచోట వర్షపు నీళ్ళు నిలిచివున్న చిన్న నీటిగుంట వుంది. మాధవ్ వెళ్ళి రెండుచేతులూ కడుక్కుని వచ్చాడు.

గడిచిం

ది. ...నిమిషాల్లో తిరిగివచ్చి 'గుర్రపు స...

సార్! చక్ర... ...పోయింది. పైకి తీయకపోతే లాభం

లేదు మనకి ... ...డు

'నేను ఉ... ...యంపట్టాలా?'

డ్రైవర్ అవునన్నట్టు తలూపాడు. 'మధ్యలో యీ న్యూసెన్సు యేమిటి?' చిరాగ్గా ...గివచ్చాడు.

అందమైన జోడుగుర్రాల కోచ్. చూడగానే కలవారిదని తెలుస్తోంది. గుర్రాలుకూడా మంచి పోషణలో పెరుగుతున్నాయనటానికి సూచనగా నిగనిగలాడుతున్న వాటి శరీరమే చెబుతోంది.

మాధవ్ చక్రం దగ్గర కెళ్ళి పరీక్ష చేశాడు.

'బురదలో కూరుకుపోయింది బాబూ! పైకి లేపటానికి నా బలం చాలటం లేదు.' కోచ్‌మన్‌లా వున్నాడు. తలకి పాగావుంది. నెరిసిన బారాటిగడ్డం తెల్లటి జొన్నపీచులా వుంది. ముడతలు పడిపోయిన ముఖం వయసుచెల్లినట్టు చెబుతోంది. చాలాసేపటినుంచి ప్రయత్నం చేస్తున్నాడులా వుంది, ఒంటినిండా చెమటలు కారుతున్నాయి.

'థాంక్స్! మీరు రాకపోతే యీ రాత్రికి మాకు యింటికి వెళ్ళే యోగం ఉండేది కాదు!' తడిచేతుల్ని పాంట్‌కి రాచుకోబోతున్న మాధవ్‌కి తన జేబురుమాలు అందిస్తూ కృతజ్ఞతాపూర్వకంగా అంది.

దగ్గర్లోవున్న పెద్ద మర్రిచెట్టు దట్టమైన శాఖలతో దూరంగావున్న కోచ్‌ని, జీప్‌ని కనుమరుగు చేస్తోంది. వెన్నెల మరింత బాగా వచ్చింది. స్పష్టంగా వున్న ఆ కాంతిలో ఆ అమ్మాయి ముఖంలో కుడివైపు పై పెదవిమీద కొట్టొచ్చినట్టు కన్పిస్తున్న పుట్టుమచ్చని చూసి అతను ఆగి పోయాడు. సుధకి కూడా సరిగ్గా యిలానే, కాకపోతే, ఎడం వైపుగా అంతే పుట్టుమచ్చ వుంది. 'అరె!' దానివైపే పరీక్షగా చూస్తూ పర ధ్యానంగా జేబురుమాలుకు బదులు చేతిని పట్టుకున్నాడు. క్షణం సేపు ఆ అమ్మాయి కాటుక కళ్ళు నిశ్చలమైపోయినట్టు చూశాయి. వెంటనే చేయి వదిలించుకోబోయింది. కాని యిదేం గమనించని మాధవ్ చెయ్యి ఎక్కడ జారిపోతుందో దాని ద్వారా తన స్వప్నం యెక్కడ చెదిరిపోతుందో అన్నట్టు మరింత గట్టిగా పట్టుకున్నాడు. ఆ క్షణంలో ఆ పుట్టుమచ్చని దాని మూలంగా అక్కడ కన్పిస్తున్న సుధముఖాన్నీ తదేకంగా రెప్పవాల్చ కుండా చూడాలన్న ఆసక్తి తప్ప అతని మనసులో ఏ దురుద్దేశమూ లేదు. కాని అతని చూపుని, ఆ చెయ్యిపట్టుకున్న తీరుని పూర్తిగా అపార్థం చేసు కున్న ఆ అమ్మాయి యెడమచేయి చాచి మాధవ్ చెంపమీద ఛెళ్ మని పించింది. అనుకోకుండా చెంప చురుక్కుమనగానే అతను తెల్లబోయి క్షణం సేపు అలాగే విస్మయంగా చూస్తూ నిలబడిపోయాడు.

'ఛీ! రాస్కెల్!' ఒక్కవూపులో చేతిని గుంజుకొని మెరుపులా పరుగెత్తబోయింది, కాని మరుక్షణమే అతను ఓ అడుగు ముందుకువేసి చెయిజాపి ఆ అమ్మాయి జబ్బ పట్టుకుని గట్టిగా ఆపేశాడు. అనుకోకుండా కలిగిన యీ అవమానానికి కోపం కలిగినట్టు అతని ముఖం కఠినంగా మారింది. నుదుటిమీద నరాలు వుబ్బివున్నాయి. 'ఎందుకు కొట్టావు?' అడగ టానికి అతని పెదవులు తెరుచుకోబోయినాయి. కాని అప్పటికే ఉగ్రురా లయిన ఆ అమ్మాయి మెళ్ళో పులిగోరుతీసి అతని ముఖంలో గుచ్చ బోయింది. అతను చటుక్కున ముఖం తిప్పేసుకున్నాడు. లేకపోతే కన్ను పోవాల్సిన పని. గురితప్పిన పులిగోరు బుగ్గమీదబలంగా చీరుకుపోయింది.

బాధతో కెవ్వుమన్న అతను చెయి వదిలేసి 'అబ్బా! రాక్షసి!' అంటూ బుగ్గతడుముకున్నాడు. భరించలేని ఆ భగ్గుమన్న మంటకి, ఆ బాధకి అతని కళ్ళు తిరిగినట్టయింది. ఒకడుగు పక్కకువేసి దగ్గర్లోవున్న మర్రి చెట్టుమీద చెయ్యి ఆన్చి నిలబడ్డాడు. బుగ్గమీద ఆన్చుకున్న చేతికి వెచ్చగా తడి తగలటంతో తీసి చూసుకుంటే యెర్రటి రక్తం చిక్కటి మర్రిచెట్టు నీడలో నల్లగా అరచేతినిండా కన్పించింది. ఏమైంది ఆ అమ్మాయికి? నే నేం చేశాను? అనుకున్నాడతను. అప్పటి కెప్పుడో ఆ అమ్మాయి అక్కడనుంచి మెరుపులా అదృశ్యమై పోయింది.

అతను తేరుకొని అక్కడనుంచి యివతలకు వచ్చేసరికి కోచ్ వెళ్ళిపోతోంది. ఆ అమ్మాయే ముందు నిలబడి పిచ్చిపట్టినట్టు గుర్రాలని బాదుతోంది. కోచ్‌మన్‌కి కూడా బహుశా అర్థం అయి ఉండదు. అతలా కుతలం అయిపోతూ యెక్కడ పడిపోతానో అనే భయంతో బండిలోపలి కమ్మీ పట్టుకొని కూర్చుని యిదే చూస్తున్నాడు.

మాధవ్ చూస్తూండగానే కోచ్ మలుపు తిరిగి కంటికి కన్పించ కుండా అదృశ్యమైంది.

జీప్ దగ్గర నిలబడిన డ్రైవర్ నోరువెరుచుకొని చూస్తున్నాడు.

కొద్దిసేపు అలాగే చిత్తరువులా మతిపోయినట్టు నిలబడిన మాధవ్ తేరుకొని కొద్దిగా భుజాలెగరేసి వచ్చి జీప్‌లో కూర్చుని 'పోనియ్' అన్నాడు.

నిటారుగా కూర్చున్న డ్రైవర్ దొంగతనంగా, ఆసక్తిగా మాధవ్ వైపు ప్రక్కచూపులు చూడటం ప్రారంభించాడు.

మాధవ్‌కి చిరాకు కలిగింది. అతని ఉద్దేశం గ్రహించినట్లు 'ఆ అమ్మాయి పిచ్చిపిల్లలా వుంది' అన్నాడు. అడక్కుండా యిచ్చిన ఆ సంజాయిషీలో 'నేనేం చెయ్యలేదు. ఆ అమ్మాయి అనవసరంగా నన్ను గాయపరచి వెళ్ళింది. కృతఘ్నురాలు' అన్న ఉద్దేశంవుంది. కాని డ్రైవర్ అది నమ్మినట్టులేదు. అవమానంపొందిన మాధవ్ అంతరాత్మ వెనక్కు తిరిగివెళ్ళి తరమిపట్టుకుని నలిపి నాశనం చేయమని- ఆ అమ్మాయిని మరింత తీవ్రంగా గాయపరచి రమ్మని పేచీపెట్టసాగింది. కాని వివేకం అది మంచిదికాదని అడ్డుపెట్టింది.

వ్యక్తిత్వం కూడా అదే నిజం అని వంతపాడి నచ్చచెప్పి ఎలాగో శాంతపరచింది. బహుశా ఇలా చెయ్యిపట్టుకోవటం చూసి అపోహపడి వుంటుంది అయితే మాత్రం? షవతల కోచ్‌మన్, డ్రైవర్ వీళ్ళు లేరూ? వీళ్ళుండగా తను ఇలా అమానుషంగా ప్రవర్తించే పశువు అనుకుందా! ఛీ, ఛీ! తనేదయినా దురుసుగా ప్రవర్తిస్తే అరిచి వాళ్ళిద్దర్ని పిలవ వచ్చుగా! ఆ జ్ఞానంలేని అందమైన మూర్ఖురాలా? అసలయినా—ముక్కు మొహం తెలియని అమ్మాయిని, అందులో ఇలా రోడ్డు ప్రక్క ఛీ, ఛీ! మాధవ్‌కి ఒంటినిండా తేళ్ళుజెర్రులు ప్రాకినట్టు కంపరం పుట్టింది. అంతలో ఆ అమ్మాయి అమాయకత్వానికి కోపంతోపాటు నవ్వుకూడా వచ్చింది. జీప్ మళ్ళీ వేగం అందుకుంది.

# 3

మాధవ్ వూరు చేరుకునేసరికి ఉదయం పదిగంటలకి పైగా అయింది. తనకళ్ళని తానే నమ్మలేకపోయాడు. అంతగా మారిపోయింది వూరు. ఆత్రంగా వీధులదాటి మలుపులు తిరిగి తన యింటి సందులో ప్రవేశించాడు. వెంటనే అతని కళ్ళు బైర్లు కమ్మినాయి. తను చూస్తున్నది కలో, నిజమో అర్థంకాలేదు. అతని యిల్లు వుండవలసినచోట ఒక చిన్న ఎలిమెంటరీ పాఠశాల వుంది. పిల్లలు కూర్చుని బిగ్గరగా కంఠాలెత్తి పాఠాలు చదువుకుంటున్నారు. యిటీవలే కొత్తగా లభించిన స్వాతంత్ర్యపు వాయువుల్ని గట్టిగా పీల్చుకుంటున్నట్టు త్రివర్ణపతాకం గాలికి రెపరెప లాడుతూ ఎగురుతోంది.

నిశ్చేష్టుడైన మాధవ్ యింకా అలాగే చూస్తూ నిలబడి పోయాడు. 'ఎవరు బాబూ! ఏం కావాలి మీకు?' జీవించిగి మాసిన మనుషులతో, చెదిరిన జుట్టుతో చేష్టలుడిగి బొమ్మలా నిలబడిపోయిన మాధవ్ దగ్గరికి కర్ర వూతం చేసుకుంటూ నడిచివచ్చిన ఒక ముసలాయన అడిగాడు. ఆయనకి చూపు సరిగ్గా ఆనడంలేదు. కళ్ళకి చెయ్యి అడ్డుపెట్టుకుని మరీ చూస్తున్నాడు.

వెనక్కి తిరిగి క్షణంసేపు ఆయన్ని చూసిన మాధవ్ వెంటనే దగ్గ

రగా వెడుతూ 'ప్రకాశం బాబాయ్! నేను! నన్ను గుర్తుపట్టలేదా?' కంఠం బొంగురుపోవటంతో ఆగిపోయాడు.

మాధవ్‌ను విచిత్రంగా, పరీక్షగా చూసిన ఆయన వెంటనే చెయ్యి జాచి గట్టిగా పట్టుకుంటూ 'అరె! మధూ! నువ్వా! యెప్పుడూ రావటం?' అన్నాడు.

'ఇప్పుడే బాబాయ్! మాయిల్లు—' మళ్ళీ వెనక్కి తిరిగి చూస్తూ అన్నాడు.

'మా ఇంటికి పోదాం పద!' ఆశ్చర్యానందాలతో తడబడుతూ అన్నాడాయన.

'బాబాయ్! అమ్మా వాళ్ళు—' వాక్యం పూర్తిచెయ్యనేలేదు.

'ముందు ఇంటికి పద, అంతా చెప్తాను' అంటూ ఆయన తొందర చేశాడు.

# 4

'ఏమేవ్ కాంతం! నిన్నే. ఇలారా చప్పున. ఎవరొచ్చారో చూడు!' ఇంకా మాధవ్ చేతిని అలాగే పట్టుకొని లోపలికి తీసుకు వెడుతూ కేక పెట్టా డాయన.

'ఎవరూ? కూర్చోమనండి. వస్తున్నా. పొయ్యిమీదకూర తగలడింది. మాడిపోతుంది' లోపలనుంచి విసుగ్గా వచ్చింది సమాధానం.

'నీ మొహం. ముందు బైటికి రావే! రా! వచ్చి చూడు. ఎవరో తెలిస్తే నోరు తెరుస్తావు. వస్తున్నావా లేదా?...'

'అబ్బబ్బ ఎవరో చెప్పకూడదూ? మీ తొందరా మీరు...' చేస్తున్న పని వదిలి చేతులు తుడుచుకుంటూ బైటికి వస్తున్న ఆవిడ మాధవ్‌ని చూడగానే గుమ్మంలోనే ఆగిపోయింది.

'ఎవరో గుర్తుపట్టావుటే?'

'మధూ!'

'పిన్నీ!' మాధవ్ దగ్గరగా వెళ్ళాడు.

'నువ్వు-నువ్వు చచ్చిపోయావని అంతా—'

'నోరు ముయ్యవే! మనిషి కన్పించనప్పుడు సవాలక్ష అనుకున్నాం. ఎదురుగుండా ప్రత్యక్షంగా కన్పిస్తున్నప్పుడు అలాటి మాటలు అంటే ఆయుఃక్షీణం అని కూడా తెలియదా నీకు!' ముసలాయన కసిరాడు.

'ఎన్నాళ్ళయిందయ్యా నిన్ను చూసి! ఎప్పుడొచ్చావు?' తేరుకుంటూ అడిగింది ఆవిడ.

'మధూ! నువ్వు ముందు స్నానంచెయ్యి. ఇదిగో యేమే నిన్నే! ఇహ అలా ముద్దులా చూడటం ఆపి అబ్బాయికి వేడినీళ్ళు వున్నాయో లేదో చూడు. ఇంట్లో పెరుగు ఉందా? లేకపోతే వెళ్ళి తీసుకువస్తాను. చప్పున చెప్పు.'

'కాని బాబాయ్! అమ్మా వాళ్ళు-' మాధవ్ అడ్డుతగిలాడు.

కాంతమ్మ భర్తవైపు బాధగా చూసింది

'చెప్తారా బాబూ! చెప్తా. ముందు నువ్వు స్నానంచేసి పట్టెడు మెతుకులు తిను.'

మాధవ్ ఆయన దగ్గరగా నడిచి చప్పున చెయ్యి పట్టుకుంటూ 'బాబాయ్! అమ్మా వాళ్ళేమయ్యారు? సుధ యెక్కడుంది? ఇవేవీ తెలుసుకోకుండా నేను భోజనం చెయ్యగలను అనేనా నీ ఉద్దేశం?' అన్నాడు గట్టిగా.

కాంతమ్మ అక్కడ నిలబడటం యిష్టంలేనట్టు లోపలికి వెళ్ళిపోయింది.

ముసలాయన కర్ర గోడకి చేరబెట్టి క్రింద చతికిలబడుతూ 'కూర్చోరా నాయనా! కూర్చో అంతా చెప్తా' అన్నాడు వణుకుతున్న కాళ్ళతో, కొట్టుకునే గుండెతో. మాధవ్ కూడా ఆయన ప్రక్కనే కూలబడ్డాడు. ప్రకాశంగారు చెప్పటం ప్రారంభించాడు.

'అదిరా బాబూ జరిగిన సంగతి నీ కోసం మీ యిల్లంతా గాలించారు, ఊళ్ళో అనుమానం తగిలిన ప్రతి యిల్లూ సోదా చేశారు. అడ్డుపడిన యిద్దరు ముగ్గుర్ని చావ చితగొట్టారు. నువ్వు దొరకలేదన్న కోపంతో వూరంతా నానా హడావిడి చేశారు. అది జరిగిన వారం రోజులకి నువ్వు పట్టుబడ్డావన్నారు. కాల్చేసినట్టు పేపర్లో వార్తలు వచ్చాయి. ఆ వార్త వినగానే అసలే అన్నం నీళ్ళు లేకుండా కంటికి మంటికి యేకధారగా

ఏడుస్తున్న మీ అమ్మ పూర్తిగా మంచం పట్టింది. ఎంత ప్రయత్నం చేసినా మేమెవ్వరం ఆవిడచేత గుక్కెడు నీళ్ళు తాగించలేకపోయాం. పదిహేను రోజులు తిరగకముందే పోయింది.'

'కాని, నేను-నేను అప్పుడు తప్పించుకున్నాను బాబాయ్.' ధార పడుతున్న కన్నీళ్ళని తుడుచుకుంటూ అన్నాడు మాధవ్.

'మా కెలా తెలుస్తుంది చెప్పు! నువ్వు కనీసం ఉత్తరం అయినా రాయలేదు.'

'ధైర్యం చాల్లేదు. అదీ కాకుండా నేను త్వరలో మళ్ళీ పట్టుబడ్డాను. కులాసాగానే వున్నాను అని తెలియజేయాలని యెంతో తహతహలాడాను. కానీ నాకా అవకాశమే చిక్కలేదు.'

'మీ అమ్మ దహన సంస్కారాలన్నీ నా చేతిమీదనే ముగించాను.'

'మరి, సుధ?'-మాధవ్ ఆత్రంగా అడిగాడు.

సుధ కొద్దిరోజులు నా దగ్గరుంది. తర్వాత వాళ్ళ మామయ్య వచ్చి తీసుకువెళ్ళాడు.'

'మామయ్యా?'

'అవును. విశాఖపట్నంలో నాగభూషణంగారని ఎవరో వున్నారుటగా!'

'కాని, యెప్పుడూ చెప్పుకోపటమే తప్ప సుధకి స్వయంగా తెలియదే? అసలు వాళ్ళంటే యిష్టంలేదుకూడా!'

'పరిస్థితులు సరిగ్గా లేనప్పుడు ఇష్టాయిష్టాలతో ప్రసక్తి ఏముందిరా పిచ్చివాడా?—నేనే ఉత్తరం వ్రాయమని చెప్పాను. ఏం చెయ్యను చెప్పు, నాతోపాటు యింత అన్నం అయితే పెట్టగలను. కానీ పెళ్ళెక్కడ చెయ్యగలను? వయసు వచ్చిన పిల్లని పెళ్ళిచేయకుండా ఈ పల్లెటూళ్ళో వంటరిగా వుంచటం నాకంత బాగా అనిపించలేదు.'

'అయితే సుధ యిప్పుడు?-'

'విశాఖపట్నంలో ఉండి వుంటుంది.'

'అదేమిటి బాబాయ్? నీకు ఖచ్చితంగా తెలియదా?'

ముసలాయన తెలియదన్నట్టు తలాడించాడు. 'సుధ వ్రాసిన ఉత్తరం చూడగానే ఆయనవచ్చి తీసుకువెళ్ళాడు. వెళ్ళిన ఆర్నెల్ల వరకూ

అప్పుడప్పుడు క్షేమం తెలియజేస్తూ, వాళ్ళు బాగా చూస్తున్నారని ఉత్త రాలు వ్రాసేది. తర్వాత యేమైందో తెలియదు. ఉత్తరాలు ఆగిపోయి నాయి. నేను వుత్తరం వ్రాస్తే తిరిగి వచ్చింది.'

మాధవ్ గుండెల్లోంచి చీల్చుకు వస్తున్న నిట్టూర్పుని శక్తి అంతా వినియోగించి ఆపుకున్నాడు.

ఇద్దరి మధ్యా మౌనం ఆవరించింది.

'సుధ వ్రాసిన ఉత్తరాలు వున్నాయా బాబాయ్?' చివరికి అడి గాడు.

'ఆ! ఒక్క సుధేమిటి? మా యింటికి వచ్చిన యే చిన్న కాగితం అయినా సరే, అలా శాశ్వతంగా ఉండాల్సిందే! ఇదిగో! ఓయ్! నిన్నే. ఆ ఉత్తరాల తీగె ఒక్కసారి యిక్కడకు తీసుకురా-విన్పించిందా నే చెప్పింది?'

అయిదు నిమిషాల తర్వాత కాంతమ్మగారు ఉత్తరాలు దొంతరగా గుచ్చిన ఓ పెద్ద యినుప తీగె ఒకటి తెచ్చి అక్కడ పెట్టి 'మధూ! స్నానానికి నీళ్ళు పెట్టాను లే!' అంది.

'అవున్నా బాబూ! నువ్వు ముందు స్నానంచేసి భోంచేస్తే కాని ఇవి ముట్టుకోవటానికి వీల్లేదు.' ప్రకాశంగారు మాధవ్ చేతిలోని ఉత్తరాలున్న తీగె లాక్కుని దూరంగా పెట్టారు.

'అయ్యో! అదేమిటి ఆ బుగ్గమీద అంత గాయం. నేను సరిగ్గా చూడనేలేదే!' అప్పుడే చూసిన కాంతమ్మగారు ఆదుర్దాపడి ప్రకటించింది.

'ఇదా? ఇది-ఇది చీరుకుపోయింది పిన్నీ!' మాధవ్ తడబడుతూ సమాధానం చెప్పాడు.

'అయ్యో! నాకు చూపు సరిగ్గా ఆనదు. నేను చూడనేలేదు. ముందు దాని కేదయినా మందు చూడు.' ముసలాయన నొచ్చుకుంటూ తొందర చేశాడు.

## 5

స్నానం చేసి భోంచేసిన తర్వాత ఉత్తరాల తీగెలోంచి

సుధ వ్రాసిన ఉత్తరాలన్నీ విడదీసి వరసగా పెట్టుకుని, ఒక్కొక్కటే చదవటం ప్రారంభించాడు. మొదటి మొదటి ఉత్తరాల్లో మాధవ్‌ని గురించి ఒకటి రెండు వాక్యాలున్నాయి. అంతే! తర్వాత తర్వాత ఆ ప్రసక్తేలేదు. వాళ్ళ మామయ్య నాగభూషణంగారు చాలా మంచివాడుట. ఇంట్లో అంతా తనని స్వంత కూతురులా యెంతో ఆపేక్షగా చూస్తున్నారట. వాళ్ళు బాగా వున్నవాళ్ళుట. తనని అపురూపంగా చూస్తుండటంవల్ల జీవితం యే లోటూ లేకుండా హాయిగా గడిచిపోతోందట. సుధ ఉత్తరాలన్నీ ఆ యింట్లో యెంత ఖరీదయిన వస్తువులున్నాయో, ఆ కుటుంబానికి సాటివారిలో యెంత గౌరవం, సంఘంలో యెంత పలుకుబడి వుందో వివరంగా విడమర్చి తెలియ చెబుతున్నాయి. వాటిని ఎన్నిసార్లు తిరిగి తిరిగి చదివినా యెక్కడా యీ పల్లెటూరు వదిలేసి వచ్చినందుకు చింత కాని, మాధవ్ కుటుంబం అలా అయిపోయినందుకు బాధ గానీ కన్పించ లేదు. సుధ వ్రాస్తున్న ధోరణి చూస్తుంటే వెధవ పల్లెటూరు వదిలివస్తే వచ్చాను. హాయిగా నిక్షేపంగా బ్రతుకుతున్నాను అనే తృప్తి కన్పిస్తోంది.

నిరాశతో మాధవ్ మనసు అగాధాల్లోకి క్రుంగి పోసాగింది. ఎంత ఆత్రంగా వచ్చాడు తను! ఎన్ని వూహించుకున్నాడు! అందరితోపాటు సుధ కూడా తను మరణించాడని నమ్మేసిందా? నమ్మితే నమ్మింది. పోనీ కనీసం అతని జ్ఞాపక చిహ్నంగా నాలుగు మాటలు వ్రాయకూడదూ! ఆ రోజు వెన్నెల్లో పొన్నాగచెట్టు సాక్షిగా చెప్పినమాట లంత తేలికగా మర్చిపోయిందా! మొదట విచారంతో కోపం ముంచుకు వచ్చినా వివేకం నచ్చచెప్పటంతో మాధవ్ శాంతి పొందాడు. అవును మరి! ఆడపిల్ల యేం చేస్తుంది. పరిస్థితుల్తో రాజీ పడకపోతే బ్రతుకు దుర్భరం అవుతుందని భయపడి వుంటుంది. ఆ బెదురుపల్లే బాధని గురించిన జ్ఞాపకం గుండెల్లో పదిలంగా యే మారు మూలనో గుప్తంగా దాచుకుని మామూలుగా జీవిస్తూండి వుంటుంది. తనెదురు పడగానే అదే వెల్లువలా బయటికి పొంగి ప్రవహించదూ!

ఆ రాత్రి పడుకుంటే అతనికి నిద్రే పట్టలేదు. దేశానికి స్వాతంత్ర్యం వచ్చింది. అందరూ సంతోషాతిశయాలతో ఆనందం పంచుకుని

పండుగని చేసుకుంటున్నారు. కాని తనకేం మిగిలింది? ఎవరూలేని దిక్కు లేనివాడయ్యాడు. మరణించి అమ్మ దూరమైతే, బ్రతికున్న సుధ వునికి కూడా తెలియనంత దూరంలో వుంది. ఈ ఒంటరితనం నుంచి బయట పడేది యెలా? భయంకరమైన యీ నిరాశనుంచి తేరుకుని మళ్ళీ మని షిగా మారటం యే విధంగా? తనకా శక్తి యెవరు యిస్తారు? ఆవేదనతో అతని హృదయం మెలికలు తిరగసాగింది.

మర్నాడు వూరంతా చూడటానికి వెళ్ళినప్పుడు ఒకసారి తన యింటిని తృప్తిగా చూసుకునేందుకు స్కూలువైపు వెళ్ళాడు. ఇంటిని స్కూలుగా రూపొందించిన ఆ ఆవరణలో పున్నాగచెట్టు లేదు కొట్టేశారు. ఇప్పుడక్కడ చదును చేసిన ప్రదేశం ఆటస్థలంగా మార్చబడి వుంది. మాధవ్ వెళ్ళేసరికి అందులో పిల్లలు ఆడుకుంటున్నారు. బరువెక్కిన హృదయంతో అక్కడ నిలబడలేక తిరిగి వచ్చాడు.

## 6

'నీ పేరుమీద ఆ యిల్లు నేనే చొరవచేసి స్కూలుకు యిచ్చాన్రా అబ్బాయి!'

తర్వాత అన్నాడు ప్రకాశంగారు.

'మంచి పని చేశావు బాబాయి! చాల మంచిపని చేశావు. కాని స్కూలుకి నా పేరు వద్దు. తీయించేసి అమ్మ పేరు పెట్టించు.'

'ఆ రెండెకరాల మాగాణి...' ముసలాయన సందేహంతో ఆగి పోయాడు. ఇన్ని రోజుల నుంచి దానిమీద వస్తున్న శృణమో పణమో దానిమీదనే భార్యా భర్తల యిద్దరి జీవితాలు నిశ్చింతగా వెళ్ళిపోతున్నాయి. అది ఉండటంవల్లనే కొడుకులు చిల్లిగవ్వ పంపకపోయినా కూతురు పురుడూ, పుణ్యం అంటూ అప్పుడప్పుడు వస్తూపోతూ ఉన్నా ఆయనకి మరీ అంత బాధ అన్పించటం లేదు. చచ్చిపోయాడు అనుకున్న మాధవ్ తిరిగి వచ్చాడనుకున్న సంతోషం యెక్కువసేపు నిలువలేదు. ఆయన గుండెల్లో రాయిపడింది.

మాధవ్ దగ్గరగావచ్చి ఆయన భుజంమీద చేయివేస్తూ 'బాబాయ్! అమ్మ పోయినప్పుడు కాస్తోకూస్తో ఖర్చయి వుంటుంది. సుధ కూడా నీ దగ్గిర కొద్దిరోజులుండి వెళ్ళింది. నేను లేనప్పుడు నా కుటుంబానికి చాలా సహాయం చేశావు. ఈ కాస్తలో నీ రుణం తీరిపోతుందనికాదు. కాని ఆ రెండెకరాలు నువ్వు వుంచుకుంటే నాకు తృప్తిగా ఉంటుంది' అన్నాడు.

ముసలాయన కళ్ళు ఆశతో, ఆనందంతో మెరిశాయి. వెంటనే చెమర్చాయి.

'కాని మధూ—' ఏదో చెప్పబోయాడు.

'నా కింకేమీ చెప్పకు. ఈ వూళ్ళో నా కెలాగూ యిల్లు లేదు. ఎప్పుడైనా రావాలనివస్తే నీ దగ్గరకే వచ్చి రెండు రోజులుండి పోతాను.'

'అదికాదు. నీకు-' ముసలాయన తడబడ్డాడు.

'నాకేం ఫర్వాలేదు. జవసత్వాలు పుష్కలంగా వున్నవాడిని. నా ఒక్క పొట్టకోసం ఆ మాత్రం సంపాయించుకోలేకపోను' అన్నాడు. అతను ఆ సాయంత్రమే అక్కడనుంచి వెళ్ళిపోతున్నాడు.

ఇక్కడికి రాగానే జీప్ తిప్పి పంపేస్తూ తన పరిస్థితులు యిలా తారుమారు అయాయని తెలియజేస్తూ వుత్తరం రాసి రాంగోపాలరావు గారికి పంపించాడు. ఆయిన దగ్గరనుంచి వెంటనే సమాధానం వచ్చింది. 'మాధవ్! నీకేమని ఓదార్పు చెప్పాలో తెలియటం లేదు. నా అనేవాళ్ళు లేని భయంకరమైన నిరాశ యెలాటిదో నేను స్వయంగా అనుభవిస్తున్నాను ఆ బాధ నాకు తెలుసు. మాధవ్! నా ఆరోగ్యం అంతగా బాగుండటం లేదు. కొద్దిరోజులు దేశం అంతా తిరిగి రావాలనివుంది. నువ్వు వెంటనే బయలుదేరిరా! నాతోపాటు నిన్నుకూడా తీసుకెళ్ళేందుకు వీలుగా యేర్పాట్లు చేస్తాను. మనిషికి మామూలు సమయాల్లోకంటె అనారోగ్యంగా వున్నప్పుడు ఆదరంగా చూసేవాళ్ళు చాలా అవసరం. ఆప్తులం అంటూ నా చుట్టూ చేరిన బంధువర్గం చాలావుంది. వీళ్ళ ఆప్యాయత అంతా నా ఆస్తిమీద కాని, నామీదకాదని నాకు తెలుసు. నిన్ననే నా దూరపు మేనల్లుడు ఒకడు డాక్టరుదగ్గిరకెళ్ళి ఆయనింకా యెంతకాలం బ్రతుకుతాడని చూచాయగా వివరాలు తెలుసుకున్నాట్ట! ఒక్కమాటలో చెప్పాలంటే వాళ్ళందరినుంచీ దూరంగా పారిపోయేందుకే నా ప్రయాణం. రేపు నేను వరంగల్ వెళు

తున్నాను. అక్కడ మనతోపాటు ఖైదీ అయి జైల్లో మరణించిన నా ప్రాణ స్నేహితుడి తల్లి వుంది. నువ్వు వచ్చేవరకూ అక్కడే వుంటాను. నువ్వు రాగానే మనం బైలుదేరుదాం. మాధవ్! నువ్వీ ప్రపంచంలో యేకాకిని అని యెప్పుడూ అనుకోకు. నీకు నే నున్నాను. అలాగే నాకు కూడా నువ్వున్నావు అనే నమ్మకంతో నీకోసం వేయికళ్ళతో యెదురుచూస్తూ—'

ఆ ఉత్తరాన్ని కనీసం పదిసార్లయినా చదువుకున్న మాధవ్ తృప్తితో నిట్టూర్పు విడిచాడు. జీవితం ఓ దోవ వెతుక్కునే వరకూ తండ్రిలాంటి రాంగోపాలరావుగారి నీడన వుండటం యెంతయినా మంచిది. కానీ— ఆయన దగ్గరకు వెళ్ళేముందు సుధని కలుసుకోవడం చాలా ముఖ్యం అన్పించింది అతనికి.

# 7

పది రోజుల్లో అలాగే అతి ప్రయాసమీద మాధవ్ సుధ అడ్రస్ సంపాదించగలిగాడు. నాగభూషణంగారు కలపవ్యాపారం మీద బాగా సంపాదించాడట! ఆయన ఒక్కగా నొక్క కొడుకు భాస్కరం హైద్రాబాద్‌లో లాయర్ చేస్తున్నాట్ట. ప్రస్తుతం అందరూ అక్కడే వున్నారు. సుధ- భాస్కరం వివాహం జరిగి రెండు సంవత్సరాలకు పైనే అయింది. ఈ సమాచారం విని తేరుకోలేనంతగా క్రుంగిపోయాడు. ఎంత ఆలోచించినా అతనికి సుధమీద కోపంరావటంలేదు. తను చచ్చిపోయాడని అనుకుని ఆ వివాహానికి ఒప్పుకుని వుండివుంటుంది. ఇప్పుడు వెళ్ళి తనుకళ్ళకి కన్పిస్తే సుఖంగా సాగుతున్న సుధసంసార జీవితంలో అనుకోని కల్లోలం రేపినట్టు అవుతుందేమో? ఏం చెయ్యాలి? అలాగని చూడకుండా వుండటానికి అతని మనసు ఒప్పకోవటంలేదు. చూసి సుధని ఓదార్చాలి. 'ఎప్పటికీ నీవాడనే సుధా! నా గురించి ఆలోచనలతో నీ జీవితం పాడుచేసుకోకు. భాస్కరానికి భార్యవైన నువ్వు అన్నివిధాలా అతనికి ఆనందం యివ్వడం ధర్మం.' ఇలా-యింకా యెన్నెన్నో వూహించుకుంటూ అతను హైద్రాబాద్ చేరుకున్నాడు.

సుధ ఇల్లు కష్టపడనవసరం లేకుండా సులభంగానే కనుక్కొన్నాడు. భాస్కరం యింట్లో లేడని తెలిసింది.

'అమ్మగారిని కలుస్తాను' అన్నాడు మాధవ్. అతని గుండెలు చిత్రంగా కొట్టుకోసాగాయి. భర్త ప్రక్కన సుధని చూడటం వేరు. వంటరిగా సుధని కలుసుకోవటం వేరు.

'వీల్లేదు. ఎవరొచ్చినా వీల్లేదు. తర్వాత రమ్మనమని చెప్పమన్నారు' అన్నాడు.

'ఒక్కనిమిషం చాలు.'

'వీల్లేదని చెప్పటంలా? అమ్మగారు క్లబ్‌కి వెళ్ళబోతున్నారు. ఇప్పుడెవర్నీ చూడరు'

మాధవ్ కళ్ళు ఆశ్చర్యంతో పెద్దవైనాయి. క్షణంసేపు ఆగి 'వచ్చింది మీ బావగారు, మాధవ్ అని చెప్పు. అప్పుడుకూడా వీల్లేదంటే అలాగే వెళ్ళిపోతాను' అన్నాడు.

నౌకరు మాధవ్‌ను ఎగాదిగా చూసి లోపలకు వెళ్ళాడు.

మాధవ్ డ్రాయింగురూమ్‌లో నిలబడిపోయాడు. ఆ గది, అందులో సామాను సుధ స్థితిగతులు యెంత వున్నతంగా వున్నాయో వివరిస్తున్నాయి. ధనవంతులకుండే డాబూ దర్పం చక్కగా తెలుస్తోంది. ఐదు నిమిషాల్లో సుధ గదిలోకి వచ్చింది. అడుగుల శబ్దంవిని మాధవ్ తిరిగి చూశాడు. ఎవరీ అమ్మాయి! తెల్లగా, పొట్టిగా, లావుగా ఖరీదుగల సిల్కు చీరెలో వంటినిండా ధగధగలాడుతున్న రాళ్ళనగలతో, నుదుటిమీద కాసంత కుంకుమబొట్టుతో ఎవరు? నిజంగా సుధేనా! మాధవ్ తడబడ్డాడు.

సుధ చేతిలో సన్నజాజులు గులాబీలు కలిపికట్టిన పెద్దమాలవుంది. ఇద్దరూ నిర్విణ్ణులయిపోయినట్టు క్షణంసేపు ఒకళ్ళని ఒకళ్ళు ఆత్రంగా చూసుకుంటూ అలాగే నిలబడిపోయారు.

'సుధా!' ఆగర్వ శ్రీమంతురాలిలా వున్న ఈ వ్యక్తిని సుధగా గుర్తించటానికి అతని మనసు సంకోచిస్తోంది.

'బావా!' సుధ చప్పునవచ్చి అతని చేతులు పట్టుకుంది.

'సుధా!' అతని గొంతు బొంగురుపోయింది.

'బావా! నువ్వేనా? ... నిజంగా- నిజంగా నువ్వేనా?'

'నేనే సుధా! నేనే!' అంతకంటె మించి పలకటం అతనికి సాధ్యం కాలేదు. క్షణాలు దొర్లినాయి.

'జన్మలో మళ్ళీ యిలా నిన్ను సజీవంగా కళ్ళారా చూస్తాననుకో లేదు. ఈ రోజు లేచి ఎవరి మొహం చూశానో!' అతని చేతులు విడిచి పెట్టి కన్నీళ్ళు తుడుచుకుంటూ అంది.

మాధవ్ అలాగే చూస్తున్నాడు.

'కూర్చో బావా! నాకింకా నమ్మకం కలగటంలేదు. నౌకరు చెబు తుంటే నిజంగా నాకు మతిపోయింది.'

ఆదుర్దాలో, ఆ సంభ్రమంలో సుధచేతిలో పూలమాల క్రిందపడి సుధకాళ్ళ క్రింద నలిగిపోయింది.

'అయ్యో!' అన్నాడు మాధవ్ దాన్ని వంగి చేతిలోకి తీసుకుంటూ.

'అదా! పోనీ యింకోటి కట్టుకుంటాను!' నిర్లక్ష్యంగా అనేసి మాధవ్ చేతిని పట్టుకొని సోఫాలో కూర్చోపెట్టి 'ఇప్పుడే వస్తా' అంటూ లోపలికి పరుగెత్తింది.

మాధవ్ వెర్రివాడిలా చేతిలో మాలవైపే చూస్తూ కూర్చుండి పోయాడు. కొద్దిక్షణాలక్రితం కలకలలాడుతూ సజీవంగా నవ్వుతోన్న పువ్వులు వాడి నలిగి దీనంగా చూస్తున్నాయి.

'క్లబ్‌కి రానని ఫోన్ చేశాను.' సుధ తిరిగివస్తూ అంది.

తిరిగి వచ్చిన సుధలో ఓ విధమైన హుందాతనం, గంభీరత్వం.

మాధవ్ క్లుప్తంగా తన కథంతా చెప్పాడు. సుధ సానుభూతిగా స్నేహితురాలిలా వింది. సంభాషణ సుధ విషయాలమీదికి మళ్ళింది. భర్తని గురించిన ప్రసంగం రాగానే సుధముఖంలో కోటి కాంతులు వెలిగాయి.

'ఆయన చాలామంచివారు బావా! నేనంటే ప్రాణం!' సగర్వంగా చెప్పింది. ఆ మాటలు మాధవ్ మనసులో శూలాల్లా గుచ్చుకున్నాయని సుధకి తెలియదు.

సుధ స్థితిగతులు చాలా బాగున్నాయి. ఆనందంగా ఏ లోటూ లేకుండా గడిచిపోతుంది. ఆ సమయంలో నాగభూషణంగారి అండ దొర కడం చాలా అదృష్టం-ఆపకుండా మాట్లాడుతున్న ఆ ధోరణి చూసిం

తర్వాత మాధవ్‌కి సుధని చూస్తున్నాను అనే ఆనందం ఆవిరిలా మాయ మవసాగింది.

'కాని, సుధా!' ఆఖరి సమాగమనం గురించి, ఆ వాగ్దానం గురించి గుర్తుచేయబోయాడు. అది అర్థంచేసుకొన్నట్లు సుధముఖం కొద్దిసేపు ఎర్ర బడింది. వెంటనే తేలికగా తోసేస్తూ 'పో బావా! రేపోమాపో తల్లిని కాబోతున్నానుకూడా. నువ్వా సంగతుల్ని గుర్తుచేశావంటే సిగ్గుతో నా ప్రాణం పోతుంది' అంది. మాధవ్ నిరుత్తరుడైనాడు. అతని మనసు మంచుముద్దని తాకినట్టు చల్లబడి మొద్దుబారిపోసాగింది.

'మారిన పరిస్థితులతోపాటు మనిషికూడా మారటం సహజం. ఆ మార్పును నువ్వు అర్థంచేసుకోవాలికాని, వెక్కిరించకూడదు.'

సుధ స్వరం గంభీరంగా పలికింది. అంతకంటె 'ఆడపిల్లని - నా కంతకంటె గత్యంతరం లేకపోయింది!' అని కన్నీళ్ళ మధ్య అంటే తన కెంత తృప్తిగా ఉండేది.

కాని సుధ యివేవీ ఆలోచించే స్థితిలో లేదు.

'ఇంతకీ ఎక్కడుంటున్నావు నువ్వు?' ప్రసంగం మార్చటానికి కుశలప్రశ్నలు ప్రారంభించింది.

'ఓ స్నేహితుడింట్లో!' పరధ్యానంగా జవాబు యిచ్చాడు.

కొద్దిసేపు ఆలోచించి 'మా యింటికి వచ్చేయి' అంది.

'వద్దులే సుధా!'

'ఎందుకని?'

'నీ కంత శ్రమ దేనికి?'

'భలేవాడవే! రాకరాక నువ్వువస్తే నాలుగు రోజు లుంచుకోవటం నాకు శ్రమా? పోన్లే! ఆయన్ని రానీ, ఆయన స్వయంగా అడిగింతర్వాత వద్దుగాని...'

'నే వెడతా సుధా!'

'అదేమిటి? ఆయన రాకుండానే? మంచివాడవే. కూర్చో-కూర్చో! వుండు కాఫీ టిఫిన్ పంపమని వంటమనిషితో చెప్పివస్తాను.' లేచి లోపలికి పరుగెత్తింది.

ఎంతసేపు ఆయన, ఆయన! ఆయన్ని గురించి తప్ప సుధకి మరో

మాట రాదులావుంది. 'ఆయన చాలామంచివారు. పరిచయం అయితే స్వయంగా నువ్వే ఆ మాట అంటావు.'

ఆయన త్వరలో ఎడ్వోకేట్ కాబోతున్నారు.'

'ఆయనకి నేనందే ప్రాణం.' ఈ మాటలు పదే పదే వచ్చి అతని హృదయాన్ని తూట్లు తూట్లుగా పొడపటం ప్రారంభించాయి. సుధ లేక అతనికి ఒక్క క్షణం గడవదు. ఇంటికిరాగానే కంటికి కన్పించకపోతే 'సుధా! సుధా!' అని ఒకటే కలవరింతలు. సుధని పెళ్ళి చేసుకున్న తర్వాత అతనికి పట్టిందంతా బంగారం అవుతోందట! 'ఇదంతా నీ అదృష్టం. నాదేముంది!' అంటారు. 'స్త్రీకి జీవితంలో యింతకంటే యింకేం కావాలి! ఆడదాని అదృష్టానికి అంతకుమించిన నిర్వచనం యింకేం వుంది!' ఇది సుధ మాటల ధోరణి.

మాధవ్‌కి నిరాశతో పిచ్చెక్కుతోందేమో అన్పించింది. ఎన్ని వూహించుకున్నాడు తను! నాలుగు సంవత్సరాలు అంటే యేమంత పెద్ద కాలం అని. కానీ యీ కొద్దికాలంలోనే సుధ యెంత మారిపోయింది! తనకు తెలిసిన మనిషికి ఈ మనిషికి అసలు పోలికే లేదు. రూపంలోనే కాదు, స్వభావంలోకూడా యెంత వ్యత్యాసం వచ్చింది. తన చిన్నారి మరదలు ఆ అమాయకపు సుధకి బావతప్ప యీ ప్రపంచంలో యింకేమీ అవసరంలేదు. కన్నెవయసులో కమ్మని కలల్లో బ్రతికే ఆ సుధకి జీవితం అంటే భయంలేదు. ఇప్పటి ఈ సుధకి లాయరు భాస్కరంగారి భార్యగా క్రొత్త వ్యక్తిత్వం వచ్చింది. కోర్కెలు పడగలు విప్పాయి. ఆడది సంఘంలో ఆడంబరంగా గుర్తింపబడాలంటే పేరు ప్రతిష్ఠలు పుష్కలంగా వున్న భర్త కావాలి. అవన్నీ సమకూరుస్తున్నాడు కాబట్టి భర్త అంటే అంత ప్రాణమా! చదువురాని సుధకి మధ్యలో కలిగిన సిరిసంపదలతో అమాయకత్వంపోయి, వివేకం నశించి, ఆడంబరంగా బ్రతకాలనే ఆర్భాటం జాస్తి అయింది.

మాధవ్‌కి ముళ్ళమీద కూర్చున్నట్టు కంపరంగా అన్పించింది. ఎప్పుడెప్పుడు బైటపడతానా అని యెదురు చూడసాగాడు.

సుధ కాఫీ టిఫిన్ పట్టించుకు వచ్చింది.

అవి తీసుకోవటం యెలాగో పూర్తి అయ్యాయనిపించుకుని వెళ్ళ

టానికి లేవబోతుండగా ఇంతలో భాస్కరం రానే వచ్చాడు. సుధ పరిచయం చేసింది. సుధ అంత గర్వంగా, తన అదృష్టంగా మురిసిపోతున్న భర్త పొట్టిగా ..లావుగా ఉన్నాడు. అతను చాలా తెలివయినవాడని నిగనిగలాడుతున్న బట్టతలే సాక్ష్యం. ఇంత చిన్న వయసులో అంతజుట్టు వూడిపోవటం యెంత విషాదం! సుధ అతనిలో యేం చూసిందో మాధవ్‌కి యెంత ఆలోచించినా అర్థంగాలేదు.

భాస్కరానికి కూడా మాధవ్ అంటే పెద్ద ఆసక్తి కలగనేలేదు.

ముక్తసరిగా మాట్లాడాడు. ఆ మాటల్లోకూడా తను లాయర్‌ని అనే ఠీవి ప్రదర్శించాడు.

కొద్దిసేపయిన తర్వాత మాధవ్ వెడతానని లేచాడు. భాస్కరం అభ్యంతరం చెప్పలేదు. అతని సోఫా వెనక నిలబడిన సుధ వంగి రహస్యంగా భర్త చెవిలో యేదో చెప్పింది క్షణంసేపు కనుబొమలు ముడివేసుకున్న భాస్కరం వెంటనే ముఖం ప్రసన్నంగా మార్చుకుని 'మీ వరదలు మిమ్మల్ని నాలుగురోజులు వచ్చి వాళ్ళింట్లో వుండమంటోంది' అన్నాడు నిర్లక్ష్యంతో హాస్యం మిళాయించి.

సుధ అదేదో పెద్ద జోక్‌లా పకపకా నవ్వింది.

మాధవ్ మరో అయిదు నిమిషాలు కూర్చుని వుండటానికి వీల్లేదని క్షమాపణ చెప్పుకుని బైటకి వచ్చేశాడు.

o o o o

మెట్లు దిగి వచ్చేస్తూంటే వరండాలో జంటగా నిలబడి వీడ్కోలు యిస్తున్న దంపతులని చూసి అతని మనసు అనుకున్నంతగా యీర్ష్యపడక పోవటం చూసి అతనికే ఆశ్చర్యం వేసింది. గుండెలు బిగబట్టుకుని యెదురు చూసిన సమయమేదో గడిచిపోయి హాయిగా గాలి పీల్చుకున్నట్టుంది కాని, ఇంకో రకమయిన బాధ, ఒంటరితనం లాటిదేదో అతని మనసులో నిండిపోసాగింది. వచ్చేముందు అతను వూహించుకున్న వూహలు ఛాయామాత్రంగా కూడా మిగల్లేదు. అతను బ్రతికి బయటపడ్డందుకు సుధ ఎంతో సంతోషిస్తోంది నిజమే! అందులో ఆత్మీయత వుంది. కాని అనురాగంలేదు. ప్రియ బంధువుగా చిన్ననాటి మిత్రుడిగా అభిమానం వుంది. కాని ప్రియురాలిలా అనుభూతిలేదు. ఇన్ని సంవత్సరాల తర్వాత మరణించాడని

నమ్మి మర్చిపోయిన మనిషి బ్రతికి కళ్ళముందు కన్పించినందుకు ఆపుకో లేని సంతోషం వుంది. కాని అందులో యెన్ని రోజులనుంచో యెదురు చూసి చూసి తపన పొంది నిరాశతో క్రుంగి అనుకోకుండా మళ్ళీ పొందిన వుపశాంతి లేదు. ఇప్పటి యీ సుధకి యిల్లు, భర్త, పిల్లలుతప్ప ఇంకో విషయం ఆలోచించేందుకు అసలు తీరుబడిలేదు. మాధవ్‌ని గురించి కుశల ప్రశ్నలు వేయడంకంటే మానసికంగా అతని పరిస్థితి తెలుసుకోవాలనే అభిమానంలేదు. సుధ గుర్తుకువస్తే అతనికి అకారణంగా చిరాకు కలుగ సాగింది. అసలు చూడకుండా వున్నా బాగుండేది. అదో విధంగా ఒక మధురమయిన అనుభూతిగా కలకాలం గుర్తుండేది. కన్నకలలు కాలి బూడిద అయినాయి. ఊహలు యెండమావుల్లో పక్షిగించాయి. కట్టుకున్న ఆశాసౌధం గాలిమేడలా అంతరించిపోయింది. ఏం చెయ్యాలి తను! ఎక్క డుండాలి! సుధలేని ఈ జీవితాన్ని ఏం చేసుకోవాలి! నిర్దాక్షిణ్యంగా సుధ కల్పించి పోయిన ఈ వంటరితనాన్నుంచి యే విధంగా తప్పించుకోవాలి? అన్నీ ప్రశ్నలే! ఒక్కదానికీ సమాధానంలేదు. తనెవరికీ అవసరం లేదు. ఈ ఆలోచనే అతన్ని ఆశక్తుడిని చేస్తోంది. భయంకరమైన నిరాశ శరీ రంలో ప్రతి అణువుని కాల్చేస్తోంది. అర్థంగాని ఈ వెలితిని చూసి అంత రాత్మ భయం భయంగా ముడుచుకుపోతోంది. అనుకున్నది పొందలేక అప జయం పొందిన మనసు అవమానంతో కరకర మంటోంది. కోపంతో రక్తం వుడికిపోసాగింది. కానీ ఏం చేస్తాడు? అకారణంగా కలిగిన యీ ఆగ్రహాన్ని యెవరిమీద వెడలగక్కుతాడు? ప్రతీకారం యెవరిమీద తీర్చు కుంటాడు! అసలు యీ వూరే, యీ గాలే అతనికి విషపూరితంగా అని పించింది.

# 8

మాధవ్ మరో గంటలో రైల్వే స్టేషన్‌లో ఉన్నాడు అతను ప్లాట్‌ఫారం మీదకి వచ్చేసరికి సరిగ్గా ట్రెయిన్ కదలబోతోంది. టికెట్ కొనే వ్యవధిలేదు. కొనాలనికూడా అతనికి లేదు. ఎదురుగుండా అందిన పెట్టె లోకి యెక్కేశాడు. ఫస్టు క్లాసు పెట్టె అది. పెట్టెలో ఎవరూ లేరు. అంతా

ఖాళీగా వుంది. కానీ, ఇలాగే అవనీ! టికెట్ లేకుండా ఫస్టు క్లాసులో ప్రయాణం చేస్తాడు. ఒకవేళ టికెట్ కలెక్టర్ టికట్ యేది అని అడిగితే లేదు అని దబాయిస్తాడు. అతనేదయినా మితిమీరి మాట్లాడితే పట్టుకు కొడ తాడు. తద్వారా జైలు. అదే నయం. ఈ బయట ప్రపంచంకన్నా ఆ జైలే బాగుంటుంది. మాధవ్ దృఢనిశ్చయంతో కూర్చున్నాడు. ఒక్క టిక్కెట్ కలక్టరేకాదు. అసలు పెట్టెలోకి రాబోయే యెవరయినాసరే, వాళ్ళని పిలిచి కయ్యం పెట్టుకోవాలనే స్థితిలో వున్నాడు. లేకపోతే అతనికి పిచ్చిపట్టే ట్టుంది.

ట్రెయిన్ కొద్దిసేపటిలోనే వచ్చి సికింద్రాబాదు స్టేషన్‌లో ఆగింది. మాధవ్ యెంత ఆశగా చూసినా యెవరూ వచ్చి పెట్టెలో యెక్కలేదు. టైమ్ అయిపోతోంది. ట్రెయిన్ మళ్ళీ కదలటానికి సిద్ధమౌతోంది. ఇక్కడ కూడా నిరాశే. అసలీ స్థితిలో వంటరిగా వుండాలంటేనే అతనికి ధైర్యం చాలడంలేదు. అనుకోకుండా చాలా సున్నితమయినచోట దెబ్బ తిన్న మనసు వివేకం కోల్పోయింది. తనకేమయింది ఈ రోజు? పిచ్చి పట్టిన గుర్రంలా మనసు యీ వెర్రిగంతులేమిటి? మాధవ్‌కి తనంటే తనకే విసుగేసింది. ఇన్ని రోజులనుంచి రాంగోపాలరావుగారి సాంగ త్యంలో తీర్చిదిద్దుకున్న వ్యక్తిత్వం యేమైపోయింది! ఆయన దగ్గర జీవి తాన్ని గురించి నేర్చుకున్న పాఠాలు ఏ గంగలో కలిశాయి? ఆయన్ని గురించిన ఆలోచనలు రాగానే అతను కొద్దిగా శాంతపడ్డాడు. వృద్ధుడు, సజ్జనుడు, పితృసమానుడు అయిన ఆయన జ్ఞాపకం రాగానే వివేకం కొద్ది కొద్దిగా కోలుకోసాగింది. మాధవ్ దిగివెళ్ళి టికెట్ కొనుక్కుందామను కున్నాడు. అప్పటికే రైలు కదలటానికి సిద్ధమౌతున్నట్లు కూత వేసింది. మాధవ్‌లేచి బాత్‌రూమ్‌వైపు వెళ్ళాడు.

అతను తిరిగి తలుపులు తెరిచేసరికి కంపార్టుమెంటులో యెవరో యెక్కారు. ఎదురుగుండా బెర్తుమీద సామాను కన్పించింది. అమ్మయ్య అని వూపిరి పీల్చుకుని తోటి ప్రయాణీకునికోసం కంపార్టుమెంటు అంతా కళ్ళతో వెతికేసరికి గుమ్మందగ్గర తలుపు లోపల గడియవేస్తూ ఒక అమ్మాయి కన్పించింది. వంటరిగా ప్రయాణం చేయటానికి యింకెవ్వరూ బయటనుంచి లోపలికి రాకుండా తలుపు, కిటికీమూసి బందోబస్తు చేసు

కుంటోంది. మాధవ్ బాత్‌రూమ్ గుమ్మందగ్గర నిలబడిపోయి అలాగే చూడ సాగాడు.

తలుపు సరిగ్గా పడిందో లేదోనని మరోసారి గట్టిగా పరీక్షచేసి తృప్తి పొందిన ఆ అమ్మాయి వెనక్కు తిరిగింది. మాధవ్ కదిలి ముందుకు వచ్చి బెర్తుమీద కూర్చున్నాడు.

వంటరిగావున్న కంపార్టుమెంట్‌లో మొట్టమొదటిసారిగా అప్పుడే అతన్ని చూస్తున్న ఆ అమ్మాయి కళ్ళు ఆశ్చర్యంతో పెద్దవైనాయి. వాటిల్లో లీలగా భయంకూడా తొంగిచూసింది. నిజంగా ఏం ఆడవాళ్ళు? లేని ఉద్దేశాలు కలిగించి రెచ్చగొట్టటంలో సిద్ధహస్తులు. అతనివైపు చూస్తుండగానే ఆ అమ్మాయి ముఖంలోకి విపరీతమైన భయంవచ్చి నిండింది. చెయ్యి అప్రయత్నంగా గుండెలమీదకి వెళ్ళింది. నిర్లక్ష్యంగా ఇదేం పట్టనట్టు జేబులోంచి సిగరెట్ తీసి వెలిగించుకోబోతున్న మాధవ్ హఠాత్తుగా ఆగిపోయాడు. అతని చూపులు ఆ అమ్మాయి గుండెలమీద నిలిచి, అక్కడ వేళ్ళాడుతున్న పులిగోళ్ళని పరీక్షగా చూశాయి. ఈ అమ్మాయి-ఈ అమ్మాయి! చేతిలో వెలిగించి పట్టుకున్న అగ్గిపుల్ల పూర్తిగా కాలి వేలికంటి చురుక్కుమంది. రైలు అప్పటికి ప్లాట్‌ఫారం వదిలి పూర్తివేగాన్ని అందుకుంది.

అతను సంభ్రమాశ్చర్యాలతో చూస్తుండగానే ఆ అమ్మాయి-కళ్ళు ఆత్రంగా కంపార్టుమెంట్ అంతా వెతికి అలారం బెల్ వున్నచోట నిల్చాయి. ఆ అమ్మాయి చూపులని వెంటాడుతున్న మాధవ్‌కళ్ళు అలారం బెల్ తను కూర్చున్న చోటుకి దగ్గరగా ఉండడం గ్రహించి కొంటెగా నవ్వాయి. క్షణంసేపు బేలగా చూసిన ఆ అమ్మాయి మరుక్షణంలో ధైర్యం తెచ్చుకుని తల యెగరేసి బెర్తుమీద కూర్చుంది. మాధవ్ చెయ్యి అప్రయత్నంగా చెంపమీద తడుముకుంది. అక్కడ అదివరకు ఆ అమ్మాయి యేర్పరచిన గాయం శాశ్వతమైన ముద్రగా బలంగా చీకుకుపోయినట్టు లోతుగా గంటు యేర్పరచింది. మాధవ్‌కి క్షణంసేపు ఆ అమ్మాయిని యేం భయపడవద్దని, 'ఆ రోజుకూడా అనవసరంగా అపోహపడ్డావు. ఆ రోజు నీ చేయి పట్టుకోవటం నాది తప్పేకాని నా మనసులో అసలు వుద్దేశం ఇది'- అని అంతా వివరంగా చెప్పాలనిపించింది. 'నేను నిన్నేం చేయను.

నానుంచి నీకేం ప్రమాదం జరగదు' అని నాలిక చివరిదాకా వచ్చిన మాటలని ఆ అమ్మాయి కళ్ళలో కన్పించిన ఆ బెదురు, వెంటనే ఆ తల తిప్పేసుకోవటంలో ఆ పొగరు చూసిన తర్వాత కాసేపు యేడిపించి, తర్వాత చెప్పవచ్చనే చిలిపికోరిక ఆపేసింది.

ఆ అమ్మాయి ప్రక్కగా, కొద్దిదూరంలో వచ్చి అదే బెర్తుమీద కూర్చున్నాడు. అప్పటికికూడా అలారం బెల్ అందుకోవాలంటే అతన్ని దాటి వెళ్ళాల్సిందే! అతను ఓ కాలుజాపి ఆ వీలు చూసుకుని మరీ కూర్చున్నాడు. తను కూర్చున్న బెర్తుమీద వచ్చికూర్చున్న అతన్ని చూసి భయపడలేదు. అసహ్యించుకున్నట్టు ముఖం పెట్టింది. 'నువ్వు నన్నేం చెయ్యలేవు' అన్నట్టు ధీమాగా చూసి ప్రక్కకు తిరిగి కిటికీతలుపు ఒకటి పైకి ఎత్తబోయింది. దానికంటె ఆ అమ్మాయి బెదిరిపోయినట్టు, భయపడ్డట్టు, జాలిగా చూస్తే అతను కరిగిపోయేవాడు. తక్షణం తన ప్రవర్తనకి సిగ్గుపడి క్షమాపణ చెప్పుకుని వెళ్ళి తన చోటులో కూర్చునేవాడు. కాని 'నువ్వు నన్నేం చెయ్యలేవు' అనే ఆ నిర్లక్ష్యపు ప్రవర్తన అతన్ని రెచ్చగొట్టింది. అందుకే వెంటనే వచ్చి తెరవబోతున్న కిటికీని ఆపుచేశాడు.

ఈ అదనుకోసమే చూస్తున్నట్టు ఆ అమ్మాయి ఒకసారి లేచి మెరపులా అలారం బెల్‌వైపు పరుగెత్తబోయింది. మాధవ్ చురుగ్గా కాలు అడ్డు పెట్టేశాడు; చటుక్కున అతని కాలు అడ్డురావటంతో తూలి పడబోయింది. క్షణంలో అతని బలిష్టమైన చెయ్యివచ్చి ఆ అమ్మాయి బోర్లా పడకుండా ఆపేసింది. కోపంతో యెరుపెక్కిన కళ్ళతో తీక్షణంగా అతని వైపు చూసింది. అతను నవ్వాడు.

ఆ అమ్మాయి చెయ్యి బలంగా విడిపించుకో బోయింది. కాని సాధ్యం కాలేదు. కొద్దిసేపు చూసి మాధవ్ చెయ్యి వదిలేశాడు.

మరుక్షణం రెండు చేతుల్తో అతన్ని బలంగా తోసేసింది. ఇంకొక్క సెకన్‌లో అలారం బెల్ చేతికి అందేదే! కాని ఈ లోపలే లేచిన మాధవ్ రెండుచేతులు చాచి ఆ అమ్మాయి శరీరం మొత్తాన్ని అందుకొని ఇవతలికి లాగేశాడు. ఆ లాగే ప్రయత్నంలో అటు ఇటు కదులుతూ పోతున్న రైలు వేగానికి నిలబడలేక బెర్తు మీదికివచ్చి పడ్డారు.

'ఇప్పుడు?–' కసిగా అన్నాడతను.

సహసాసంగా ఆ అమ్మాయి చేతులువచ్చి మాధవ్ ముఖాన్ని బలంగా టపటప మనిపించాయి. మొదట్లో క్షణంలో సగంసేపు నిరుత్తరుడైనా అతను వెంటనే ఒకచేతితో ఆ రెండు చేతుల్ని గట్టిగా పట్టుకుని కదలకుండా బంధించాడు. మరో చేతితో ఆ అమ్మాయి శరీరాన్ని లేవకుండా నొక్కి పెట్టేశాడు. క్షణంసేపు కాలం నిలిచిపోయింది. మాధవ్ అందంగా సోగగావున్న ఆ కాటుక కళ్ళలోకి చూస్తుండిపోయాడు. ఆ అమ్మాయి కళ్ళు రెపరెప లాడిస్తూ భయం భయంగా చూసింది. ఆ చూపు అతని యవ్వనాన్ని రెచ్చగొట్టింది. దగ్గరగా హత్తుకొనివున్న కోమలమైన శరీరం కోర్కెని నిద్రలేపింది. వివేకాన్ని వుద్రేకం నోరుమూసుకోమని ఆజ్ఞాపించింది. అప్పుడెప్పుడో అవమానంపొందిన అంతరాత్మ ప్రతీకారం తీర్చుకోమని తొందరపెట్టింది. అతనిలో మంచితనాన్ని కోర్కెతో మత్తెక్కి తూలుతున్న పశుత్వం జయించింది.

క్షణంసేపు కంగారుపడ్డాడు! భయపడ్డాడుకూడా. కాని మరుక్షణంలో నిజంగానే అతనికి మతిపోయింది.

మొదట్లో తీవ్రంగా పెనుగులాడి యెదురు తిరిగిన ఆ అమ్మాయి శరీరం చివరక్షణంలో అలిసిపోయి, అది మానేసి అతనికి లొంగిపోయింది.

o o o o

సమయం గడిచింది. అనుకోని ఈ సంఘటనకి తనుకూడా బెదిరిపోయినట్టు రైలు మరింత వేగంగా ఆగకుండా పరుగెత్తుతోంది. మాధవ్ లేచి సరిగ్గా కూర్చుని ఆ అమ్మాయిని ఒళ్ళోకి లాక్కున్నాడు. అప్పటికే అచేతన అయిన శరీరం వడిలిన తామరతూడులా అతని చేతులమధ్య వేళ్ళాడిపోయింది. మాధవ్ పరిశీలనగా ఆ ముఖంలోకి చూశాడు. రెప్పలు మూతలుపడిపోయి, కొద్దిగా నలిగిపోయినట్టున్న ఆ ముఖం క్షణంలో అలిసి మత్తుగావున్న అతని కళ్ళకి అపురూపంగా, అద్భుతంగా కన్పించింది. చాలాసేపు అలాగే చూస్తూ కూర్చుండి పోయాడు. స్పృహలేని స్థితిలో కూడా ఆ అమ్మాయి యేడుస్తున్నట్లు కంఠం దగ్గిర నరాలు అదరసాగాయి.

అతను ప్రేమగా ఆమె నుదుటిమీద పడిన జుట్టును తొలగించాడు. హఠాత్తుగా అతనికి జాలేసింది. ఇదేమిటి? ఇలా అయిందేం? పశుత్వం అను

కోకుండా తనని యెందుకిలా లొంగదీసుకుంది! పసితనం పూర్తిగాపోని ఆ ముఖం చూస్తున్నకొద్దీ అతనికి మతిపోతున్నట్టు అన్పించింది. ఏం చెయ్యాలి తను? ఇప్పుడు తన కర్తవ్యం యేమిటి? ముక్కూ మొహం తెలియని ఈ అమ్మాయిని ఇలా వదిలేయటమా? లేక-లేక- ఆ అమ్మాయి కళ్ళు విడిపడ్డాయి.

అతను స్నేహపూరితమైన చల్లటి చిరునవ్వు నవ్వాడు.

భయంగా, వెర్రిగా చూసిన ఆ అమ్మాయి ముడుచుకుపోతున్నట్టు వెనక్కు వెనక్కు జరిగింది.

'భయపడకు.' మీదకు వంగి మృదువుగా చెప్పాడు. కాని ఆమాట విన్పించినట్టే లేదు. ఇంకోసారి ఆ అమ్మాయి ముఖం కాంతి విహీనం అయిపోయింది.

o o o o

హఠాత్తుగా రైలు ఆగటంతో అతను అదిరిపడ్డాడు. ఊపిరి బిగపట్టి కాబోయే శబ్దాలకోసం శ్రద్ధగా ఆలకించాడు. కాని ఎన్ని నిముషాలు గడిచినా యేంకాలేదు. ఎవరూ రాలేదు. అసహనంతో, ఆదుర్దా పట్టలేక తన ఒడిలో వున్న ఆ అమ్మాయిని సరిగ్గా పడుకోపెట్టి లేచివెళ్ళి కిటికి తలుపు తెరిచాడు. చల్లటిగాలి రివ్వుమంటూ లోపలికి వచ్చింది. బైటంతా గాఢాంధకారం. దగ్గర్లో ఏదో స్టేషను రాబోతున్నట్టుంది. సిగ్నల్‌కోసం అనుమతి కోరుతూ రైలు బిగ్గరగా విసుగ్గా కూతలేస్తోంది. బైటకిచూస్తున్న అతని కళ్ళు తిరిగివచ్చి బెర్తుమీద అలిసిపోయినట్టు అచేతనంగా పడుకున్న ఆ అమ్మాయి ముఖంమీద నిలిచాయి. ఆమెకి మెలకువ రాకముందే తను దిగిపోతే! తప్పు చేసినప్పుడు శిక్ష పొందటానికి వెరిచే వ్యక్తిత్వం కాదు అతనిది. తను చేసిన ఈ దుష్కృత్యానికి యెలాంటి శిక్ష అయినా పెదవి కదపకుండా, తలెత్తకుండా స్వీకరించగలడు. కాని- కాని, ఈ సిగ్గుమాలిన పని ఇంకెవరికో తెలిసి, వాళ్ళేదో తీర్పు చెప్పేకంటె ఆ శిక్షయేదో తనకి తనే విధించుకోవటం మంచిది.

మరో అయిదు నిమిషాల్లో అతను రైల్లోంచి దిగేశాడు. ఆకాశంలో దట్టంగా నల్లటి మబ్బులు ఆవరించుకుని ఉన్నాయి. చల్లగా సన్నగా వాన తుంపరలతో కలిసి వీస్తున్న గాలి అతని శరీరాన్ని తాకి సేద తీర్చ

సాగింది. మాధవ్ కదలబోయే రైలు కిందపడి ఆత్మహత్య చేసుకోవాలనే దృఢనిశ్చయంతో దిగాడు. కాని పది నిమిషాల తర్వాత కాని రైలు కదల లేదు. ఒక నిశ్చయాన్నుంచి తిరిగి పోవటానికి, మనిషి తేరుకోవటానికి, జీవితంమీద వెయ్యిరెట్లు తీపి కలగటానికి ఆ పదినిమిషాలు చాలు. అతని ధైర్యం సన్నగిల్లింది. చావబోయేసరికి బ్రతుకు మరింత మధురంగా కన్పించి చిరునవ్వుతో చేతులు జాచింది. దానితో దృఢ నిశ్చయం కొద్దిగా సడలింది. ఆ సడలింపుతో బలవంతంగా చేతుల మధ్య పట్టి బంధించిన చావాలనే కోర్కె పిట్టలా రెక్కలు విదిలించుకుని తుర్రున పారిపోయింది. తను అవును కాదు అని మనసులో కొట్లాడుతుండగానే రైలు వెళ్ళిపోయింది. వెళ్ళిపోయిన రైలువంక నిస్సహాయంగా చూస్తూ నిలబడిపోయాడు.

చాలా సేపు అయిన తర్వాత మాధవ్ నిద్రలో లేచి నడుస్తున్న మనిషిలా తూలుతూ రైలు పట్టాలవెంబడి నడకసాగించాడు. దూరంగా మినుకుమినుకు మంటున్న లైట్లనిబట్టి అక్కడ స్టేషనేదో వున్నట్లు అన్పిస్తోంది. ఆ లైట్లని చేరుకోవటానికి అతనికి చాలా సేపు పట్టింది.

# 9

పై సంఘటన జరిగిన తర్వాత దాదాపు ఐదారు సంవత్సరాలకి ఈ మధ్యకాలంలో దేశంలో చాలా మార్పు వచ్చింది. వందలాది సంవత్స రాలుగా హీనమైన బానిస బ్రతుతో అంధకారంలో క్రుంగిన మనుష్యులకి స్వాతంత్ర్యం నూతన కాంతిని తెచ్చింది. ముసల్మానులు హిందువులతో పోట్లాడి విడిపోయి పాకిస్తాన్ ఏర్పరచుకున్నారు. జాతిపిత మహాత్ముడు మరణించాడు. తుపాకిగుండుకి బలియై నేలకి ఒరిగిపోయిన ఆయన నిష్క్రమణంతో కొత్తగా లభించిన ఈ వెలుగుకూడా ఆరిపోతుందేమోనని భయపడ్డ ప్రజానీకంనుంచి జవహర్‌లాల్ ముందుకు వచ్చి, ఆ జ్యోతి అందుకుని నిలబడ్డాడు. స్ఫూర్తిదాయి, సాహసవంతుడు అయిన ఆయన నాయకత్వంలో భారతజాతి శిధిల మవటానికి సిద్ధంగావున్న ఈ జీర్ణగృహాన్ని సరిచేయ టానికి ముందుకు నడిపించి, దేశం బాగుపడి పురోభివృద్ధి చెందటానికి ప్రణాళికలు సిద్ధమైనాయి. స్వతంత్రంగా నిలబడ్డామని యెదురు తిరిగిన

సంస్థానాలు కొన్ని సర్దార్ పటేల్ నాయకత్వంలో ఒక త్రాటిక్రిందకువచ్చి యూనియన్‌లో కలిసిపోయినాయి.

ఈ సందిగ్ధంలో మనుష్యుల జీవన పరిస్థితులు కూడా చాలా తారుమారు అయినాయి. ఓడలు బళ్ళు అయినాయి. బళ్ళు ఓడలుగా మారినాయి. లక్షాధికారులు బిక్షాధికారులుగా మారితే, పూటకి గంజినీళ్ళకి గతిలేని కొందరు కోటికి పడగలెత్తారు. దేశంలో క్రమంగా శాంతి భద్రతలు నెలకొల్పబడినాయి. ప్రజల్లో ప్రశాంత జీవనం ప్రారంభమైంది.

దేశంతోపాటు మాధవ్ జీవితంలోకూడా పెద్ద మార్పు వచ్చింది. రాంగోపాలరావుగారు మరణించి దాదాపు ఆర్నెల్లు కావస్తోంది. ఈ అయిదారు సంవత్సరాలుగా మాధవ్ ఆయన్ని నీడలా అంటిపెట్టుకుని వెంటే వున్నాడు.

సత్యాగ్రహం సమయంలో అనేక సంవత్సరాలు జైల్లో మగ్గటం వల్ల అసలే అంతంత మాత్రమైన ఆయన ఆరోగ్యం దెబ్బతింది. ఎంత డబ్బు ఖర్చుపెట్టినా, ఎంతమంది డాక్టర్ల దగ్గిర మందు పుచ్చుకున్నా, ఎంత ఆరోగ్యప్రదమైన ప్రదేశాల్లో ఎన్ని రోజులు గడిపినా ఆయన శరీర స్థితి మామూలు పరిస్థితికి రాలేదు. నానాటికి క్షీణిస్తున్న ఆయన ఆరోగ్యం చివరికి క్షయలోకి దింపింది. ఈ సంగతి తెలియగానే ఇక ఎక్కువ కాలం ఆయన బ్రతకడని గ్రహించిన బంధువులు ఈగల్లా ముసురుకున్నారు. వాళ్ళనుంచి ఆయన్ని తప్పించి ప్రశాంతంగా వుంచడమే మాధవ్‌కి పెద్ద సమస్య అయికూర్చుంది. ఒక్కోసారి ఆయనే మరీ నీడలా వెంటేవున్న అతన్ని చూసి 'అంటువ్యాధి, మర్చిపోకు!' అని హెచ్చరించేవారు. కాని అతనలాంటి హెచ్చరికలు యేవీ లక్ష్యపెట్టేవాడు కాడు. మరీ చివరిరోజుల్లో కన్న సంతానంకంటె మిన్నగా కంటికి రెప్పలాగా కాపాడుతున్న మాధవ్‌ని చూసి చలించిపోయిన ఆయన అతని బలిష్టమైన చేతిని తన దుర్బలమైన చేతిలోకి తీసుకుంటూ 'ఇది ఏనాటి ఋణం మధూ?' అనేవారు.

'ఋణం అనకండి! మనసులు కలిసిపోయిన తర్వాత సాటి మనిషిలా చూసే మంచితనం. అంతే!' అనేవాడు మాధవ్. నిష్కల్మషమైన అతని ఆదరణకి, ఆడంబరం లేకుండా అతను చూపే ఆప్యాయతకి ఆయన మనసు పులకించిపోయేది. మరీ జీవితపు చరమదశలో కన్నకొడుకు లేని లోటును

అన్ని విధాలా తీరుస్తున్న అతన్ని చూస్తుంటే మనసులో లోలోపల కలిగిన ఆనందాన్ని, తృప్తిని ఆయన హృదయాంతరాళాల్లో పదిలంగా దాచుకున్నాడు. కాని ఒక్కనాడు ఒకమాట కూడా బైటకి రానివ్వలేదు.

ఆయన మరణించిన తర్వాత వారసులమంటూ ఎగబడిన బంధువులని, మాధవ్‌ని కూర్చోపెట్టి లాయర్లు విల్లు చదివి వినిపించారు. అందులో హైదరాబాద్‌లో ఆయనకున్న విశాలమైన భవంతిని తమిద్దరి భార్యాభర్తల పేరుమీద పేదలకి వుచితంగా సేవచేసే చికిత్సాలయంగా మార్చాలని కోరారు. తనకున్న వ్యాపారంమీద వచ్చే ఆదాయంలో మూడు వంతులు హాస్పిటల్ ఖర్చులకి కేటాయించాలని, మిగతా ఒక వంతు తను దత్తపుత్రుడుగా స్వీకరించిన మాధవ్‌కి చెందాలనీ ఆదేశించారు. మాధవ్ తనే స్వయంగా వ్యాపారంచూసుకుని హాస్పిటల్ అభివృద్ధి చెందేలా చేయాలని, ఇది తన కడపటి కోర్కె అనీ తెలియజేశారు. ఇవికాక హైదరాబాదుకి 40 మైళ్ళ దూరంలో వున్న పల్లెటూరులో వున్న పది ఎకరాల పొలం, తరతరాలుగా వస్తున్న అక్కడున్న ఇల్లుగూడా మాధవ్‌కి చెందుతాయి. తనుమరణించిన మరుక్షణంనుంచి మాధవ్ తన ఇంటిపేరుతోనే వ్యవహరించాలి! అంతే కాదు, పల్లెటూళ్ళో వున్న ఆ ఇల్లు, పొలం ఎట్టి పరిస్థితుల్లోనూ అమ్మటానికి అతనికి హక్కు ఉండదు. అవి వారసత్వంగా మాధవ్ సంతానానికి చెందుతాయి.

ఈ విల్లు వినగానే బంధువులందరితోపాటు మాధవ్ కూడా నోరు తెరిచాడు. ఆయన మనసులో వున్న అభిమానం ఈ విధంగా కొడుకులా స్వీకరించేటట్టు చేస్తుందని అతను కల్లోకూడా అనుకోలేదు. ఈ విల్లుసంగతి ముందుగా ఏమాత్రం తెలిసినా, ఆ ఇల్లు, పొలం, వ్యాపారంలో ఆ భాగం-వాటిని తను సంపూర్తిగా తిరస్కరించేవాడు. బహుశా ఇది గ్రహించే ఆయన ఎప్పుడూ సూచనగా ఒక్కమాట అయినా బైటకి రానివ్వలేదేమో! నిజంగా, ఆయన అన్నట్టు ఏనాటి ఋణం ఇది? కృతజ్ఞతతో, అభిమానంతో మాధవ్ కళ్ళు చెమర్చినాయి. వచ్చిన బంధువులంతా మాధవ్ ముఖంమీదే తిట్టారు. 'ఆఖరి సమయంలో, దగ్గిరచేరి బలవంతాన అలా వ్రాయించుకున్నావు' అన్నారు. 'అసలు ఆ స్త్రీమీద కన్నువేసి ఆయన్ని మా అందరినుంచి దూరంగా పెట్టావు' అన్నారు. 'అయినా ఇప్పుడు మాత్రం ముంచుకు

పోయింది ఏముంది? నిన్ను కోర్టుకి లాగి, నీ అంతు కనుక్కోకపోతే చూడు' అంటూ సవాలు చేశారు. 'నీ గోళ్ళూడగొట్టి అదంతా మళ్ళీ వేలం పొందేవరకూ నిద్రపోం' అని ప్రతిజ్ఞలు చేశారు. లాయరు ముందుకు వచ్చి అసలిగొడవ ఏదీ మాధవ్‌కి తెలియదనీ, అతను అమాయకుడనీ చెప్ప బోయాడు. 'చాలు-చాలు- మీరంతా కలిసి పన్నిన కుట్ర. ఇందులో మీ కెంత భాగం వుందో మాకేం తెలుసు?' అంటూ లేచిపోయారు వాళ్ళు.

రెండు మూడు రోజుల్లోనే మాధవ్‌మీద దావా తెచ్చారు వాళ్ళు. కాని అతను వీటి వేటికీ చలించలేదు. ఈ ప్రపంచంలో అతనికి వున్న ఒక్కగా నొక్క ఆప్తుడు, గురుతుల్యుడు, పితృసమానుడు దూరమై నందుకు దిగులుతో బరువెక్కిన హృదయాన్ని ఎలా ఊరడించుకోవాలో అర్థం కాలేదు. ఇన్ని సంవత్సరాల ఆయన సాహచర్యంలో ఆయనకిచ్చిన దానికంటె పొందిందికూడా చాలా వుంది. రైల్లో ఆ రోజు అకస్మాత్తుగా ఆ భయంకరసంఘటన జరిగిన తర్వాత ఆత్మహత్య చేసుకోటానికి ధైర్యం చాలని ఆతనికి ఆవేదనతో మతి చలిస్తోందేమోనన్న భయం వేసింది. కాని దానినుంచి ఆయనకి తెలియకుండానే రక్షించారు. ఎన్నిసార్లో తను చేసిన సిగ్గుమాలిన పనిని ఆయనకి నోరు తెరిచి చెప్పి ఏం చేస్తే ప్రాయ శ్చిత్తం చేసుకున్నట్టు అవుతుందో చెప్పమని అడగాలనుకున్నాడు. కాని అడగలేకపోయాడు. తర్వాత తర్వాత రోజులు గడిచినకొద్దీ ఆగాయంమాని మెల్లగా మర్చిపోవటానికి కావాల్సిన శక్తిని మనసు సంపాయించుకుంది.

ఆ విధంగా రాంగోపాల్‌గారి మరణంతో మాధవ్‌జీవితం మలుపు తిరిగింది. ఈ మలుపు తిరిగీ తిరగ్గానే అతనికి ఆయన వ్యాపారం, హాస్పిటల్‌గా మార్చాల్సిన ఇల్లు, వాటిద్వారా ఇంకా అనేక బాధ్యతలు వచ్చి మీదపడ్డాయి. రోజులు క్షణాల్లా దొర్లిపోసాగాయి.

# 10

ధనం ఎప్పుడూ ఒంటరిగా రాదు. చుట్టాల్ని, స్నేహితుల్ని, కీర్తి ప్రతిష్ఠలని వెంటపెట్టుకుని సకుటుంబ పరివారంగా అన్నట్టు ఆడంబరంగా వస్తుంది. వెళ్ళిపోయేటప్పుడూ అంతే! అందర్నీ వెంటబెట్టుకుని నిశ్శబ్దంగా నిష్క్రమిస్తుంది.

మాధవ్‌కి కొత్తగా లభించిన సిరిసంపదలతో పాటు కొత్తస్నేహితులు చాలామంది దొరికారు. మాధవ్‌కి నచ్చింది, మనసుకి దగ్గరగా వచ్చింది ప్రసాద్ అని ఒక డాక్టరు. ప్రసాద్ రాంగోపాలరావుగారి సహాయంవల్ల చదువుకుని పైకి వచ్చాడు. ఆయన ప్రతికుఁడగా కలిగిన పరిచయం రాను రాను పెరిగి మంచి స్నేహంగా రూపొందింది. ప్రసాద్‌కి కూడా మాధవ్ అంటే ఎంతో గౌరవం ఉంది. విశిష్టమైన అతని వ్యక్తిత్వం అంటే గాఢమైన గౌరవాభిమానాలున్నాయి. మాధవ్ అప్పుడప్పుడూ వాళ్ళ ఇంటికి వెళ్తూండే వాడు. ఆ కుటుంబంలో అందరికంటె ప్రసాద్ చెల్లెలు జ్యోతి దృష్టిని అతను బాగా ఆకర్షించాడు. వ్యక్తిత్వాల జోలికి అంతగా పోని జ్యోతికి మాధవ్‌బుద్ధి ఎలాటిదైనా విగ్రహం మాత్రం కంటికింపుగా ఉండి చాలా బాగా నచ్చింది. మొదటి చూపులోనే అతనిపట్ల ఆసక్తి ఏర్పరచుకుంది. తన వూహలకి తగిన పురుషుడని నమ్మింది. కాని, జ్యోతి మనసులో ఈ ఉద్దేశమేమీ గ్రహించని మాధవ్ అందరితో లాగానే మాట్లాడేవాడు. కాని ఎప్పుడు చూసినా ఏదో ఒకటి వాగుతూ, ఎంత సేపూ తన అందంచేత ఎదుటివాళ్ళు ఆకర్షింపబడాలని వెర్రిమొర్రి ప్రయత్నాలు చేసే జ్యోతిని చూసి అప్పుడప్పుడు అతనికి విసుగేసేది. ఒక్కోసారి హద్దుమీరిన ఆమె చనువుని అసహ్యించుకునేవాడు కూడా. కాని ఒక్క జ్యోతిని తీసేస్తే మిగతా ఆ కుటుంబంలో అందరూ అతనికి ఆప్తులే. అందుకే జ్యోతి విషయంలో చూసీ చూడనట్టు వదిలేసి పట్టించుకునేవాడు కాదు.

మాధవ్ నిర్లక్ష్యాన్ని ఆదో పోజ్ క్రింద తీసుకుని జ్యోతి సరిపెట్టుకుంది. తన మీద ఎలాటి ఆకర్షణా లేకపోతే అసలు ఇంటికి ఇన్నిసార్లు రాడనుకుని నమ్మింది.

మనిషి మనసు మహా చిత్రమైనది. ఒంటరిగావున్నా ఒక్కొక్కసారి హాయిగా అద్భుతంగా వుంటుంది. మళ్ళీ ఇంకోసారి పదిమందిలో తిరుగుతున్నా సరే చుట్టూ ఎవరూ లేనట్టు, యేకాకిగా ఎడారిలో నిలబడి దిక్కులు చూస్తున్నట్టు అన్పించి వెర్రివాళ్ళను చేస్తుంది.

మాధవ్ పని ప్రస్తుతం ఇలాగే ఉంది. ఒంటరితనపు బాధ భరించలేక అనేక వ్యాపకాలని కల్పించుకున్నాడు. ఇష్టంలేకపోయినా కాలక్షేపం అవుతుందని జ్యోతితో పరిచయం పెంచుకున్నాడు. బిజినెస్ చూడటంలో

మరింత శ్రద్ధ కనపరిచాడు. హాస్పిటల్ విషయంలో అవసరానికి మించిన జోక్యం ఏర్పరచుకున్నాడు. అయినాసరే భూతంలా పట్టుకున్న ఈ ఒంటరితనపు బాధ అతన్ని వదలటంలేదు. సుధ అప్పుడప్పుడు వచ్చి వెడ్తూనే ఉంది. అందంగా, అమాయకంగా, ఆనందంగా ఉన్న సుధని చూస్తుంటే అతని మనసు ఎందుకో వులిక్కి పడుతుంది. జీవితం అంతా వెలితిగా కన్పిస్తోంది.

ఒక్కోసారి మరీ చిత్రంగా అర్ధరాత్రివేళ తట్టిలేపినట్టే మెలకువ వస్తుంది. తర్వాత ఎంత ప్రయత్నం చేసినా మళ్ళీ కంటి మీదకి కునుకన్న మాట రాదు. ఆలోచన్లు జోరీగల్లా ముసురుతాయి. మనసు అది కల్పిస్తున్న అశాంతిని భరించలేక విలవిల లాడ్తుంది. ఆ అర్ధరాత్రివేళ అప్పటికప్పుడు లేచి ఎక్కడికైనా పారిపోదామనిపిస్తుంది. కాని ఎక్కడికి వెడ్తాడు? అలాంటి బాధనుంచి తప్పించుకునేందుకు సందడి ఇంట్లో ఉండాలి కాని బజారులో కొనుక్కుంటేరాదు. అలాంటి సమయాల్లో అనేక ఆలోచన్ల మధ్య అప్పుడప్పుడు ఆ అమ్మాయి ముఖం గుర్తుకు వస్తుంది. ఎక్కడుందో! ఏంచేస్తుందో? తను గుర్తు టాడా? ఒట్టిది. ఎప్పుడో మరిచిపోయి ఉంటుంది. సుఫలాగానే ఆ అమ్మాయి కూడా పెళ్ళి చేసుకొని ఇల్లు సంసారం గొడవలో పడిపోయి ఉంటుంది. ఆ అమ్మాయి మర్చిపోతే మర్చిపోవచ్చు కాని తనెలా మర్చిపోతాడు. ఒకవేళ మర్చిపోదామన్నా ముఖంమీదవున్న యీ మచ్చ మర్చిపోనివ్వదు. అద్దంలో చూసుకున్నప్పుడల్లా సిగ్గుతో చితికిపోయే ఆ సంఘటన గుర్తుకువస్తుంది. వెంటనే వడిలి వాడిపోయి తూలిపోతూ స్పృహలేకుండా తన చేతులమధ్య పట్టుకున్న ఆ ముఖం గుర్తుకు వస్తుంది. అది గుర్తుకు రాగానే అతని మనసంతా వికలమై పోతుంది. భగవంతుడు తనుచేసిన పాపానికి శిక్షించలేదేం? పైనుంచి సర్వసంపదలు యిచ్చి ఆశీర్వదించాడు. ఎందుకని? ఒకవేళ యెప్పుడైనా ముఖాముఖిని తా మిద్దరూ కలుసుకుంటే ఎలా వుంటుంది? మాధవ్ కెందుకో ఆ దృశ్యం చూసితీరాలనే కోర్కె బలీయంగా నాటుకొని నానాటికీ దృఢంగా పెరగసాగింది. ఇన్ని సంవత్సరాలలో యింతమందిలో ఆమె యెక్కడైనా కన్పిస్తుందేమోనని అతని మనసు రహస్యంగా వెతుకుతూనే వుంది. కనీసం అలాటి ఛాయలున్న మనిషికూడా అతనికి కన్పించలేదు.

ఒకటి మాత్రం సత్యం. ఇకముందు జీవితంలో ఆ అమ్మాయి కన్పించినా కన్పించకపోయినా తను మాత్రం జీవితాంతం యీ జ్ఞాపకాన్ని గురించి మర్చిపోడు. అది తన వల్లకాదు. ఆ అనుభూతి అంత గాఢంగా ముద్ర వేసుకుపోయింది.

మొన్నటికి మాత్రం మొన్న జ్యోతి వాళ్ళతోకలసి అందరూ అలా పిక్నిక్‌కి వెళ్ళినప్పుడు జ్యోతి ప్రయత్నంచేసి చాకచక్యంగా తనతో ఒంటరిగా మిగిలిపోయింది. చుట్టూ తెల్లటి వెన్నెల. చక్కటి నిశ్శబ్దం. ప్రశాంతమైన పరిసరాలు. అప్పు డతని మనసు కొద్దిగా చలించినమాట నిజమే. జ్యోతిని దగ్గరగా తీసుకున్నాడు. 'మీ ముఖంమీద యీ మచ్చ యెంత బావుంది? యెప్పుడు తగిలింది యీదెబ్బ?' చిటికెనవేలుకొనతో ఆ మచ్చ వున్నంతమేరా రాస్తూ గోముగా అంది.

క్షణంసేపు వెర్రిగాచూచిన మాధవ్ చటుక్కున జ్యోతిని వదిలేసి దూరంగా వెళ్ళిపోయాడు. హఠాత్తుగా అతనికి ఆ వెన్నెల, ఆ వంటరితనం అసహ్యం వేసింది. భయం కల్గించింది కూడా. వెనుకనుంచి జ్యోతి పిలుస్తున్నా విన్పించుకోకుండా గబగబా మిగతా వాళ్ళు ఉన్న చోటుకి వచ్చేశాడు. అనుకోకుండా అతని మనసంతా వికలమైపోయింది. మనశ్శాంతి విచిత్రంగా మాయమైంది. వాళ్ళంతా తనని యిప్పుడు యింతగా గౌరవిస్తున్నారే! మంచివాడంటూ ఆర్భాటంగా ఆదరిస్తున్నారే! తనుచేసిన ఆ భయంకరమైన దుష్కార్యం తెలిస్తే బహుశా ముఖం కూడా చూడరేమో! అలాటిదేదయినా చరిత్రలో ఉందని తెలిస్తే, కనీసం అనుమానం తగిలినా చాలు, దాని అంతు శోధించి, పుట్టుపూర్వోత్తరాలు కనుక్కొని అనేక రకాల ఉపకథలుఅల్లి అథఃపాతాళానికి తొక్కేస్తారు. రామగోపాలరావుగారి ఆస్తికి వారసుడయాడని మండిపోతున్న వాళ్ళకి యెంత చక్కటి అవకాశం. తనసలు పెళ్ళిచేసుకోడు. ఒకవేళ చేసుకున్నా అతి సామాన్యమైన అమ్మాయిని తననుంచి భర్తగా రక్షణ, ఆనందంకోసం పిల్లలు తప్ప యింకేమీ కోరని మనిషినిచూసి మరీ చేసుకుంటాడు. మనసులో సుధకు కూడాలేని ఓవిధమైన ప్రత్యేకత ఆ అమ్మాయి సంపాదించుకుని కూర్చుంది. అసలు ఆ అమ్మాయి గుర్తొస్తే యింకో స్త్రీని తాకాలంటే అసహ్యంవేస్తుంది. జుగుప్సగా వుంటుంది.

ఇంటికి వచ్చిన తర్వాతకూడా ఆరాత్రి ఆతనికి చాలా సేపటివరకు నిద్రపట్టలేదు. కొద్ది సంవత్సరాల క్రితం అనుకోకుండా జరిగిన ఓవిచిత్ర సంఘటన గురించి తను యింతగా అసలు యెందుకు ఆలోచించాలి? తెరిచి చూస్తే ప్రతిమనిషి జీవితంలోనూ యేవో రహస్యాలుండక మానవు. అలాగే తనుకూడా అని యెందుకు సరిపెట్టుకోలేక పోతున్నాడు తనని తనే దోషిగా, అల్పవ్యక్తిత్వంగల మనిషిగా వూహించుకుని యీ నరకం చూడడం దేనికి? ఇన్నివిధాలుగా తను గుర్తుచేసుకుంటున్నాడు. ఆ అమ్మాయి ఒకరోజు ఒక్క క్షణం అయినా గుర్తుచేసుకుంటుందా? ఎప్పుడైనా యే వంటరిగానో యే రైల్లోనో ప్రయాణం చేసినప్పుడు గుర్తురాదూ? గుర్తురాగానే ఆ అందమైన కనుబొమలు ముడుచుకుంటాయి కాబోలు! అసహ్యంతో పెదవులు వంపులు తిరిగి కరచుకుంటాయేమో? ఏదయినా యెలాగైనాసరే యెక్కడున్నా ఆమె వునికి సంపాదించి ఒక్కసారి చూడాలి. చూడగానే ఆ సోగకళ్లల్లో కన్పించే గుర్తింపు, ఆ జ్ఞాపకం యొక్క ప్రతిఫలం యెలా వుంటాయో? మాధవ్ కెలగైనా ఆగర్భ శ్రీమంతురాలయి, యీపాటికి ఒకళ్ళిద్దరి పిల్లల తల్లికూడా అయివున్న ఆమెని చూసితీరాలని మరీ మరీ అన్పించ సాగింది.

# 11

కొద్దిరోజులక్రితం యే వంటరితనంచూసి వెర్రివాడినై పోతానేమో అని భయపడ్డాడో-దేన్ని తప్పించుకోడానికి కావాలని నలుగురిలో పూసుకు తిరగాలని చూశాడో ప్రస్తుతం మాధవ్ ఆ ఒంటరితనం కోసమే విలవిల లాడిపోతున్నాడు. నానాటికి అతని ఆప్తుల సంఖ్య పెరిగిపోతోంది. ఎంత ముభావంగా వున్నా, వద్దని యెంత విసుక్కున్నా యెవరూ లక్ష్యపెట్టటం లేదు. పైనుంచి అతనేదో బాధలో వున్నాడని దగ్గరచేరి అంటిపెట్టుకుని వుండే అభిమానం క్రింద జమ అవుతామని ఆశపడుతూ యింకా దగ్గిరగా రావాలని ప్రయత్నించ సాగారు. అందరికంటె జ్యోతిని తప్పించుకోవడం అతనికి ఓ పెద్ద సమస్య అయి కూర్చుంది. అతని అభిప్రాయం అడక్కుండానే, అతని అనుమతి తీసుకోకుండానే జ్యోతిని వివాహం చేసుకోటానికి

యిష్టపడ్డట్టూ, త్వరలో అది జరగబోతున్నట్టు గాలి వార్తలు అనేకం ప్రచారంలోకి రాసాగాయి.

జ్యోతి అంటే అంతగా యిష్టంలేని కొంతమంది ముఖ్యంగా తమ చెల్లెళ్ళనో, కూతుళ్ళనో అతనికి కట్టిపెట్టాలని తాపత్రయ పడే వాళ్ళు, జ్యోతి ప్రవర్తన మంచిది కాదనీ, కావాలంటే ఉదాహరణలు చూపిస్తామనీ, దూరం ఆలోచించుకుని ఈ అడుగు వేయమనీ సలహాలు యివ్వసాగారు. ఈ గొడవలు కాక హాస్పిటల్లో తీసుకోబోయే నర్సుల కోసం, డాక్టర్ల కోసం రికమెండ్ చేస్తూ ఉత్తరాలు కొన్ని, స్వయంగా మనుష్యులువచ్చి "రామగోపాలరావుగారి స్నేహితులం. మామాట నువ్వు వినాలి" అనే ఆంక్షలు కొన్ని. వాటితో ఒక్క క్షణం తీరుబడి లేకుండా ఊదర బెట్టినట్టు వెర్రెత్తసాగింది. కొద్దిరోజులు వాళ్ళందరినీ తప్పించుకుని దూరంగా ఉండేకాని బ్రతకలేనని భయం వేసింది.

చివరికి ఆలోచించి రామగోపాలరావుగారు తనమీద వ్రాసిన ఆ పల్లెటూరు యెలాటిదో చూడటానికి వెళ్ళాడు.

o o o

చాలా చిన్న పల్లెటూరు. అంతా తక్కువ కులాల వాళ్ళే. ఎక్కువ మంది పల్లెవాళ్ళు వున్నారు. పల్లెవారు, వడ్రంగులుకూడా కొద్ది మంది ఉన్నారు. ఎవరిపీథి వాళ్ళది. ఎవరిపని వాళ్ళది. పనివుంటే తప్ప యితర్లతో జోక్యం కల్పించుకోరు. సిటీకి అంత దగ్గరలోవున్నా దాని ప్రభావం యేమీ లేని వూరు. హైదరాబాద్‌లో విసుగుపుడితే ఇక్కడకు వచ్చి నాలుగురోజులుంటే, మనసు విశ్రాంతి పొంది మళ్ళీ వుత్సాహాన్ని పుంజుకుంటుంది.

ఇల్లు చాలా పెద్దది. కట్టడం బాగా పురాతన పద్ధతిలో వున్నా విశాలమైన గదులతో సౌకర్యంగా వుంది. ఇంటి చుట్టూవున్న పెద్ద ఆవరణలో యెడం వైపు నాలుగయిదు మామిడిచెట్లు, రెండు నేరేడు చెట్లు, ఒక వేప చెట్టు వుంది. వాటి మధ్య నుంచి ముందుకు వెడితే గుబురుగా పెరిగిన సరుకు చెట్లున్నాయి. వాటి మధ్యనుంచి వున్న సన్నటి కాలిబాట వెంబడి వెడితే నాలుగు ఫర్లాంగుల తర్వాత దట్టంగా వెదురుతోట వుంది. దాని ప్రక్కనుంచి ఒక అరమైలు నడిస్తే నది వొడ్డుకి చేరుకోవచ్చు.

మూసీనది నుంచి పాయ వొకటి చీలి యిటువైపు ప్రవహిస్తోంది. వర్షా కాలం తప్పితే వీథిలో నీళ్ళు అంత ఎక్కువగా ఉండవు. ప్రశాంతమైన యీ పరిసరాలు, ఈ ప్రకృతి సౌందర్యం చూసిన తర్వాత మాధవ్‌కి ప్రాణం లేచి వచ్చింది. ప్రస్తుతం పల్లెటూరు అంటే మక్కువ కలిగిన అతనికి తక్షణం మకాం యిక్కడికి మార్చెయ్యాలని నిశ్చయించు కోవ టానికి యెక్కువసేపు పట్టలేదు. చేతిలో కారు యెలాగూవుంది. 40 మైళ్ళు అంటే పెద్దదూరం యేమీకాదు. ఉదయం వెళ్ళి పగలంతా పని చూసుకుని రాత్రికి రావచ్చుకూడా.

చాలా రోజులనుంచి మనుష్యులు నివసించకుండా వదిలేయటం వల్ల యిల్లంతా పాడు పడిపోయి పెద్ద పెద్ద సాలె గూళ్ళతో భయంక రంగా వుంది. గోడలు వెలిసిపోయి వున్నాయి. ఇంటి చుట్టూ వున్న ఆవ రణలో గుబురగా పెరిగిన పిచ్చి మొక్కలు పురుగు పుట్రలకి నిలయా లైనాయి. ఆ రోజే అక్కడనుంచి తిరిగి వెళ్ళిపోయిన మాధవ్ నాలుగు రోజుల తర్వాత కంపెనీలో ఒకతన్ని తీసుకువచ్చి యిల్లంతా చూపించి యెలా యెలా మార్పులు చేయాలో సూచించాడు. ఎంతయినా సరే డబ్బు కోసం చూడకుండా యింటిచుట్టూ మంచితోట పెంచే విధానం చూడ మన్నాడు.

రెండు నెలలు తిరిగే సరికి యింటిస్వరూపమే మారిపోయింది. మామిడిచెట్లక్రింద పేరుకున్న చెత్తా చెదారం తొలగించేశారు. ఇప్పుడా ప్రదేశం అంతా సమంగా అద్దంలా వుంది. ముందు ఆవరణలో వేసిన పూల మొక్కలు నాటుకుని ఏపుగా పెరగడం ప్రారంభించాయి. ఇంటికి సున్నం వేయించి, కిటికీలకు తలుపులకు రంగువేయటంతో కొత్తకళ వచ్చింది. మళ్ళీ వచ్చినప్పుడు యిదంతా చూసి మాధవ్ తృప్తిగా తలాడించాడు.

'ఒక్క చిన్న మనవి సార్!' అన్నాడు మేనేజర్.

'ఏమిటది?'

'మనం యింటినుంచి నది ఒడ్డుకి వెళ్ళే త్రోవలో ఆ వైపు సరుకు తోట లేదూ?'

మాధవ్ వున్నది అన్నట్టు తలూపాడు.

'దాని కిట్టప్రక్కన చిన్న పెంకుటిల్లు వుంది సార్.'

'వుండే?—'

'అది చాలా పాతది. దాన్నెలాగైనా కొనేశారంటే అక్కడనుంచి తోట తయారు చేయవచ్చు.'

మాధవ్ కనుబొమలు ముడిచాడు.

'ఎక్కువ ఖరీదు ఉండదు సార్. చాల పాత యిల్లు. శిథిలావస్థలో వుంది.'

'ఖరీదు గురించికాదు ప్రశ్న. అమ్మటానికి వాళ్ళు ఒప్పుకో వద్దూ—'

'వాళ్ళు చాలా బీదవాళ్ళు. మనం కొద్దిగా ఎక్కువ ఆశ చూపిస్తే-'

'ప్రయత్నం చేసి చూడండి' అన్నాడు.

హుషారుగా వెళ్ళిన మానేజర్ ముఖం వేళ్ళాడేసుకుని వచ్చాడు.

'వాళ్ళు అమ్మేటట్లులేరు.'

'ఎవరిది అసలు ఆ యిల్లు?'

'హైదరాబాదులో ఒక జాగీర్దారు ఇంట్లో పనిచేసే నౌకర్లదట.'

'అతన్ని పిలు-నేను మాట్లాడతాను.'

'అతనిప్పుడు లేదు సార్. రజాకార్ మూమెంట్‌లో చనిపోయాట్ట! అతని భార్యా పిల్లలున్నారు. వాళ్ళు ఒప్పుకోవటం లేదు.'

'అయితే యేం చేస్తాం మరి?'

'లేదు సార్! మీరు కాస్త ప్రయత్నించి చూడండి. అక్కడ తోట చాలా బాగా వస్తుంది. మీరడిగితే వాళ్ళు కాదనలేరని నా నమ్మిక.' మానేజర్ వేధించటం ప్రారంభించాడు.

మాధవ్ యింతవరకూ ఎప్పుడూ ఆ యింటివైపు వెళ్ళలేదు. అతని పడగ్గదిలోంచి చూస్తే దూరంగా దట్టంగా వున్న చెట్లకొమ్మలకి అల్లి బిల్లిగా అల్లుకున్న అడవితీగెల మధ్య చిక్కుపడిపోయిన పెంకుటిల్లు నడి కప్పుమాత్రం కనిపిస్తుంది. ఇంట్లో వంటచేస్తున్న సూచనగా అప్పుడప్పుడు సాయంత్రంవేళల వలయాలు వలయాలుగా పొగ పైకిలేస్తూ ఉంటుంది.

సాయంత్రం అలా నది ఒడ్డుకి షికారుకు వెళ్ళినప్పుడు కావాలని చుట్టు తిరిగి అటువైపుగా వాళ్ళ ఇంటి ముందునుంచి వచ్చాడు. ఎన్ని

యుగాలనాటిదో అన్నంత పాతగావున్న చిన్న పెంకుటిల్లు. సున్నం వేసికూడా చాలా రోజులైనట్టుంది. కళావిహీనంగా వుండి శిథిలం కావటానికి సిద్ధంగా వుంది. ఇంటిముందు వరండా మట్టితో అలికి ముగ్గుపెట్టి వుంది. గుమ్మానికి వెలిసిపోయిన పాత చీరె కర్టెన్‌గా వేళ్ళాడుతోంది. ఇంటిముందున్న పందిరికి మాలతి బటానీ తీగెలు పెనవేసుకుని పైకి పాకి వున్నాయి. మేనేజర్ చెప్పింది నిజమే. ఆ యిల్లు కొనేస్తే అక్కడ మంచి తోటేకాదు, చిన్న డాబా కూడా వేసుకోవచ్చు. అక్కడి నుండి నది, దాని కవతలవున్న చిట్టడవి కన్నుల కింపుగా అద్భుతమైన దృశ్యంలా ఉంటుంది.

ఇంటికి తిరిగి వస్తూనే మాధవ్ మేనేజర్‌ని పిలిచి, 'ఆ యింట్లో ఎవరుంటారు?' అన్నాడు.

'తల్లీ, యిద్దరు పిల్లలండీ!'

'ఆడపిల్లలా, మగపిల్లలా?'

'ఇద్దరూనండీ. ఆడపిల్ల పెద్దది, మగపిల్లవాడు చిన్నవాడు.'

'తల్లికెంత వయసుంటుంది!'

'యాభైకి పైన వుండవచ్చు.'

'ఆడపిల్లకి?-'

మానేజర్ బుర్ర గోక్కున్నాడు. 'నేను సరిగ్గా చూడలేదు. మా వుంటే పాతికేళ్ళు వుండవచ్చు'

'పెళ్ళికాలేదా?-'

ఈసారి అతను చెవి గోక్కున్నాడు. 'తెలియదండి.'

'మగపిల్లవాడు?-'

'అతను కుంటివాడు. మంచంలోంచి లేవలేడు.'

'మరి యెవరితో మాట్లాడాలి? నువ్వే వెళ్ళి వాళ్ళు ఆ ఇల్లుఅమ్మేస్తే యిటువైపు రోడ్డుకి దగ్గరగా వున్న మనస్థలం యిచ్చేస్తాం అని చెప్పు.'

మానేజర్ హుషారుగా పరుగెత్తిపోయాడు.

'ఇదిగో!' మాధవ్ వెనుకనుంచి పిలిచి 'ఆ స్థలంలో చిన్న యిల్లు వేయించే బాధ్యతకూడా మనమే తీసుకుంటాం అని చెప్పు!' అన్నాడు.

'అలాగే!' మరుక్షణంలో అక్కడినుంచి మెరుపులా మాయమౌతూ అన్నాడు.

పది నిమిషాల తర్వాత కాళ్ళీడ్చుకుంటూ తిరిగి వచ్చాడు.

మాధవ్ యేం అన్నట్లు చూశాడు.

'లాభం లేదండి! వాళ్ళు అమ్మరట.'

'ఎందుకని? డబ్బు కొంచెం యెక్కువ ఆశ చూపించక పోయావా?'

'ఆ పని ముందే చేశానండి!'

'ఒప్పుకోకపోతే యింటిప్రక్కనుంచి పెద్దపెద్ద కాలువలు త్రవ్వి నదిలోంచి నీరు తీసుకుంటామని బెదిరిస్తే సరి.'

మాధవ్ కోపంగా అన్నాడు. అతను కావాలనుకుని కోరుకున్నది లభించకపోతే మహా చిరాకుపడతాడు. ఎలాగైనా దాన్ని సాధించేవరకు నిద్రపట్టదు.

'ఎవర్ని బెదిరిస్తాం చెప్పండి? ఇంట్లో వున్నది- ఆడవాళ్ళు, చచ్చి గీపెట్టినా సమాధానం చెప్పరు.'

'ఆడవాళ్ళయితే యింకా సులభం.' మాధవ్ పెదిమలు కఠినంగా నవ్వాయి.

'వాళ్ళని చూస్తే అలా అన్పించటం లేదు.' సణిగాడు మానేజరు.

'సరే! నేనే చూస్తాన్లే!' ఈ విషయం తనే స్వయంగా తెల్సుకోటానికి నిశ్చయించుకున్నాడు.

మర్నాడు అలా నది ఒడ్డుకేసి వెళ్ళి తిరిగివస్తూంటే భుజంమీద తడిబట్టలతో చంకన బిందెతో ఒకావిడ యెదురైంది. వయసునిబట్టి, రూపు రేఖలనిబట్టి ఆవిడ యెవరో తేలికగానే వూహించగలిగాడు.

'మీ దొడ్లో బావిలేదూ?-' పరిచయం కల్పించుకోటానికి చాలా మృదువుగానే అడిగాడు.

'లేదు.' ముక్తసరిగా అని, ఆవిడ వెనక్కు తిరిగి చూడకుండా గబ గబా వెళ్ళిపోయింది.

48

# 12

తర్వాత వరసగా రెండురోజులు నది ఒడ్డున ఆవిడకోసం చూశాడు కాని కన్పించలేదు.

చివరికి ధైర్యంచేసి తనే వాళ్ళింటికి వెళ్ళాడు. వరండాలో పరదా ముందు నిలబడి మెల్లగా చప్పట్లు చరుస్తూ చప్పుడు చేశాడు. సమాధానంగా లోపల్నుంచి 'యెవరది?' అంటూ పసితనంపోని మగకంఠం విన్పించింది.

'కొంచెం యివతలికి వస్తారా?' మాధవ్‌కి ఇంట్లోకి వెళ్ళవచ్చో లేదో తెలియలేదు.

'మీరే లోపలికి రండి.' లోపలినుంచి ఆహ్వానం రావటంతో క్షణం సేపు తటపటాయించి, కర్టెన్ తొలగించుకుని లోపలికి అడుగుపెట్టాడు. విశాలంగావున్న గదిలో పాతకాలపు చువ్వలున్న కిటికీదగ్గర మంచంమీద పడుకునివున్న కుర్రాడు, చూస్తున్న పుస్తకం ప్రక్కకు పెట్టుకుని ప్రశ్నార్థకంగా చూస్తున్నాడు. అతనికి మహావుంటే 14-15 సంవత్సరాలుంటాయి. కాని మరీ సన్నగా వుండటంవల్ల అంతకూడా అన్పించదు.

'నా పేరు మాధవ్. నేను...' అతను వాక్యం పూర్తిచేయనేలేదు. కుర్రాడు వికసించిన ముఖంతో 'ఆ దెయ్యాలకొంప యజమాని కదూ! రండి-రండి! మిమ్మల్ని గురించి జోగులు రోజూ చెబుతూనే వుంటాడు!' అని, ఆగి దూరంగావున్న స్టూలు వేలితో చూపిస్తూ 'అది కొంచెం తెచ్చుకుని యిక్కడ వేసుకుంటారా? నేను మంచంలోంచి లేవలేను' అన్నాడు.

చివరిమాటల్తో అతని కళ్ళలో లీలగా బాధ గోచరించింది.

మాధవ్ స్టూలుకోసం వెళ్ళాడు.

'మీ రెంత మంచివారు? నేను మంచంలోంచి లేవలేనని తెలిసి నన్ను స్వయంగా చూడటానికి వచ్చారుకదూ?'

మాధవ్ తెల్లబోయాడు. అయినా అతన్ని నిరాశపరచటం యిష్టం లేక అవునన్నట్టు తలూపాడు.

'ఇలా-యిక్కడ-నా దగ్గిరగా వేసుకోండి!' కిటికీ దగ్గరగా తన మంచం ప్రక్కన చోటు చూపిస్తూ అన్నాడు. మాధవ్ స్టూలుతెచ్చి సరిగ్గా అక్కడే వేసుకుని కూర్చున్నాడు.

'మీరు అచ్చు నేను వూహించనట్లే వున్నారు కాపోతే మీదింత చామనచాయ అనుకోలేదు. బాగా తెల్లగా వుంటారనుకున్నాను.' మాధవ్ యిల్లంతా పరీక్ష చేస్తున్నాడు. ప్రక్కగది ఒకటీవుంది. లోపల వంట గదిలో ఇంకో గుమ్మంవుంది. లోపలున్న యీ గుమ్మానికి తెరలులేవు. ఇంట్లో సామానేం లేదు

'అబ్బ కాస్త చదువుసంధ్యలున్న మనిషిని చూసి ఎన్నాళ్ళయింది!' మాధవ్‌ని తనివితీరా చూస్తూ తృప్తిగా అన్నాడు.

'ఈ ఇంటికి పెద్ద ఎవరు?' వచ్చిన పని ఆలస్యం లేకుండా సూటిగా బైట పెట్టటానికి వుపోద్ఘాతం ప్రారంభించాడు.

'నేనే, యేం? యేం కావాలి మీకు? —' సగర్వంగా వచ్చింది సమాధానంతోపాటు ప్రశ్నకూడా. మాధవ్ విస్మయంగా చూశాడు.

'ఇంటికి పెద్ద అంటే ఇంట్లోవున్న మగాడేగా! నేను తప్ప యీ యింట్లో మరో మగపురుషుడుకూడా లెడు.' మంచంమీదనుంచి లేవలేక పోయినా యీ పెద్దమనిషి మాటల్లో గాంభీర్యానికేమీ కొరత లేదు.

మాధవ్ మౌనం వహించాడు ఈ కుర్రాడిని చూడగానే అతని వూహలు కొద్దిగా తలక్రిందులయినాయి.

'అప్పుడప్పుడు రేడియో విన్పిస్తుంది మీయింట్లోనేనా?' ఆత్రంగా అడిగాడు మళ్ళీ.

అవునన్నట్టు తలవూపాడు మాధవ్.

'నే నప్పుడే అనుకున్నానండి. లేకపోతే యింకెక్కడనుంచి విని పిస్తుంది? ఈ వూళ్ళో వెధవలకి అసలు రేడియో అనేది ఒకటి వుందని కూడా తెలిసివుండదు. తింటానికి గతిలేని మనుష్యులు.'

'మీది యీ వూరు కాదా?—' కుతూహలం పట్టలేక అడిగాడు.

'మా ఊరా? ఛీ! ఛీ! యెందుకవుతుంది? మీరు నావంక సరిగ్గా చూడండి. నేను యీ వూరు మనిషిలా వున్నానా?'

మాధవ్ లేదన్నట్టు తలవూపాడు.

'మరింక అడుగుతారేం? మా నాన్న నవాబు దగ్గర మిలిటరీ ఆఫీసర్‌గా పనిచేసేవాడు. జాగీర్దారు ఛాయాలో పెరిగిన కుటుంబం మాది. అఫ్‌కోర్స్, చెప్తే నమ్మరనుకోండి '

మాధవ్ నిజంగానే నమ్మలేకపోయాడు.

'రజాకార్ మూమెంట్‌లో మా నాన్నని కాల్చి చంపేశారు. నాన్న గారు వున్నప్పుడు బాగా వున్నవాళ్ళంగానే వుండేవాళ్ళం. ఆయనపోయి ఆ గొడవంతా చల్లారగానే అప్పులవాళ్ళంతా చుట్టేసి, చివరికి యింట్లో వున్న కుర్చీలు, బెంచీలతో సహా పట్టుకుపోయారు. గాలివానలో గూడు పోయిన పిట్టల్లా నేనూ మా అక్కా మిగిలిపోయాం.' కుర్రాడి కంఠం దిగులుగా మారిపోయింది.

'ప్రస్తుతం యీ యిల్లు తప్ప యింకేం లేదా?'

'ఉహు! ఆ మాటకొస్తే యీ యిల్లుకూడా మాది కాదు. మా నౌకరుది. అప్పుడప్పుడు మా నాన్నగారు అతనికి చాలా డబ్బు యిచ్చే వారు. దాంతో కొనుక్కున్నది. అయితే మాత్రం ఓసారి యిచ్చింది తిరిగి తీసుకోవడం మర్యాద అంటారా? కాదు, కాని యేం చెయ్యాలి? తప్పలేదు. నేనేమో బొత్తిగా మంచంలోంచి లేవలేని వాడిని.'

'ఏమైంది? యేమైనా యాక్సిడెంట్ అయిందా?' కుర్రాడి ముఖం చూస్తూంటే మాధవ్‌కి అపరిమితమైన జాలేసింది.

'కాదు. రజాకార్ మూమెంట్ అప్పుడు మా నాన్నని, మా నౌకర్ని కాల్చేస్తుంటే భయపడి పారిపోవటానికి గోడదూకబోయి, పట్టుతప్పి క్రింద పడ్డాను. నడుందగ్గర యెక్కడో ఎముక విరిగిపోయింది.'

మధ్యలో వచ్చిన అంగవైకల్యం యెంత భయంకరమో మాధవ్‌కి తెలియకపోలేదు. అందుకే 'డాక్టర్లకెవరికీ చూపించలేదా?' అని అడిగేడు.

'ఎందుకు చూపించలేదూ? మా అక్క ఒంటిమీదవున్న బంగారం కాస్తా నా కోసమే తగలబెట్టేసింది ప్రయోజనం లేకపోగా దరిద్రం పట్టు కుంది. ఏమిటో! ఒక్కోసారి ఆలోచిస్తే యిలాటి బ్రతుకు జీవచ్ఛవంలా బ్రతికేకంటే-' కంఠం బొంగురుపోవడంతో ఆగిపోయాడు. పాపం! ఎంత విషాదగాథ! అతన్ని చూస్తుంటే జీవితం మీద విపరీతమైన ఆసక్తివుండి యేం చేయలేక బలవంతంగా మంచంమీద వెళ్ళదీస్తున్న బాధ, నిస్సహాయత కన్పిస్తోంది. మాధవ్‌కి ఆ కొద్దిపరిచయంలోనే అంతరాంతరాలలో ఎక్కడో ఈ కుర్రాడంటే జాలితో కూడిన సానుభూతి ఏర్పడసాగింది. మొదట ఈ వూరు చూడగానే బొత్తిగా చలనంలేని పల్లెటూరు అనుకున్నాడు కాని

తనకేం తెలుసు! ఈ మారుమూల నిస్సహాయతతో మండుతున్న మనసు ఒకటుందని. తనకు చాతనైనంత సహాయం ఇతనికి చేసితీరాలి. అసలతనికి చిన్నప్పటినుండి నోరులేని పశుపక్ష్యాదులన్నా, అనారోగ్యంతో తీసుకునే మనుష్యులన్నా విపరీతమైన జాలి, అభిమానం చూపి ఆదరించటంలో అతని చేయి ముందుకు వస్తుంది.

'మీ అక్క ఏం చదువుకోలేదా?'- సానుభూతిగా అడిగాడు.

'చదువుకోలేదా?-' కుర్రాడు కళ్ళు పెద్ద పెద్దవి చేసిచూశాడు.

'మా అక్కంత తెలివైనవాళ్ళు నూటికి ఒకరుకూడా వుండరని నా విశ్వాసం' అన్నాడు సగర్వంగా.

'చదువుకీ తెలివితేటలకీ చాలా తేడావుంది బాబూ!'

'అవుననుకోండి. అయినా మా అక్క బి. ఏ. ప్యాసయింది.'

మాధవ్ తల్లక్రిందులైనట్టు చూశాడు.

'బి. ఏ. ప్యాసయిందా? అయితే వుద్యోగం చేసుకోవచ్చుగా!' అన్నాడు ఆశ్చర్యంగా.

'చేసుకోవచ్చు. కాని యిష్టంలేదు. ఆ మాటకొస్తే హైదరాబాద్ అంటేనే అసహ్యం మాకు. ఎందుకో తెలియదు.' అతని ముఖం మళ్ళీ విషాదంగా మారిపోయింది.

'ఎందుకని?- పోనీ అక్కడిష్టంలేకపోతే యింకో ఊరు వెళ్ళవచ్చుగా?'

వెంటనే యేదో చెప్పటానికి నోరు తెరిచిన కుర్రాడు హఠాత్తుగా ఆగిపోయి అనుమానంగా చూస్తూ 'మీరు భలేవారే! నాచేత మా యింటి రహస్యాలన్నీ చెప్పించుకుంటున్నారే' అన్నాడు.

'అబ్బెబ్బె! అదేంలేదు. అయినా యివి రహస్యాలెలా అవుతాయి? అందరికీ తెలిసిన విషయాలే! నేను కొత్తవాడిని కాబట్టి నాకు తెలియవు. అంతేనా?-' అన్నాడు దుఃఖంగారుగా.

కుర్రాడు అవును అన్నట్లు తలూపాడు. కానీ మళ్ళీ నోరు మెదపలేదు. సంభాషణ హఠాత్తుగా ఆగిపోయింది. కొద్దిసేపయింతర్వాత మాధవ్ వస్తానని లేచాడు.

వచ్చేస్తుండగా వెనకనుండి 'మీరేమీ అనుకోకపోతే- మీ రేడియో

యింకొంచెం బిగ్గరగా పెడ్తారా? నాకు పాటంటే ప్రాణం' అన్నాడు. అతని కంఠం పలికేతీరు- అడగలేక అడుగుతున్నట్టుగా వుంది.

'అలాగే! అది రేడియో కాదు. ట్రాన్సిష్టర్. కావాలంటే రేపు తెచ్చి యిస్తాను.'

'నిజంగా!' అత నింతవరకు ట్రాన్సిష్టర్ అనే పేరు వినడమే గాని, కళ్ళతో స్వయంగా చూడలేదు. వెంటనే వికసించిన ముఖంతో 'మళ్ళీ మీరు వెళ్ళేటప్పుడు జాగ్రత్తగా తీసుకెళ్ళిపోదురుగాని. ఒక్క సారి చూసి యిచ్చేస్తాను' అన్నాడు ఆత్రంగా.

'అలాగే' వెళ్ళబోతున్నవాడల్లా హఠాత్తుగా ఆగి 'ఇంతకీ నీ పేరు ఏమిటో నేను తెలుసుకోనేలేదు?' అన్నాడు.

'వాసుదేవరావు. అక్కావాళ్ళు వాసు అని పిలుస్తారు. మీరు కూడా అలాగే పిలవవచ్చు. నా కభ్యంతరం లేదు' అన్నాడు హుషారుగా.

మాధవ్ గుమ్మం దాటుతుంటే వెనుకనుంచి 'రేపు రావటం మర్చి పోరుగా?' అని ఆదుర్దాగా వినిపించింది.

'మర్చిపోను' అన్నట్టు తలూపి బైటికి వచ్చేశాడు.

ఇంటికి వెళ్ళిన తర్వాత కాని అతనికి వెళ్ళిన అసలు పని మర్చి పోయినట్టుగా గుర్తుకు రాలేదు. మర్నాడు పూర్తిచేసుకోటానికి నిశ్చ యించుకున్నాడు.

# 13

మర్నాడు సరిగ్గా అదే వేళకి ట్రాన్సిష్టర్ యిచ్చి దాన్ని ఏవిధంగా వుపయోగించుకోవాలో చెప్పాడు. వాసు బుర్ర చాలా తెలివైంది. రెండో సారి చెప్పించుకోకుండానే అంతా గ్రహించేశాడు. మళ్ళీ కబుర్లలో కాలం దొర్లిపోయింది. వాసుకి పుస్తకాలన్నా, ఆటలన్నా ప్రాణం. సినిమాలంటే యెంత యిష్టమో చెప్పనేలేం. స్కూల్లో చదువుకునే టప్పుడు అన్నింటిలో ఫస్టులో ఉండేవాడు. ఆ రోజుల గురించి చెబుతుంటే అతని కళ్ళనిండా గిర్రున నీళ్ళు తిరిగాయి. ఎన్ని రోజులనుంచో మూగగా అనుభవిస్తున్న బాధని మాధవ్ నొక్క అడగకుండానే వాసు వెళ్ళగ్రక్కేవాడు.

'ఇంట్లో యెవరూ లేనట్టున్నారే-' ప్రసంగం మార్చటం కోసం అడిగాడు. అతను వచ్చి యింతసేపయినా యెలాటి శబ్దం వినిపించలేదు.

'ఎవరుంటారు? ఆయా నీళ్ళకెళ్ళి వుంటుంది.'

'ఆయా?'

'అవును, ఏం? అమ్మనుకున్నారా? అందరూ అలాగే అనుకుంటారు. అనుకోవాలనే మా వుద్దేశ్యం కూడా. నిజానికి మాకు కన్న తల్లి కంటె ఎక్కువ. అసలు స్వంత తల్లిని మేం ఎరగనే ఎరగం. మా అక్కంటే ఆయాకి మరీ ప్రాణం, నా కంటె కూడా.'

మాధవ్ వింటూండిపోయాడు. కలిగిన కుటుంబాల్లో యిలా దాసీలు యజమానుల పిల్లల్ని పెంచి పెద్ద చేయటం సహజంగా జరుగుతూనే వుంటుంది. అందులో పెద్ద విశేషం యేమీ లేదు.

'అక్క పొలం దగ్గరకు వెళ్ళి వుంటుంది.'

'పొలం దగ్గరకా!' వాసు మాట్లాడే ఒక్కొక్క మాట తుపాకి గుండులా వుంది.

'అవును. పొలం అంటే అదేదో పెద్ద పంట అనుకోకండి చిన్న కూరగాయలతోట. మా సంధ్య వాటని పట్నం పంపించి అమ్మిస్తుంది.'

మాధవ్ విస్మయంగా, కుతూహలంగా వినసాగాడు.

'ఎవరిదగ్గరైనా వూరికే తీసుకుంటే తప్పు. దొంగతనంచేస్తే అపరాధం. అన్యాయంగా సంపాదిస్తే పాపం. డబ్బు సంపాయించటానికి శీలంగాని, వ్యక్తిత్వంగాని పోగొట్టుకుంటే సిగ్గుపడాలి. కాని కాయకష్టం చేసుకుని బ్రతికితే యెవరికీ తల వంచాల్సిన పని లేదు అంటుంది మా సంధ్య.' అక్కగారినిగురించి చెప్పేటప్పుడు వాసుకళ్ళు గర్వంతో మెరవటం మాధవ్ గమనించికపోలేదు.

'కాని ఉద్యోగం చేసుకోవచ్చునే!'

ప్రసంగం మళ్ళీ నిన్నటిచోటికి వచ్చి ఆగిపోయింది.

'చేసుకోవచ్చు. మా పరిస్థితులు చితికిపోయిన తర్వాత అక్క రెండు మూడు చోట్ల చేసిందికూడా. కాని, ఆఫీసులోవాళ్ళు ఆమె పనికి

ఆమెను వదిలేయకుండా అనవసరం విషయాల్లో జోక్యం కల్పించుకునే వాళ్ళు. పై అధికారులు హద్దుమీరి ప్రవర్తించే వాళ్ళు. పైగా అక్కది అసలే సున్నితమైన స్వభావం! ఆ బాధలకి తట్టుకోలేకపోయేది. తప్పనిసరిగా ఉద్యోగం చెయ్యాల్సివచ్చిన తన దురదృష్టాన్ని తలచుకుని రాత్రిళ్ళు మేలుకుని వెక్కివెక్కి ఏడ్చేది. అక్క బాధపడుతుంటే ఆయా భరించలేక పోయేది. దగ్గరికి లాక్కుని ఉద్యోగం లేకపోయినా బ్రతకగలం అని ధైర్యం చెప్పేది. చివరికి ఆయా బలవంతం మీదనే ఈ వూరు వచ్చాం. ఈ కూరగాయల తోట, ఈ వ్యాపారం ఆయా చెప్పిన ఆలోచనే. కాయ కష్టం బాధ తప్పితే మాకు అప్పటినుంచీ ఇల్లు హాయిగా ఏ యిబ్బంది లేకుండా గడిచిపోతోంది.'

వాసుద్వారా ఈ కబుర్లన్నీ వింటూ చాలాసేపు అక్కడే కూర్చున్న మాధవ్ చివరికి వస్తానని లేచాడు. ఇంతలో ఆయా భుజంమీద తడిబట్టలో, నీళ్ళబిందెతో లోపలికి వచ్చింది. మాధవ్ ఆగిపోయాడు.

'ఆయా! నిన్న చెప్పానే ఈయనే-ఆ దెయ్యాల కొంపని దేవతా గృహంగా మార్చిన మాధవ్‌గారు.' వాసు వుత్సాహంగా పరిచయం చేశాడు. మాధవ్ స్నేహపూర్వకంగా నవ్వాడు. ఆయా మాట్లాడకుండా చూసీ చూడ నట్టు అక్కడనుంచి లోపలకు గబగబ వెళ్ళిపోయింది.

'ట్రాన్సిస్టర్ తీసుకెళ్ళరూ?' వెనకనుంచి వాసు అడిగేడు

'వద్దులే. ఉంచుకో! రేపు తీసుకువెడతాను!' మాధవ్ బైటకి వచ్చే శాడు.

# 14

వాసు దగ్గరనుంచి వచ్చేసిన మాధవ్‌కి అప్పుడే యింటికి వెళ్ళాలని పించలేదు. నది ఒడ్డుకి షికారుగా వచ్చాడు. అతను ఈ వూరు రాగానే మనసును ఆకట్టుకున్న స్థలాల్లో ఈ నదిఒడ్డు ఒకటి. అక్కడంతా ఈత పొదలు, వాటిని పెనవేసుకున్న అడవితీగలు, నది ఒడ్డున ఆనుకుని రెల్లు దుబ్బులుకూడా చాలా వున్నాయి ప్రశాంతంగా వున్న ఈ పరిసరాల్లో పిట్టల కలకలం, గాలిలో ఈలల చప్పుడు తప్ప యింకేమీ విన్పించదు.

సాయంత్రం సమయంలో అక్కడలా ఒంటరిగా పడిపోయిన ఒక చెట్టుకి చేరగిలబడి దూరంగా నదినీళ్ళమీద అస్తమిస్తున్న సూర్య బింబాన్ని, అది వెదజల్లే అరుణకాంతినీ, దాన్ని తనలో ప్రతిబింబించు కుంటున్న నది నీటిని రెప్పవాల్చకుండా చూస్తూ చాలా సేపు అక్కడ నిలబడిపోవటం అతనికి అలవాటయింది.

చాల రోజుల తర్వాత ఈ రోజు అతనికి ప్రశాంతంగా వుంది. హాయిగావున్న ఆ పరిసరాల్లో యెక్కడా నిలబడాలనిపించకపోవటంతో ప్యాంట్ జేబులో చేతులుంచుకుని తల వంచుకుని నడక సాగించాడు.

ఎంతదూరం నడిచాడో అతనికి ధ్యాసేలేదు. మాటిమాటికి వాసు మాటలే గుర్తుకు రాసాగినాయి. ఎంత విచిత్రమైన కుటుంబం! కలిగిన కుటుంబాల్లోపుట్టి అంతో యింతో చదువుకున్న ఆడపిల్లలకి అలా ప్రపంచా న్నుంచి పారిపోయి ఒంటరిగా ఈ మారుమూల బ్రతకాల్సిన ఖర్మ ఏమిటి? వాసు సరిగ్గా చెప్పటంలేదు. వెనక యేదో బలమైన గాథ వుంది. మాధవ్ కెందుకో ఒక్కసారి కళ్ళారా ఆ అమ్మాయిని చూడాలనిపిస్తోంది. సంధ్యట! ఎంత చక్కని పేరు.

తల వంచుకుని పరధ్యానంగా నడుస్తున్న అతనికి యింతలో ఏదో చిత్రమైన శబ్దం వినిపించింది. అదేమిటో గ్రహించటానికి తలెత్తబోతుం డగా ఆ వైపునుంచి సుడిగాలిలా పరుగెత్తుకొచ్చిన మనిషి మాధవ్‌మీదకి రావటం, అతను తప్పుకొని పక్కకు తొలిగేసరికి ఆ మనిషికూడా తికమక పడి అదేవచ్చి మీదపడి ఆ వూపుకి ఆగలేక యిద్దరూ లుంగచుట్టుకువెళ్ళి ప్రక్కన పడటం అంతా రెప్పపాటులో జరిగిపోయింది. చూస్తూండగానే కొమ్ములు తిరిగిన పోట్లయెద్దు ఒకటి బుసలుకొడుతూ అక్కడినుంచి పరు గెత్తింది. హఠాత్తుగా దేవుడిలా వచ్చి ఆ మనిషి మీదపడి పక్కకు లాగ డంతో సరిపోయింది. లేకపోతే యథాలాపంగా నడుస్తున్న మాధవ్‌కి ఆ యెద్దువచ్చి గుండెల్లో కుమ్మేవరకూ తెలిసేదిగాదు. అతని శరీరం ఝల్లు మంది. మెరుపులాటి ఆ ఆలోచన ముగియగానే తనమీద పడిందెవరో చూసు కున్నాడు. క్షణంసేపు ప్రపంచం ఆగిపోయింది. గాలి స్తంభించిపోయింది. అతని గుండెలమీద అడ్డంగా పడి, షర్టుని అందినచోట రెండుచేతుల్తో గట్టిగా పట్టుకుని భయంతో అతన్ని కరుచుకుపోయినట్టుయి యింకా కళ్ళు

మూసుకుని వున్నది అమ్మాయి-కేవలం ఒక అమ్మాయి. మాధవ్ కళ్ళప్ప గించుకుని చూస్తూండిపోయాడు.

ఇద్దరిలో ముందుగా తేరుకున్నది ఆ అమ్మాయే! లేచి సరిగ్గాకూర్చుని బట్టలు దులుపుకుంది. అనుకోకుండా జరిగిన ఈ సంఘటనకి సిగ్గుతో ప్రాణంపోయినట్టయి పాపం కళ్ళెత్తి చూడలేకపోతోంది. తల క్రిందికి దిగిపోయింది.

మాధవ్ పరీక్షగా చూశాడు. కోలమొహం, కొసతేలిన ముక్కూ, పొడగరి అని సూచించే శరీరం. యవ్వనంతో పరిపూర్ణంగా వికసించిన అవయవాలు.

'సారీ!' అస్పష్టంగా అంది ఆ అమ్మాయి.

మాధవ్ ఉలిక్కిపడ్డాడు.

'మీరు. మీరు వాసు అక్కా?'

ఆ అమ్మాయి చటుక్కున తలెత్తి చూసింది. పై పెదవిమీద పుట్టు మచ్చ కొట్టొచ్చినట్టు కన్పించింది. మాధవ్‌గుండె గతి తప్పింది. అవే సోగకళ్ళు. అదే ముఖం వెయ్యి సంవత్సరాల తర్వాతనైనా చూసిన వెంటనే గుర్తుపట్టగలడు. 'మీరు-మీరు-' మాటలు తడబడ్డాయి అతనికి.

ఆ అమ్మాయికూడా కన్నార్పకుండా చూస్తోంది. ప్రపంచం ఆగి పోయింది. అయినా క్షణాలు గడిచాయి.

క్రమేపీ మాధవ్ పెదవులు చిరునవ్వుతో విచ్చుకున్నాయి.

క్షణంసేపు భయంగా, విహ్వలంగా చూసిన ఆ అమ్మాయిముఖం వెంటనే తెల్లగా పాలిపోయింది.

ఎంత మారింది! ఎంత యెదిగింది! అనుకున్నాడతను.

'నువ్వు-నువ్వా?-' కోపం, అసహ్యం, అవమానం అన్నింటితోనూ ఉక్కిరిబిక్కిరిఅవుతున్న ఆ అమ్మాయి పెదవులు అస్పష్టంగా కదిలాయి.

'ఇంతవరకూ యెప్పుడూ జీవితంలో నేనే అని గుర్తుచేయటానికి యెక్కడా సిగ్గుపడలేదు. కాని ఈ రోజు యీ క్షణంలో మాత్రం నిజంగా అలా సిగ్గుపడుతున్నాను.' అతనికి తెలియకుండానే అతని కంఠం విచి త్రంగా మారింది.

కొద్దిసేపు పిట్టల కలకలం- గాలిలో ఈలల చప్పుడూ తప్ప యింకేం విన్పించలేదు మాధవ్‌కి. కాలం నిల్చిపోయినట్టే వుంది.

'ఇన్ని సంవత్సరాల తర్వాత మళ్ళీ యిలా కలుసుకోవటం యెంత విచిత్రం' అన్నాడు.

'ఎంత దురదృష్టం!' కఠినంగా మొనతేలిన అంబులా సూటిగా వచ్చింది సమాధానం.

నవ్వాడతను. ఆ అమ్మాయి చూడలేదు గానీ, చూస్తే ఆడవాళ్ళ హృదయాల్లో వేయివెన్నెలలు, కోటితీయటి తలపులు రేకెత్తించేంతటి చక్కటి నవ్వు అది.

'మిమ్మల్ని నేను అవమానించినమాట నిజమే! కాని పోట్లాట మొదలు పెట్టింది మీరు అన్నసంగతి మర్చిపోవద్దు. ఇదిగో! కొంచెం తలెత్తిచూస్తే ఆ గుర్తు శాశ్వతంగా నా ముఖంమీద యిప్పటికీ కన్పిస్తుంది.' కొద్దిగా గడ్డం పైకెత్తి బుగ్గమీద గాటువున్నచోట వేలు పెట్టి చూపించాడు.

'హుఁ!' ముక్కు పుటాలు, పెదవులు రోషంతో అదుర్తుండగా విసురుగా అంది.

'మీరింకా యెక్కువ శిక్షించ దలచుకుంటే యిప్పటికీ ఆ అవకాశం వుంది. ఆ ద్రోహి మీ ఎదుటే వున్నాడు.'

కిందికి చూస్తున్న ఆ అమ్మాయి చురుగ్గా తలెత్తి చూసింది. తీక్షణంగా, సూటిగావున్న ఆ చూపులో అంతులేని అసహ్యం, అపుకో లేని వెగటు స్పష్టంగా కన్పిస్తున్నా యెందుకో మాధవ్‌కి ఆ ముఖాన్ని రెండు చేతుల్లోకి తీసుకోవాలనిపించింది. ఈ అమ్మాయి వాసు అక్కా? సంధ్య ఈ అమ్మాయా? అతని మనస్సు ఆశ్చర్యాన్నుంచి తేరుకోలేక ఇంకా వుక్కిరిబిక్కిరి అవుతోంది.

'నిన్న-నిన్న వాసుదగ్గరి కొచ్చింది—'

'నేనే!'

'ఎందుకు? ఇంకా 'యేం నాశనం చేయాలి—?' ఈ సారి ఆ కంఠంలో తడబాటుగాని, వెరపుగాని లేదు.

మాధవ్ తెల్లపోయి వెనక్కు తగ్గినట్టు చూశాడు.

చూస్తుండగానే ఆ అమ్మాయి కళ్ళనిండా నీళ్ళు తిరిగాయి. 'నా మొహాన యింకా యేం వ్రాసిపెట్టి వుంది? నే నేం పాపం చేశాను?' అంటూనే చేతుల్లో ముఖందాచుకుని వెక్కి వెక్కి యేడవసాగింది.

క్షణంసేపు నిరుత్తరుడైనా, అంతలోనే తేరుకున్న మాధవ్‌కి సంధ్యని తాకాలనిపించింది. దగ్గిరగా తీసుకుని 'నా నుంచి నీకేం చెడు జరగదు, భయపడకు-' అని నచ్చచెప్పి ఓదార్చాలనిపించింది. గతంలో అనుకోకుండా పశువులా ప్రవర్తించిన ఆ సంఘటనకి తర్వాత తర్వాత గుర్తువచ్చినప్పుడల్లా తనెంత నరకం చూశాడో వివరించాలనుకున్నాడు. కాని యేం చెయ్యలేకపోయాడు కారణం అంత క్రితం ఆ అమ్మాయి కళ్ళలో తనంటే కన్పించిన అసహ్యం నిస్సహాయుడినిచేసి దూరంగా నిలబెట్టోంది. అతని అంతరాత్మ ఆ కాస్తలోనే ఆ అమ్మాయి అణువణువు అతన్ని యెంత ద్వేషిస్తోందో పసిగట్టేసింది.

మనం అంటే కోపం వున్నవాళ్ళ దగ్గరికి వెళ్ళవచ్చు. బెదిరించే వాళ్ళ దగ్గరికి వెళ్ళవచ్చు. ఇష్టంలేదని తెలిసికూడా చేరుకోవాలని ప్రయత్నం చేయవచ్చు. కాని అసహ్యించుకునే వాళ్ళవైపు అడుగుకూడా వేయలేం. వాళ్ళ యేవగింపు చూసి ఆత్మ ముక్కలు ముక్కలుగా నరికినట్టు బాధ పడుతుంది. అందుకే మాధవ్ నిశ్చేష్టుడై నిస్సహాయంగా చూస్తూ కూర్చుండి పోయాడు.

కొద్ది సేపయింతర్వాత ఆ అమ్మాయి తన ఏడుపు నిగ్రహించుకుని కలా నిజమా అన్నట్టు చుట్టూ చూసింది. ఎదురుగుండా మాధవ్ వెనక్కి చేతులు ఆన్చి బొమ్మలా అలాగే కూర్చున్నాడు. సంధ్య లేచి నాలుగడుగులు వేసి వెంటనే హఠాత్తుగా వెనుకనుంచి భూతం తరుముకు వస్తున్నదానిలా పారిపోయింది.

మాధవ్ చాలాసేపు అక్కడే శిలలా చలనం లేకుండా కూర్చుండి పోయాడు. అతనికి పూర్తిగా మతిపోయినట్టే వుంది. అతని చూపు నదిలో నీళ్ళమీద, వాటిమీద చిక్కగా అలముకున్న సంధ్యాకాంతిమీద నిల్చిపోయింది. ఈ అమ్మాయిని యిలా కలుసుకోవటం యెంత విచిత్రం! కాని, కాని- ఇదివరకు యెప్పుడు గుర్తుకువచ్చినా మహారాణిలా అంతులేని సిరిసంపదల మధ్య అహంకారంతో ఠీవిగా అందరి మీద

అధికారం చెలాయిస్తూ సుఖంగా వున్నట్టు కళ్ళముందు కదిలేది. కాని, ఆర్థిక పరిస్థితి ఇంత దిగజారి, చివరికి భోజనంకోసం కాయకష్టం చేసుకుంటూ కూరలు పండించుకుంటోందని వూహామాత్రంగా కూడా అనుకోలేకపోయాడు. అన్నను. ఎలా అనుకుంటాడు? జరగబోయే ప్రతిదీ వూహమీద తెలుసుకోగలిగితే ఇక మనిషి అతిశయానికి, అహంకారానికి హద్దుంటుందా? అరగంట క్రితం అతనికి కలిగిన మనశ్శాంతి నామ రూపాలు లేకుండా నాశనం అయింది.

చాలా పొద్దుపోయింతర్వాత తిరిగి తిరిగి అలసిపోయి అతను నీరసంగా యిల్లు చేరుకునేసరికి ఇంటిముందు రెండుకార్లు ఆగివున్నాయి. ఇల్లంతా సందడిగా వు ది.

# 15

మెట్లెక్కి వరండాలోకి వస్తున్న మాధవ్‌దగ్గరికి జ్యోతి పరుగెత్తుకుంటూ యెదురు వచ్చి 'దొంగా నువ్వు చెప్పకపోతే మేం కనుక్కోలేమని కదూ! చూడు, యెలా పట్టేశామో!' అంది నవ్వుతూ. జ్యోతి వేసుకున్న బట్టలు వుల్లిపొరలా చీరలోని జాకెట్, జాకెట్‌లోంచి బాడీ కన్పించేంత పల్చగా వున్నాయి. జ్యోతి వంటరిగా రాలేదు. వెంట పిక్నిక్ పేరుతో పదిమందిని వేసుకు వచ్చింది. వాళ్ళందరి నవ్వులతో కేరింతలతో యిల్లంతా మారుమ్రోగిపోతోంది.

దొరగారియింటికి రెండు కార్లనిండా చుట్టాలు వచ్చారనీ, వాళ్ళలో చాలా మంది ఆడవాళ్ళని, వాళ్ళు చాలా ఫాషన్‌గా వున్నారనీ మగవాళ్ళతో సమానంగా కూర్చుని కబుర్లు చెపున్నారని ఆ రాత్రికి రాత్రే వూరంతా ప్రాకిపోయింది. కొంతమంది కూరలు తెచ్చియిచ్చే నెపంతో, యింకా కొంతమంది పెరుగు పంపింది చాలా! ఇంకా కావాలా? అంటూ అవసరాలు కనుక్కునే నెపంతో పదే పదే వచ్చి చూసి వెళ్ళసాగారు. మర్నాటి కల్లా వచ్చినవాళ్ళ గురించి కథలు కథలుగా చాలా చెప్పకున్నారని జ్యోతికిగాని, మాధవ్‌కిగాని తెలియదు.

మర్నాడు ఆదివారం శెలవురోజు కావటంవల్ల అంతా ఉండిపోయారు. మాధవ్ శరీరం వచ్చిన ఫ్రెండ్స్‌తో తిరుగుతున్నా, మాట్లాడుతున్నా

అతని మనసు మాత్రం వాసు యింటిచుట్టూ తిరుగసాగింది. ఈ చుట్టాలు, ఆడపిల్లలు చూసి సంధ్య యేమనుకుంటుంది ? ఎలాగైనా సరే ఆర్థికంగా చితికిపోయిన సంధ్యని ఆ దరిద్రంలోంచి పైకి లేవనెత్తాలని అతని మనసు అప్పుడే నిర్ణయించుకుంది. కాని సంధ్యచూపులు, ఆ ప్రవర్తన గుర్తుకువస్తే అది అంత సులభం కాదేమోనని భయం వేస్తోంది.

ఆ రాత్రి జరిగిపోతే మర్నాడు వుదయం వచ్చినవాళ్ళంతా వెళ్ళిపోతారు. వాళ్ళు వెళ్ళగానే వాసుదగ్గరికి వెళ్ళవచ్చు తను. అనుకోకుండా ట్రాన్సిస్టర్ అక్కడ వదిలిరావడం ఓ విధంగా మంచిదే అయ్యింది. వాళ్ళెప్పుడు వెళ్ళిపోతారా అని నిమిషాలు లెక్కపెట్టుకుంటూ పరధ్యానగా నిలబడిన మాధవ్‌దగ్గరికి జ్యోతి వచ్చింది.

'ఏమిటి మధూ! అలా వున్నావేం? ఒంట్లో బాగాలేదా!'

'ఎలా వున్నాను? బాగానే వున్నానుగా!' నవ్వు తెచ్చిపెట్టుకుంటూ అడిగాడు.

'వచ్చినప్పటినుంచి చూస్తున్నాను. మనసువిప్పి మాట్లాడవు. నిన్ను అడక్కుండా వీళ్ళందర్నీ తీసుకువచ్చానని కోపంవచ్చిందా నామీద?'

'లేదు, జ్యోతీ లేదు. నువ్వు నిన్న రాకుండావుంటే నాకు పిచ్చెక్కేది' బైట చీకటిలోకి చూస్తూ మనస్ఫూర్తిగానే అన్నాడు మాధవ్!

జ్యోతి కళ్ళలోకి సంతోషంతోపాటు గర్వంకూడా తొంగిచూసింది.

'ఇక్కడ యీ మూరుమూల కావాలని ఒంటరితనంతో నీ చుట్టూ నువ్వు సమాధి కట్టుకోకపోతే — అక్కడే మా అందరితో ఉండిపోగూడదూ ?'

'ఎక్కడుండను? ఇది ఒక్కటే నాకున్న యిల్లు.'

'గొప్ప. నా చేత చెప్పించాలని!' జ్యోతి లాలనగా నవ్వింది.

ఇంతలో మరొకరు అక్కడికి రావటంతో సంభాషణ ఆగిపోయింది.

జ్యోతి వాళ్ళు వెళ్ళిపోయారు. మాధవ్ వెంటనే వాసుదగ్గరకి వెళ్ళటానికి బట్టలేసుకుని బైలుదేరాడు. కాని అడుగు ముందుకు పడలేదు. వాసుకి ఈ పాటికి తనెవరో తెలిస్తే? సంధ్య చెప్పి వుంటుందా? ఒకవేళ

చెప్పినా చెప్పకపోయినా మాట్లాడవద్దని ఆజ్ఞాపిస్తే? సంకోచం వెళ్ళకు అని అడ్డుపడి వెనక్కు లాగితే అంతకంటె బలమైన శక్తి యేదో వెళ్ళమని ముందుకు తోస్తోంది. ఈ రెండింటి పెనుగులాటతో యేదీ నిర్ణయించుకోలేని మాధవ్ చివరికి ఆ రోజుకూడా వెళ్ళలేదు.

# 16

రాత్రంతా ఆలోచించి ఒక నిర్ణయానికివచ్చి మర్నాడు వుదయం బైలుదేరబోతూవుండే జోగులు ట్రాన్సిస్టర్ తెచ్చియిచ్చాడు. దాంతోపాటు చిన్న చీటీకూడా అందిచ్చాడు. వాసు వ్రాసిన ఉత్తరం అది—

'అక్క యెందుకో చాలా కోపంగా వుంది. ట్రాన్సిస్టర్ పంపించేస్తున్నందుకు యేమీ అనుకోకండి. ఈ యింట్లో అక్కమాట శిలాశాసనం. నేను దురదృష్టవంతుడిని. లేచి నడవలేని నిర్భాగ్యుడిని. లేకపోతే స్వయంగా వచ్చి కృతజ్ఞతలు చెప్పి యిచ్చేవాడిని. నాకు మీరంటే చాలా యిష్టం. అది మర్చిపోకండి. మా అక్కమనసు నొప్పించలేని నా బలహీనతకు నన్ను క్షమించండి. —వాసు.'

మాధవ్ అంతర్యంలో మెలితిరుగుతున్న వూహే నిజమైంది. అందుకే ఆతనికి అంతగా ఆశ్చర్యం అనిపించలేదు. ఇంటికి వెళ్ళగానే తమ్ముడిదగ్గరున్న ట్రాన్సిస్టర్ యెవరిదో తెలుసుకుని వెంటనే తిప్పి పంపెయ్యమని ఆజ్ఞాపించి వుంటుంది. ఆ సమయంలో వాసుముఖం యెలా ఉంటుందో తేలిగ్గా వూహించుకోవచ్చు.

కాని, మనసులో మొన్నటినుంచి సంధ్యని మరొక్కసారి దగ్గరగా చూడాలనే కోర్కెను కాదనలేకపోతున్నాడు. కాని కోర్కె తీరేమార్గంలేదు. సంధ్య ట్రాన్సిస్టర్ తిప్పిపంపి, తనమని ఆ యింటి తలుపులు వేసేసింది. ఈ నిరాశ అనే గాఢాంధకారంలో వాసు మినుకుమంటూ వెలిగి ఆరిపోతున్నాడు. వాసుకి తనంటే ఇష్టం యేర్పడింది. అందుకు సందేహంలేదు. మాధవ్ దృష్టి 'నాకు మీరంటే చాలా యిష్టం. అది మర్చిపోకండి' అన్న వాక్యాలమీద మరోసారి నిల్చింది. తను ప్రయత్నంచేసి చూస్తే వాసుని కలుసుకోవటం యేమంత కష్టం కాకపోవచ్చు.

అందుకే ధైర్యంచేసి ట్రాన్సిస్టర్ తీసుకొని తనే స్వయంగావెళ్ళాడు. మంచంమీద ముడుచుకుని కూర్చున్న వాసుముఖం మాధవ్‌ని చూడగానే చాటంత అయింది. చప్పున లేవబోతూ 'మీరెంత మంచివారు? ఇక ఈ జన్మలో మళ్ళీ మిమ్మల్ని చూడననే అనుకున్నాను' అన్నాడు వికసించిన ముఖంతో.

'వాసూ! ట్రాన్సిస్టర్ పంపివేయటానికి కారణం ఏమిటో నేను తెలుసుకోవచ్చా?'

వాసుముఖం వాడిపోయింది. 'నాకు తెలియదు. అక్క అలా పరాయి వాళ్ళ దగ్గర్నుంచి యేమీ తీసుకోకూడదు. పంపివెయ్ అంది.'

'పుడుతూనే అంతా ఆప్తులు అవుతారా?'

వాసు మౌనం వహించాడు.

'చెప్పు వాసూ! నేను అపరిచితుడి ననేనా? లేక యింకేమైనా కారణం వుందా?' సంధ్య వాసుకు కారణం యేంచెప్పిందో తెలుసుకోవటానికి అతని మనసు ఆత్రపడుతోంది.

'నాకు తెలియదు. ఒకళ్ళనుంచి తీసుకోకూడదు అంది. అంతే! నేను తీసుకోను.'

'అది నిజమే. వాసూ! ఒకళ్ళనుంచి అయాచితంగా యేమీ తీసుకోకూడదు అన్న మీ అక్క అభిప్రాయాన్ని నేను అర్థం చేసుకోగలను. గుర్తించి గౌరవిస్తాను కూడా. కాని, అది అందరివిషయంలోనూ చెల్లదు. నీ నుంచి నే నేదయినా ఆశిస్తూ స్వలాభాపేక్షతో యిస్తే నువ్వు తీసుకోకూడదు. కాని నా కలాటి వుద్దేశ్యమేలేదు. కేవలం నిన్ను చూసి జాలిపడి యిచ్చాను. నాకులేని వుద్దేశ్యాలు అంటగడితే చాలా బాధనిపించింది. అది చెప్పి వెళ్ళటానికే వచ్చాను. వస్తాను.' మాధవ్ వెళ్ళటానికి రెండడుగులు వేయగానే వాసు వంగి చప్పున చేయిజాచి అతని చెయ్యి గట్టిగా పట్టుకుని 'ఆగండి. నా మాట వినండి' అన్నాడు ఆత్రంగా.

'జరిగింది చాల్లే వాసూ! నే నింక పొరపాటుగాకూడా ఈ యింటి ఛాయలకి రాను. నా కిప్పుడర్థమైంది-నే నీ నెపంతో మీ యింటికి పదిసార్లు వస్తానని మీ అక్క భయంలావుంది.' అతను మాట్లాడే ప్రతిమాటా వాసు లేతమనసుమీద యెలాటిముద్ర వేస్తోందో అతను గమనించక పోలేదు.

'ప్లీజ్! మీరు నా మాట వినాలి!' దీనంగా పిలిచాడు.

మాధవ్ వెనక్కి తిరిగి యేమిటన్నట్టు చూశాడు.

వాసు కళ్ళల్లో తడి కన్పిస్తోంది. 'మా అక్కకి నచ్చినా నచ్చక పోయినా మీరు నాకు కావాలి. మనిద్దరం స్నేహితులం. అవునా?'

మాధవ్‌ని చూస్తుంటే అతనికి పెద్ద పెన్నిధి దొరికినట్టుంది. సంధ్య మొన్న వచ్చి కోపంతో యెగిరిపడుతూ ట్రాన్సిస్టర్ తిప్పిపంపి వెయ్యమని ఆజ్ఞాపించినప్పుడే అతని మనసులో పెనుగులాట ప్రారంభమైంది. ఎడారిలో ఒయాసిస్‌లా ఈ పల్లెటూరులో ఈ నిరక్షరకుక్షుల మధ్య అతను దేవతామూర్తిలా దొరికాడు. అయినా అసలు అతనెంత మంచివాడు? ఎన్ని కబుర్లు చెప్పాడు! అన్నింటికంటె మించి తనంటే యెంత జాలిలేకపోతే ట్రాన్సిస్టరు వదిలి వెళ్ళాడు? మాధవ్‌తో కూర్చుని మాట్లాడుతుంటే యింకో ప్రపంచంలో జీవిస్తున్నంత అమృతంగా వుంటుంది. ఎలాటి పరిస్థితుల్లోనూ, చివరికి సంధ్యకి కోపంవచ్చినా సరే అతనిస్నేహం వదులుకోగూడదని నిశ్చయించుకున్నాడు. అక్కమాట కాదంటున్నానేమోననే బాధ పీకినా వాసు మనసులో స్వార్థమే గెలుచుకున్నది.

'నా మూలంగా మీ యింట్లో అశాంతి యేర్పడటం నాకిష్టంలేదు వాసూ!' ఈ మాటలు మాధవ్ మనస్ఫూర్తిగానే అన్నాడు. తనుచేస్తున్న ఈ పనివల్ల సంధ్య బాధపడితే అది అసలు భరించలేడు.

'అక్కకి నేను నచ్చచెప్తా! అక్క భయం నాకు తెలుసు! మగవాళ్ళంతా దుర్మార్గులనీ, మోసగాళ్ళనీ అనుకుంటుంది. మగవాళ్ళలో మీలాంటి మంచివాళ్ళున్నారని అక్కకి తెలియదు. మీ కెందుకు? మీరు వస్తూ పోతూ వుండండి. తనంతట తనే మీ మంచితనం గ్రహించకపోతే నా పేరు వాసేగాదు!' దృఢంగా అన్నాడు.

# 17

'వాళ్ళు ఆ యిల్లు అమ్మేస్తారట; ఒప్పుకున్నారు.' మేనేజర్ పరుగెత్తుకుంటూ వచ్చి సంతోషంగా చెప్పాడు.

'ఏ యిల్లు?' నిర్లక్ష్యంగా అడిగాడు మాధవ్, చూస్తున్న పేపర్ మీదనుంచి దృష్టిని కదల్చకుండా.

'ఏ ఇల్లు! మనం ఇన్నిరోజులూ దేనికోసం ప్రయత్నించేస్తున్నాం?' ఆశ్చర్యంగా చూశాడు మేనేజర్.

'పెంకుటిల్లు సంగతేనా?-'

'అవును సార్! నాకు ఉదయం కబురు చేశారు. మన యిష్టంవచ్చినంత ధర యిచ్చి తీసుకోమన్నారు.'

'నేను అది కొనదల్చుకోలేదు. ఆ ప్రయత్నం విరమించుకున్నాను.'

'నిజంగా?'

'నిజంగానే! తర్వాత—నీతో నిన్ననే చెప్పాలనుకున్నాను. నీకిక్కడ పని పూర్తయిపోయినట్టుంది. నువ్వింక హైద్రాబాద్‌కి వెళ్ళిపోవచ్చు' అన్నాడు, నిదానంగా ఖచ్చితమైన స్వరంతో పేపరు మడుస్తూ.

'సార్? కానీ ఆ యిల్లు-'

'చెప్పానుగా!' మాధవ్ అక్కడినుంచి లోపలికి వెళ్ళిపోయాడు. మేనేజర్ నోరు తెరచి చూస్తుండిపోయాడు. ఏదయినాఅంటే యెలాటి పరిస్థితుల్లోనూ వెనకాడని మనిషి మాధవ్. ఇప్పుడు ఈ విషయంలో- యింత ప్రయత్నం చేసి తర్వాత యెందుకు కాదంటున్నాడో అతనికి బుర్ర పగలగొట్టుకున్నా అర్థంకాలేదు.

# 18

వాసుతో మాధవ్ పరిచయం దినదినాభివృద్ధి చెందసాగింది. అతనితో తన బంధాన్ని గట్టిగా ముడివేసుకుంటేగాని సంధ్యని చేరుకోలేడు. అందుకే యెన్ని ప్రయత్నాలు చేయాలో అన్నీ చేస్తున్నాడు. వాసు ఇప్పుడు మాధవ్‌రావటం యేకారణంచేతనైనా అరనిమిషం ఆలస్యమైతే ఆగలేడు. ఎందుకు రాలేదు ఏమైంది అని అంటూ విలవిలలాడిపోతాడు. అతని మనసంతా మాధవ్ రూపంతోనూ, మాటలతోనూ నిండిపోయింది. వీటన్నిటి మధ్యా అతన్ని వేధిస్తున్న బాధకూడా ఒకటి లేకపోలేదు. అది యెంత కాలం గడిచినా ఎన్ని విధాల తను తర్కించి నచ్చచెప్పాలని చూసినా సంధ్యకి మాధవ్ మంచితనం మీద నమ్మకం యేర్పడటంలేదు. అతని పేరు వింటే చాలు సంధ్యకళ్ళలో అసహ్యం కన్పిస్తుంది. కంఠం

కరుకుగా మారుతుంది. రానురాను వాసుకు అక్కగారి తెలివి తేటలమీద నమ్మకం సడలిపోయింది. మనుష్యుల్లో మంచివాళ్ళని గుర్తించలేకపోయిన తర్వాత యెంత చదువుంటే ఏం లాభం? ఎన్ని తెలివితేటలుండి ఏం ప్రయోజనం?

మాధవ్ వాసుకోసమని ఇచ్చే వస్తువుల సంఖ్య నానాటికి పెరిగిపోసాగింది. మొదట్లో చాక్‌లెట్లు, బిస్కెట్లు, పుస్తకాలు మాత్రమే ఉండేవి. అవి రానురాను హార్లిక్స్, కాఫీపొడి, పంచదార, బ్రెడ్, పళ్ళు అయి యిప్పుడు చాలా వుంటున్నాయి. సంధ్య వీటిల్లో వేటినీ తాకదనీ, విషంలా చూస్తుందనీ స్వయంగా వాసుకికూడా ఆ సంగతి తెలియదు.

మొదట మొదట్లో ముఖావంగా ఉండే ఆయాకి కూడా క్రమేపీ మాధవ్ అంటే అభిమానం ఏర్పడసాగింది. ఇప్పుడిప్పుడు మనసువిప్పి మాట్లాడుతోంది వాసుతోపాటు కాఫీ అదీ యిస్తోంది అన్ని రోజుల నుంచి ఇంటికి వస్తున్నా ఒక్కసారి సంధ్యవైపు చూడటం కాని, అసలు మాట్లాడాలని ప్రయత్నంకాని చెయ్యని మాధవ్ వ్యక్తిత్వం, ఆ పెద్ద మనిషి తరహా ఆవిడకి నచ్చింది. ఆనందంగా కూడా అన్పించింది. కాని అతని హృదయం అంతా సంధ్యరూపమే నిండివుందని, సంధ్య మూలంగానే ఈ యింటికి వస్తున్నాడని-కాని అవి జాగ్రత్తగా మనసులో మారుమూల దాచేసుకున్నాడని వూహించలేదు.

ఓ రోజు మాధవ్ కూర్చుని వుండగా ఆకాశం వెన్నెల ఈ ప్రసంగం వచ్చింది వాసు నిట్టూర్పు విడుస్తూ 'అబ్బ! బైట గాలి తగిలి, అనంతమైన ఆకాశాన్ని చూసి యెన్ని యుగాలైందో? ఇక జన్మలో చూస్తాననే ఆశ కూడా లేదు. ఈ బ్రతుకిలా ఈ గదిలో ఈ మంచంమీద తెల్లవారాల్సిందే కాబోలు! హుఁ! ఒక్కోసారి ఈ బలవంతపు బ్రతుకు యెంత నరకం అన్పిస్తుందో!' అన్నాడు బాధగా.

మాధవ్ మనసులో చిత్రమైన వూహ కలిగింది. అది పైకి వెంటనే చెప్పేశాడు. 'వాసూ! వెనక్కు జారగిలబడి కూర్చోగలవు కదూ!' వాసు కూర్చోగలను అన్నట్టు చూశాడు.

'నేనీసారి హైద్రాబాదు వెళ్ళినప్పుడు చక్రాల బండికి ఆర్డర్ ఇచ్చి

వస్తాను. అది తీసుకొచ్చి నిన్నందులో కూర్చోపెట్టి అలా సాయంత్రం వేళల్లో నదిఒడ్డుకి తీసుకు వెళ్ళవచ్చు.'

వాసు కళ్ళు ఆనందంతో, ఆపుకోలేని కోర్కెతో మెరిశాయి. వెంటనే కృతజ్ఞతలతో నిండా నీళ్ళు తిరిగాయి! మాధవ్ చేతిని లాక్కుని అందులో ముఖం దాచుకుంటూ 'నిజంగా మీ రెంత మంచివారు? నాకు మళ్ళీ బ్రతుకుమీద అంతులేని ఆపేక్షని పుట్టిస్తున్నారు' అన్నాడు. మాధవ్ నిశ్శబ్దంగా వాసు జుట్టు నిమురుతూ వుండిపోయాడు. మొదట మొదట్లో సంధ్యని చేరుకోవాలనే కాంక్షతో వాసుని ఆధారంగా తీసుకున్న మాట నిజమే! కాని-రోజులు గడుస్తున్నకొద్దీ-యిద్దరిమధ్యా పరిచయం అభివృద్ధి చెందినకొద్దీ, వాసు తనంతటతాను ప్రత్యేకంగా అతని మనసులో చోటు చేసుకోసాగాడు. జీవితంపట్ల యెంతో అనురాగం, ఎన్నో ఆశలున్న ఈ కుంటిపిల్లవాడిమీద అతనికి దయాభిమానాలు నిండుగా కలగడం ప్రారంభించాయి.

మర్నాడు వూరు వెళ్ళబోయేముందు బట్టలేసుకుని వాసుతో చెప్పి వెళ్ళటానికి వచ్చాడు. వాకిట్లోనే బిగ్గరగా మాటలు వినిపిస్తున్నాయి. మాధవ్ సందేహిస్తూ వరండాలోనే ఆగిపోయాడు

'నేను కానిపనేం చేశాను? ఆయననెంత మంచివారు? అది నువ్వు గుర్తించకపోవడం నా దౌర్భాగ్యం. నా కోసం నన్ను చూసి జాలిపడి యిదంతా చేస్తున్నారని చెపితే విన్పించుకోవేం? అసలు నిన్ను గుర్తించి నీ చుట్టూ తిరగడంలేదని; నిన్ను ఆరాధించకుండా నిర్లక్ష్యంగా వుంటున్నాడని నీకు కక్ష.' వాసు ఏడుస్తూ బిగ్గరగా అనుస్తున్నాడు.

'నోర్ముయ్. మాటలు మిగిలావ టే పళ్ళు రాలగొడ్తాను. జాగ్రత్త! బుద్ధిలేని వెధవా! నువ్వేం మాట్లాడుతున్నావో నీకు తెలుసా?' కోపంగా అరిచింది సంధ్య.

'తెలుసు. తెలిసే మాట్లాడుతున్నాను. అసలు ఆయనంటే నీ కెందు కంత అసహ్యం?'

'అది నీ కనవసరం.'

'అవసరం! అకారణంగా మంచివాళ్ళని అసహ్యించుకోటానికి నువ్వు సిగ్గుపడాలి.'

'నోర్ముయ్!'

'అబ్బబ్బ! సంధ్యా!' ఆయా విసుగ్గా పిలిచింది.

'చూడమ్మా! యెలా పేలుతున్నాడో! ఇదివరకు ఎప్పుడైనా వాడిలా మాట్లాడాడా? నే నిప్పు డింత పరాయిదాన్ని అయిపోయాను. లేకపోతే—' చివరి మాటలని ఏడుపు మింగేసింది.

క్షణం నిశ్శబ్దం. సంధ్య ఏడుస్తున్న చప్పుడు విన్పించింది.

'అక్కా, అక్కా!' వాసు కోపం మర్చిపోయి జాలిగా బ్రతిమ లాడుతున్నాడు.

'నాతో మాట్లాడకు. ఇంకెందుకు నేను?' వెక్కిళ్ళ మధ్య అస్పష్టంగా అంది.

'అక్కా! నువ్వలా అంటే నేను చచ్చిపోయినంత ఒట్టు. నాకు నువ్వు తప్ప ఎవరూ లేరు. పొరపాటయింది. ఇంకెప్పుడూ అనను అని చెబు న్నాగా! ఆయా! అక్కని దగ్గరికి తీసుకో!' వాసు ఏడుస్తూనే ఆజ్ఞా పించాడు.

'ఏమిటమ్మా? నువ్వు కూడా మరీ చిన్నపిల్లలా, పసివాడేదో అంటే...' ఆయా అంది.

'నే నెవరికోసం బ్రతకాలి! వాడికికూడా అవసరం లేదు.'

'అక్కా!'

'అక్క చచ్చిపోయిన రోజున కాని నీకు తెలిసిరాదు.'

'అబ్బబ్బ! ఏమి టా మాటలు. హుష్! ఊరుకో! నా తల్లిగా.'

ఆయా మందలిస్తున్న ధోరణిలో ఆప్యాయంగా అంది.

'నాకు నువ్వు తప్ప ఎవరూ అవసరంలేదు. నేను చచ్చిపోయినంత ఒట్టు. నిజం.' వాసుకూడా యేడుస్తున్నాడు.

స్థాణువులా నిలబడిపోయిన మాధవ్ నిశ్శబ్దంగా వెనక్కు తిరిగి వచ్చేశాడు. 'నే నెవరికోసం బ్రతకాలి!' ఆ మాటల్లో నిరాశ ఆవేదన అతని గుండెలని చీల్చసాగింది. అయితే సంధ్య జీవితానికి ఒక్క ఆకర్షణవా సేనా? అంతకుమించి యింకేమీ లేదూ? అసలు తనని దగ్గరగా రానివ్వదు యెందు వల్ల? పోనీ అసహ్యంవుంటే ముఖంమీద వెళ్ళగొక్కెయ్యొచ్చుగా! వాసు కోసం యిదంతా గరళంలా మింగి పూరుకుంటోంది కాబోలు! వాసుపట్ల తను చూపుతున్న ఈ ఆదరణ సంధ్యకి రంపపుకోతలావుందని మొట్ట

మొదటిసారిగా గ్రహించిన అతని హృదయం బాధతో బరువెక్కింది. సంధ్య పరిస్థితులు సరిగ్గా వుండి, అందరి ఆడపిల్లల్లా ఆమెకూడావుంటే అతనసలు పట్టించుకునేవాడు కాదు. కాని సిరిసంపదలతో పుట్టి పెరిగి ఆత్మాభిమానం కోసం కాయకష్టానికికూడా జంకక ఈ మారుమూలకువచ్చి బ్రతుకుతున్న సంధ్య అంటే అతనికి జాలితోపాటు అభిమానంకూడా ఏర్పడుతోంది. ఆర్థికంగా దిగజారిపోయిన పరిస్థితుల్లో ఉండికూడా తను యిస్తున్న చేయూతని అందుకోకుండా నిర్లక్ష్యంగా పూరుకుంటోంది. సౌందర్యానికి మించిన స్వాభిమానం, చదువుకువించిన సంస్కృతి, తెలివితేటలని పదునుబెట్టే వ్యక్తిత్వం, వాటన్నిటికంటే యెలాటి స్థితియైనా ధైర్యం కోల్పోకుండా, నిగ్రహంతో జీవితంతో పోరాడుతున్న సంధ్యని చూసి అతనిలో అణువణువు ఆకర్షింపబడుతోంది. కాని, ఆమెని పూర్తిగా జయించి తనదానిని చేసుకునేందుకు తనతోపాటు సంధ్యకూడ తగినంత బాధకి గురికాక తప్పదలా వుంది.

తను వెదుతున్నది కేవలం వాసుకోసమేనని రుజువుచేయటానికి, మనసులో ఎంత పీడిస్తున్నా, సంధ్యనిగురించి యే విషయాలు అడగలేదు. ఏ మాత్రం తొందరపడకూడదని తనని తను ఆజ్ఞాపించుకున్నాడు. నెమ్మదిగా వాసే యెప్పుడో తనంతట తానే బైటపెడతాడు. ఆ అవకాశంకోసం ఓపిగ్గా ఎదురుచూడాలి. అంతే! పుష్పం సహజంగా దానంతట అది వికసించాలి. బలవంతంగా తెరవబోతే వాడిపోయి యెండి నేలరాలే ప్రమాదం వుంది.

# 19

మాధవ్ పూరునుంచి వచ్చాడు. వెంట చక్రాలబండి తయారు చేయించి తీసుకువచ్చాడు. అది చూడగానే వాసుముఖం సంతోషంతో ఎలా కనిపిస్తుందో అతనికి తెలుసు. ఆ ఆనందాన్ని స్వయంగా చూడాలన్న ఆసక్తిని నిగ్రహించుకున్నాడు. అందుకే బండిని జోగులుని పిలిపించి అతనిద్వారా పంపించాడు. బండి యిచ్చిన అతను వుత్తరం ఒకటి తెచ్చి యిచ్చాడు. వాసు వ్రాసింది అది.

'మీరు రాలే దెందుకు? ఈ బండిలో నన్నెవరు కూర్చోపెట్టారు? మొట్టమొదటిసారి మీరే స్వయంగా నన్ను బైటకి తీసికెళతానని చేసిన వాగ్దానం మర్చిపోయారా? మీరు తీసుకెళ్ళకపోతే నా కసలు యీ బండి వద్దు. తీసుకువెళ్ళిపోండి. అక్క ప్రవర్తన మీరు పట్టించుకోవద్దు.' క్రిందటి సారికంటె కుదురుగా పొందిగ్గా వుంది దస్తూరి. ఉత్తరం చూసి చాలాసేపు వెళ్ళటమా మానటమా అని తికమకపడి చివరకు బట్టలు మార్చుకునిబయలు దేరాడు.

మాధవ్ వెళ్ళేసరికి వాసు బిగ్గరగా వెక్కి వెక్కి యేడుస్తున్నాడు. ప్రక్కలో సంధ్య కూర్చుని వుంది. ఆయా తలవైపు నిలబడివుంది. ఇద్దరూ అతన్ని సముదాయించటానికి వ్యర్థ ప్రయత్నం చేస్తున్నారు.

'వాసూ! నా మాట వినవా? నా తండ్రివికదూ?—' సంధ్య జాలిగా బ్రతిమలాడుతోంది.

'వినను, వినను. నువ్వసలు నాకు అక్కవికాదు. నా పాలిట రాక్షసివి; దెయ్యానివి. ఆయన్ని నువ్వే యేదో అని వుంటావు. అందుకే రాలేదు. నాకు తెలుసు—' వాసు సంధ్య చేతిని విసురుగా తీసేశాడు.

మాధవ్‌కి యేం చెయ్యాలో తోచలేదు. అలాగే నిలబడిపోయాడు. కనీసం కర్టెన్ బయటయినా అయితే వెనక్కి తిరిగి వెళ్ళిపోయేవాడు. తీరా లోపలికివచ్చేసిన తర్వాత యిప్పుడా అవకాశం లేదు.

'హుష్-వూరుకో—వూరుకో—అదిగో ఆయన వచ్చారు!' అంది ఆయా.

సంధ్య వెనక్కు తిరిగి మాధవ్‌ని చూడగానే లేచి నిలబడింది. క్షణంలో సగం సేపు తన చూపుల్తో కలిసిన ఆమె చూపుల్లో కఠినత్వం వాడిశూలంలా వచ్చి అతని మనసులో గుచ్చుకుని కలుక్కుమంది. వాసు ఏడుపు నిగ్రహించుకోటానికి ప్రయత్నిస్తున్నాడు.

'అదేమిటి వాసూ! మరీ చిన్న పిల్లాడిలా—' దగ్గరగా వచ్చి పక్కలో కూర్చుని తలమీద చేయివేసి ఆప్యాయంగా అన్నాడు. వాసు మాట్లాడలేదు. సమాధానంగా రెండు చేతులూ మాధవ్ మెడచుట్టూ పెనవేసి దగ్గరగా లాక్కున్నాడు.

'ఛీ ఛీ! యేడుస్తారా యీ మాత్రానికి? మగవాళ్ళ పరువు తీసేస్తున్నావే? నాకు వీలుగాక రాలేదు. అంతే! ఆయా! వాసుకు తల దువ్వు. బయటకి తీసుకెడతాను' అన్నాడు.

కొద్దిసేపట్లో వాసు యేడుపు మానేశాడు. ఆయా తల దువ్వి బట్టలు మార్పించింది. మాధవ్ జాగ్రత్తగా అతన్ని యెత్తి బండిలో కూర్చోపెట్టాడు. చాలా రోజుల తర్వాత కదలటంవల్ల వాసు బాధతో కెవ్వుమన్నాడు.

సంధ్య ఆదుర్దాగా పరుగెత్తుకొచ్చింది.

'ఏం భయంలేదు. చాలా రోజుల తర్వాత కదలడంవల్ల అలా అన్పిస్తుంది. కొద్దిసేపట్లో సర్దుకుంటుంది.' వాసుముఖాన పట్టిన చెమటను తన జేబు రుమాలుతో తుడుస్తూ అన్నాడు మాధవ్.

'ఫర్వాలేదు. ఇంతకంటె వేయిరెట్లు బాధయినా భరించగలను మీరు ప్రక్కనుండాలి.' మాధవ్ కళ్ళలోకి చూస్తూ అన్నాడు వాసు.

# 20

మాధవ్ వాసును కూర్చోబెట్టిన చక్రాల బండి తోసుకుంటూ బయటకి నడిచాడు. వెనక శిలలా నిలబడి పాలిపోయిన ముఖంతో చూస్తున్న సంధ్యని యెవరూ గమనించలేదు. వాళ్ళు పూర్తిగా కనుమరుగు అయిం తర్వాత ఆయా సంతోషంతో 'నిజంగా ఏనాడో వాళ్ళిద్దరికీ ఋణం సుమా! లేకపోతే' అంటూ వెనక్కు తిరిగి తెల్లబోయింది. అప్పటికే సంధ్య హిస్టీరియా వచ్చిన దానిలా రెండు చేతుల్లో ముఖం దాచుకుని వెక్కివెక్కి ఏడవసాగింది.

. మాధవ్ చక్రాల బండిని నది ఒడ్డుకి తీసుకొచ్చి ఆపాడు. నీరెండ పడుతోంది. సాయం సంధ్యలో నది మీదినుంచి వస్తున్న చల్లటి గాలి హాయిగా ప్రాణం పోస్తున్నట్టుంది. తలెత్తి చూస్తే విశాలమయిన నీలాకాశం. అందులో యెక్కడికో గుంపులు గుంపులుగా తరలిపోతున్న తెల్లటి మబ్బులు. ఉండి ఉండి పక్షులు బార్లు తీర్చి గూళ్ళకి పరుగులెత్తుతున్నాయి.

వాసుకి వీటన్నిటినీ చూస్తుంటే ఆనందంతో మతిపోతోంది. ఎన్ని రోజుల తర్వాత బైట ప్రపంచం! ఇలా మళ్ళీ బయటకి వస్తానని కల్లోనైనా అనుకున్నాడా? ఈ వూరు వచ్చింతర్వాత వంటరితనం భరించలేక రాత్రింబవళ్ళు ఒకే తీరుగా భగవంతుడిని ప్రార్థించిన ఫలితమా యీ మాధవ్-అన్పిస్తుంది. కేవలం దేవుడికి దయగలిగి తన కోసం పంపబట్టిగాని, లేకపోతే ముక్కూ మొహం తెలియని తనమీద అతనికి యెందుకింత ఆసక్తి? ఎందుకింత మమకారం!

'మీరు రోజూ నిలబడే చోటు నాకు చూపించండి!' అన్నాడు వాసు చుట్టూ చూస్తూ.

'సరిగ్గా నేనిప్పుడు నిలబడ్డ చోటే-' సిగరెట్ తీసి వెలిగించుకుంటూ అన్నాడు మాధవ్.

వాసు తృప్తిగా కళ్ళారా చూశాడు.

'మీరెంత మంచివారు! ఒకవేళ యెందుకయినా కోపంవచ్చి యిక రారేమోననుకున్నాను!' అన్నాడు, కృతజ్ఞతతో కరిగిపోతూ. సిగరెట్ వెలిగించటం పూర్తి చేసిన మాధవ్ అగ్గిపుల్ల ప్రక్కన పారేస్తూ 'మొదలు రాకూడదనే అనుకున్నాను. కానీ నీ ఉత్తరం చూసిం తర్వాత ఉండలేక పోయాను' అన్నాడు.

'నా వుత్తరమా?' వాసు ఆశ్చర్యంగా చూశాడు.

'అవును. ఏం?'

'నేను-మీకు వుత్తరం వ్రాసి పంపానా?-' నమ్మలేనట్టు అడిగాడు.

'ఇదేమిటి మరి?' జేబులోంచి ఉత్తరం తీసి యిచ్చాడు.

అది తీసుకుని చూడగానే వాసు ముఖం మారిపోయింది 'ఇది నేను వ్రాసింది కాదు. అక్క వ్రాసింది. కాని ఆ మాటలు నావే.'

మాధవ్ తెల్లబోయి చూడసాగాడు. చూస్తుండగానే వాసు ముఖం విషాదకరంగా మారిపోయింది. 'ఛీ!-ఛీ! నేనెంత చెడ్డవాడినో మీకు తెలియదు. పాపం, అక్కని యెన్ని మాటలన్నానని? మీరు రాలేదని కోపంతో దాన్ని యేమిటేమిటో అన్నాను. నాకు తెలుసు. నేను యిక్కడ సంతోషంగా మాట్లాడుతున్నాను! అది అక్కడ ఇంట్లో యేడుస్తూ కూర్చుని

వుంటుంది.' సంతోషం ఎగిరిపోయిన ముఖంతో దిగులుగా అన్నాడు.

మాధవ్ మాట్లాడలేదు. ఉత్తరంలోకి చూస్తూండిపోయాడు.

ఈ వుత్తరం వ్రాసింది సంధ్యా? 'అక్క ప్రవర్తన నచ్చకపోతే పట్టించుకోవద్దు.' ఈ మాటలు స్వయంగా సంధ్యే వ్రాసింది అంటే అతను నమ్మలేకపోతున్నాడు.

'మా అక్క చాలా మంచిదండీ! మీరు చెప్తే నమ్మరు. నా కంటే కూడా చాలా మంచిది.' ఆత్రంగా అన్నాడు వాసు. మాధవ్‌కి జాలివేసింది. పాపం! ఇటు జీవితం మీద తను చూపిస్తున్న ఆశ రెచ్చగొడుతుంటే నిగ్రహించుకోలేదు, అటు అక్క మనసు నొప్పించలేడు. వాసు పసిహృదయానికి యిది విషమపరీక్షలా తయారయింది. కాని యెప్పుడూ విజయం మాధవ్‌కే లభిస్తోంది.

'మా అక్క మొదట్లో యిలా వుండేదికాదు. అది అలా కఠినంగా మారిపోవటానికి కారణం వుంది అది తెలుసుకుంటే మీరు నా కంటే ఎక్కువ జాలిపడతారు'

'ఏమిటది??—' ఆదుర్దాని అణచుకుంటూ మామూలుగా అడిగాడు.

వాసు సందేహించాడు. చెప్పవచ్చో, చెప్పకూడదో! అతని మనసులో మాధవ్ అంటే ఏర్పడిన గౌరవాభిమానాలు చెప్పవచ్చని హామీ యిస్తున్నాయి.

'చెప్పు వాసూ! యేమిటది? నువ్వేది చెప్పినా అది మనిద్దరిమధ్యే వుంటుంది. అది తెలుసుకో!'

వాసుకి ధైర్యం వచ్చింది.

'మా అక్క చదువుకునేటప్పుడు-ఒకటి-ఒకటి-జరిగింది.' వాసు ఆగిపోయాడు. ముఖం యెర్రబడింది.

'ఊఁ! చెప్పు ఏం జరిగింది?' కుతూహలంగా అడిగాడు.

'ఓసారి—ఓసారి—'

'ఓసారి?—' మాధవ్ యింకో సిగరెట్టు తీసుకుని వెలిగించుకున్నాడు.

'ఆ రోజు—ఆ రోజు నాకు యిప్పటికీ బాగా గుర్తుంది. అక్క ఆ రాత్రి అయా గుండెల్లో తలదాచుకుని వెక్కి వెక్కి యేడుస్తోంది. ఆయా

ఎంత ఓదార్చినా వినటంలేదు. సంగతేమిటో నాకు తెలియదు. అక్క, నేను ఆయా ఒక గదిలోనే పడుకునే వాళ్ళం. నేను మేలుకునే ఉన్నాననివాళ్ళకి తెలియదు. నేను అంతా శ్రద్ధగా వింటున్నాను.'

'ఇంతకీ అసలు సంగతేమిటి?—' అసహనంగా అడిగాడు మాధవ్.

'మా అక్కకి యేమయిందో తెలియదు. వారం రోజులనుంచి కాలేజీకి వెళ్ళటం మానేసింది 'నాన్నగారికి తెలిసేకంటే నేను చావటం నయం.' ఏడుస్తూ మాటిమాటికీ యిదే అంటోంది. ఆయా అలా తెలిసే అవకాశం రాదని, ఏదయినా ప్రయత్నం చేస్తే అంతా సవ్యంగా జరిగిపోతుందని, దిగులుపడొద్దని పదేపదే నొక్కి చెపుతోంది. ఇంతలో నాన్నగారు గదిలోకి వచ్చారు. అక్కా ఆయా మాట్లాడటం మానేశారు. బోర్లా పడుకునివున్న నేను ఒక కన్ను తెరిచి దొంగతనంగా చూశాను. ఆయన పట్టరానికోపంతో మండిపడుతున్నట్టున్నారు.

ఆయన వెనక దాదాకూడా వున్నాడు. దాదా వూరికే చేతులునలుపుకుంటున్నాడు.

'ఊఁ అయితే?—' మాధవ్ ఆసక్తితో వినసాగాడు.

'నాన్నగారేమో 'సంధ్యా! డాక్టర్ చెప్పింది నిజమేనా?' అని వురిమినట్టు అడిగాడు. అక్క మాట్లాడలేదు. నిలబడి తలవంచుకుని కాలి బొటనవ్రేలు క్రింద వ్రాస్తూ వూరుకుంది.

'సరే! జరిగిందేదో జరిగింది. అసలు ఆడపిల్లలకి యిలాటి స్వేచ్ఛ యివ్వటం నాదే బుద్ధితక్కువతనం. అతనెవరో చెప్పు. పెళ్ళికి ఏర్పాటు చేస్తాను. ఇదంతా బైటకిరాకముందే జాగ్రత్తపడటం మంచిది' అన్నారు. అక్క అప్పటికీ మాట్లాడలేదు. 'ఎవరు చెప్పు? గోపాలమేనా?' అన్నారు. అక్క కాదన్నట్లు తలూపింది. 'కాదూ? అయితే యింకెవరు మరి?' అక్క మళ్ళీ మాట్లాడలేదు. గదిలో భయంకరమయిన నిశ్శబ్దం ఏర్పడింది. 'అనవసరంగా నన్ను రెచ్చగొట్టకు. ఊ! చెప్పు. నా కోపం సంగతి తెలుసా?' అన్నారు.

'అతనెవరో నాకు తెలియదు.' అక్క చెప్పలేక చెప్పింది.

'తెలియదూ?' రెట్టించారు.

'తెలియదు. నిజంగా, మొన్న, మొన్న-విజయ పెళ్ళికి వెళ్లేటప్పుడు

రైల్లో నేనే తలుపులవీ వేసుకుని జాగ్రత్తగానే కూర్చున్నాను. కానీ ఒక తను యెలా వచ్చాడో మరి? అతను-అతను-' అంటూ అక్క ఏడవడం మొదలు పెట్టింది.

మాధవ్ తృళ్ళిపడ్డాడు. చేతిలో సిగరెట్టు జారిపోయింది నిటారుగా నిలబడి వినసాగాడు.

'ఫస్టుక్లాస్‌లో అలా ప్రయాణం చేయటం మాకు అలవాటే. మా దాదా మూడోతరగతిలో కూర్చున్నాడుట అక్క మాటలనిబట్టి నాకు అర్థం అయింది ఏమిటంటే—ఒక రాస్కెల్—ఆ స్కౌండ్రల్—మా అక్కని-' వాసు యెర్రబడిన ముఖంతో ఆగిపోయాడు.

'తెలిసిందిలే! తర్వాత.' రోషంతో కోపంతో జేవురించిన వాసు ముఖం చూసి యెలాగో అయిపోతూ అడిగాడు.

'కానీ, మా అక్క యెంత చెప్పినా నాన్నగారు నమ్మలేదు. హద్దు మీరి తిరిగిందికాక అబద్ధాలతో నన్ను కూడా మోసంచేయాలని చూస్తున్నావా, అని చేయెత్తి అక్కని కొట్టబోయారు. ఇంతలో దాదా అడ్డుపడి అదంతా నిజమేనని చెప్పాడు. నాన్నగారు దాదాని కూడా తిట్టారు. కొట్టబోయారు. ఆ రాత్రి యింట్లో యెంత గొడవయిందో చెప్పలేను.'

వాసు వూపిరి పీల్చుకోటానికి ఆగాడు. మాధవ్ వూపిరి పీల్చడం మర్చిపోయి వినసాగాడు.

'తర్వాత ఇంట్లో వాతావరణమే మారిపోయింది. నాన్నగారు ప్రతి చిన్న విషయానికి అందరిమీదా చిరాకుపడి కొట్టినంతపని చేసేవారు. అక్కకి గోపాలం అనే ఓ ఫ్రెండ్ ఉండేవాడు. అతను పద్యాలవీ వ్రాసే వాడు. అతనంటే నాన్నగారికి యెందుకో అసలే యిష్టం వుండేదికాదు. అప్పుడప్పుడు అక్కని అతనితో యెక్కువ మాట్లాడవద్దని కేకలు వేస్తే వారుకూడా. అలాటిది ఓ రోజున అతన్ని పిలిపించారు. అప్పుడు నేను నాన్నగారిదగ్గరే కూర్చుని ఆడుకుంటున్నాను. ఆయన గోపాలాన్ని చూడ్డ గానే మర్యాదగా ఆహ్వానించి కూర్చోమని కుర్చీ చూపారు. మొదట ఒకటి రెండు సంగతులు కాలేజీ గురించి అడిగారు. నాన్నగారు యెంత నిదానంగా, మంచిగా మాట్లాడుతున్నా గోపాలం పిల్లిలా ముడుచుకుపోయి సమాధానాలు యిస్తున్నాడు. తర్వాత నాన్నగారు నన్ను దగ్గరకు తీసుకుని ఒళ్ళో

కూర్చో పెట్టుకుంటూ గోపాలంతో 'సంధ్య నిన్ను తప్ప యెవర్నీ పెళ్ళి చేసుకోను అని పట్టుపడుతోంది. నీ అభిప్రాయం ఏమిటి? నీ కిష్టమేనా?' అన్నారు.

గోపాలం తెల్లబోయి చూడసాగాడు. నాన్నగారు అదేం గమనించ నట్టు నా జుట్టు సవరిస్తూ 'నా ఆరోగ్యం అంతగా బాగుండటంలేదు. సాధ్య మయినంత త్వరలో సంధ్య పెళ్ళి చేసెయ్యాలనుకున్నాను. మీ యిద్దరికీ యిష్టమయితే లగ్నాలు పెట్టిస్తాను' అన్నారు. గోపాలం ముఖం విక సించింది. అంతక్రితం వరకూ వున్న భయంకూడా పోయింది. కుర్చీలో నిటారుగా ఠీవిగా కూర్చున్నాడు. సంధ్య అంటే తనకి ప్రాణం అని ఏదేదో పద్యాలు వ్రాసే భాషలో మాట్లాడాడు.

గోపాలంతో అక్క పెళ్ళి జరుగుతుంది. అక్కకికూడా గోపాలం అంటే యిష్టమేగా! అందుకే నేను వెంటనే యీ వార్త చెప్పాలని ఆపుకో లేని సంతోషంతో లోపలికి పరుగెత్తాను. గదిలో అక్క ఆయా కూర్చుని వున్నారు. నేను వెళ్ళి చప్పట్లు చరుస్తూ 'అక్క పెళ్ళి, పెళ్ళి' అన్నాను, సంతోషంతో. సంధ్య చివ్వున నా వైపు తిరిగి 'ఏమిటి వాసూ!' అంది. గోపాలం వచ్చాడని, నాన్నగారితో మాట్లాడుతున్నాడని, అక్క పెళ్ళి అవుతుందని చెప్పాను. ఆయా అక్కా ముఖాలు చూసుకున్నారు. ఇంతలో నాన్నగారు గదిలోకి వచ్చి ఆయాతో అక్క పెళ్ళి గోపాలంతో స్థిరపరు స్తున్నానని, పురోహితుడికి కబురు చేశానని చెప్పారు. అక్కా ఆయా ఇద్ద రిలో యెవరూ మాట్లాడలేదు. నాన్నగారు మర్నాటి నుంచి సంధ్యని మామూలుగా కాలేజీకి వెళ్ళమని ఆజ్ఞాపించి గదిలోంచి వెళ్ళారు. 'చూశావా? నా మాట నువ్వు నమ్మలేదు' అన్నట్టు నేను అక్కవైపు ధీమాగా చూశాను. కాని అక్క అప్పటికే ఆయా గుండెల్లో ముఖం దాచుకుని వెక్కి వెక్కి యేడుస్తూ 'ఈ పెళ్ళి జరగటానికి వీల్లేదు. వీల్లేదని చెప్పు ఆయా' అంది. ఆయా 'వూరుకో—వూరుకో' అని సముదాయించింది. కారణం నాకు తెలి యదు. కాని ఆ రాత్రంతా అక్క యేడుస్తూనే వుంది. ఆయా ధైర్యం చెబుతూనే వుంది.

లగ్నాలు పెట్టించేశారు. పెళ్ళి వారం రోజుల్లోకి వచ్చింది. ఏర్పాటు లన్నీ ఆర్భాటంగానూ మా అంతస్తుకి తగిన ఫాయాలోనూ జరుగుతున్నాయి.

అక్క కాలేజీకి వెడుతోంది. కాని మనిషి మునుపటిలా లేదు. నీరసంగా, విసుగ్గా యెలాగో ఉండేది. ఏదయినా మా అక్క పెళ్ళి అవుతోంది. నాకు బోలెడంత సందడి. నా ఆనందానికి హద్దుల్లేవు. ఆ రోజు స్కూల్లో నా క్లాసుమేటు రమణని 'మా అక్క పెళ్ళికి నువ్వుకూడా రెండు రోజులు శెలవు పెట్టు. ఇద్దరం సరదాగా తిరుగుదాం' అన్నాను. అప్పటి వరకూ మేమిద్దరం స్నేహితులంగానే ఉండేవాళ్ళం. వాడు ముఖం అంతా మాడ్చుకుని 'నేను రాను, రాను' అన్నాడు. 'ఎందుకని?' అన్నాను. 'నేనే కాదు మా యింట్లో యెవరూ మీ అక్క పెళ్ళికి రారు. మా అక్కకూడా రాదు. అసలు మీ సంధ్యతో మాట్లాడవద్దని మా యింట్లో మా అక్కని కేకలేశారు' అన్నాడు.

'ఎందుకని?'

'మీ అక్క మంచిది కాదు.'

'ఏయ్? రమణా!'

'అవును. నిజంగా మీ అక్క మంచిది కాదు. పెళ్ళి కాకుండానే మీ అక్కకి పాపాయి పుడుతున్నాడు. చెడ్డవాళ్ళకే అలా పుడతారు.'

పెళ్ళి కాకుండానే పాపాయి పుట్టవచ్చో, లేదో అప్పుడు నాకు తెలియదు. కాని మా అక్క మంచిది కాదు, చెడ్డది అనివాడు అనటం నేను భరించలేకపోయాను. మరుక్షణమే మీదపడికొట్టాను. ఇద్దరం బాగా కలబడ్డాం. వాడికి కంటిమీద దెబ్బ తగిలింది. నా ముక్కులోనుంచి రక్తం రావడం ప్రారంభించింది. మా హెడ్మాస్టరుగారు మా యిద్దర్నీ విడదీశారు. నన్ను యింటికి పంపించేశారు పంపించేటప్పుడు నాన్నగారికి నా ప్రవర్తన బాగాలేదని, యిలా దురుసుగా యింకోసారి ప్రవర్తిస్తే స్కూల్లో నుంచి పేరు తీసెయ్యాల్సి వస్తుందని వుత్తరం వ్రాసి పంపాడు.

నాన్నగారు అది చూసి ఎన్నడూ లేనిది నన్ను పట్టుకొని కొట్టారు. దాదా అడ్డుపడి తీసుకెళ్ళి ఆయాకి ఒప్పచెప్పాడు. నాన్నగారు వెనుక నుంచి 'వెధవకి రాత్రి అన్నం పెట్టకండి. గాడిదని రేపటి నుంచి స్కూలు మాని యింట్లో కూర్చోమనండి' అన్నారు. ఎప్పుడూ లేంది నాన్నగారు నా మీద మండిపడటం చూసి నాకు నిజంగా పట్టలేనంత ఏడుపు వచ్చింది. గదిలోకి రాగానే సంధ్య నన్ను దగ్గరకు లాక్కొని 'అసలు విషయం ఏమి

టని' అడిగింది. నేను ఏడుస్తూనే విషయం చెప్పాను. నేను రమణను ఎందుకు కొట్టానో తెలుసుకున్న అక్కా, ఆయా ముఖాలు చూసుకున్నారు. అక్క వెంటనే నన్ను దగ్గరికి లాక్కుని 'వాసూ!' అంటూ ఏడ్చింది.

పెళ్ళి నాలుగు రోజుల్లోకి వచ్చింది. కాని యింట్లో యెవరికి సంతోషమే లేదు. ఎవరిని చూసినా ఏదో ముంచుకుపోయినట్లు ఉండేవాళ్ళు. చివరికి ఆ రోజు గోపాలానికి అక్క సంగతి ఏదో తెలిసిపోయిందట. 'ఈ పెళ్ళి చేసుకోను-మీరు నన్ను మోసం చేశారు'—అని పేచీ పెట్టాడు. నాన్నగారు అక్కని పిలిచి గోపాలాన్ని ఒంటరిగా కలుసుకుని ఇదంతా అబద్ధం అని బుకాయించమని, మంచిమాటల్తో లొంగతీసుకోమని చెప్పారు. అక్క గోపాలాన్ని కలుసుకుంది. కాని నాన్నగారు చెప్పినట్లు చేయలేదు. నిజం ఒప్పుకుని అందులో తన తప్పేం లేదని, అర్థం చేసుకుని వివాహం చేసుకుంటే ఆజన్మాంతరం అతనికి కృతజ్ఞురాలిగా వుంటానని, యీ అవమానంనుంచి రక్షించి పుణ్యం కట్టుకోమని చెప్పిందట! గోపాలం అప్పటికి సరేనని తలూపి సరాసరి నాన్నగారి దగ్గరికి వచ్చి అక్క యేం చెప్పిందీ, ఏమి అడిగింది-అంతా బయటపెట్టి ఈ పెళ్ళి చేసుకోను అని ఖచ్చితంగా తిరస్కరించి వెళ్ళిపోయాడు. నాన్నగారు ఇది విని మండిపోయారు. ఆగ్రహం పట్టలేక అక్కడే హాల్లో వున్న హంటర్ తీసుకుని అక్క గదిలోకి పెద్దపెద్ద అంగలేసుకుంటూ వెళ్ళారు. నేను కూడా ఒణికిపోతూ నాన్న వెనకే పరుగెత్తాను. అక్క గదిలో కిటికీ దగ్గర నిలబడి బైటకి చూస్తోంది.

'సంధ్యా! గోపాలంతో నువ్వేం చెప్పావు?' అన్నారు.

ఉలిక్కిపడి వెనక్కుతిరిగి అక్క నాన్నగారిని చూస్తూ నిలబడి పోయింది.

'చెప్పు, నేను చేయమన్నది యేమిటి? నువ్వు చేసింది యేమిటి?' దగ్గరగా వెడుతూ అన్నారు.

'నాన్నగారు-నన్ను నన్ను-క్షమించండి—' సంధ్య వాక్యం పూర్తి కాకముందే కెవ్వుమంది. నాన్నగారి చేతిలో హంటర్ సంధ్య వొంటిమీద ఛెళ్‌మంది. నేను కళ్ళు గట్టిగా మూసుకున్నాను.

'నిన్ను-నిన్ను క్షమించాలా! నా పరువు ప్రతిష్ఠ గంగలో కలిపినందుకా?'

మాటల్తోపాటు వెంట వెంట దెబ్బలుకూడా సంధ్య వీపుమీదపడ్డాయి. అక్కడ నిలబడలేక ప్రక్కగావున్న మంచంమీద కూలబడి వెంటనే బోర్లా పడిపోయింది.

నేను బిగ్గరగా నన్ను కొట్టినట్టే యేడవటం ప్రారంభించాను. ఆయా, దాదా పరుగెత్తుకొచ్చారు. ఆయా నన్ను తీసుకుంది. దాదా నాన్నగారిని తోసేసి లోపలికి అక్కదగ్గరికి పరుగెత్తాడు. నేను ఆయాని కరుచుకు పోయాను. నాన్నగారు యింకా సంధ్యని ఏవేవో అంటూ కొడుతూనే వున్నారు. దాదా అడ్డువచ్చాడు. నాన్నగారు ఆ కోపంలో దాదాని కూడా కొట్టారు. దాదా ఏడుస్తూ 'కొట్టండి సార్! కొట్టండి, మీ కసితీరా కొట్టండి. కాని అమ్మాయిని మాత్రం—'

ఆయా నన్ను వదిలించుకుని లోపలికి వెళ్ళి, నాన్నగారి చెయ్యి గట్టిగా పట్టుకుని 'సంధ్య మీ కూతురుకాదు. ఇకనుంచి మా కూతురు. అమ్మాయి ఒంటిమీద మరోదెబ్బ పడితే నేనుకూడా వూరుకోను. మీ కిష్టం లేకపోతే సంధ్యని తీసుకుని మేం మా వూరు వెళ్ళిపోతాం' అంది బిగ్గరగా. నాన్నగారేమో హంటర్ విరిచి అక్కడ పారేసి వెళ్ళిపోయారు.

ఆయా అక్క దగ్గరకెళ్ళి పక్కన కూర్చుని 'సంధ్యా! నా తల్లీ-' అని పిలుస్తూ ఒళ్ళోకి తీసుకుంది. సంధ్య నోట్లోంచి, ముక్కులోంచి రక్తం కారుతోంది. స్పృహ కూడా వున్నట్టులేదు. దాదా పరుగెత్తుకెళ్ళి నీళ్ళనీ తెచ్చాడు. ఆయా గుడ్డ నీళ్ళతో తడిపి రక్తం అదీ తుడిచింది.

'డాక్టర్ని పిలవమంటావా?' అన్నాడు దాదా.

'వద్దు. నువ్వెళ్ళి ఆయనేమయ్యారో చూడు' అంది ఆయా. దాదా గదిలోంచి నాన్నగారిని చూడటానికి వెళ్ళిపోయాడు.

నాన్నగారు ఎక్కడికి వెళ్ళారో తెలియలేదు. ఆ రాత్రి అంతా ఇంటికి రాలేదు. మర్నాడు పగలల్లా రాలేదు. దాదా, ఆయా యిద్దరూ ఖంగారు పడ్డారు. కాని ఆ సాయంత్రానికి యింటికి తిరిగివచ్చారు. మనిషి మామూలుగానే వున్నారు. ఆ లగ్నానికి యెవరైనా తీసుకొచ్చి పెళ్ళి చేయాలని ఆ రోజంతా చూశారు. కానీ సాధ్యం కాలేదు. పెళ్ళి ఆగిపోయింది. విషయం అంతా బయటకి పొక్కిపోయింది. అందరూ మమ్మల్ని వెలివేసినట్టు చూడసాగారు. అక్క పూర్తిగా తన గది వదిలి రావటం మానేసింది. ఒకటి

రెండుసార్లు చచ్చిపోవటానికి ప్రయత్నిస్తే వెంటే నీడలా వున్న ఆయా ముందే కనిపెట్టేసి కేకలేసి తిట్టింది. నాన్నగారు తర్వాత సంధ్యని యేమీ అనలేదు కాని మాట్లాడేవారుకాదు, పిలిచేవారుకాదు. నాన్నగారు తనతో మాట్లాడటం లేదని, పిలవటంలేదని అక్క కుళ్ళి కుళ్ళి యేడ్చేది. రానురాను అక్క ఆరోగ్యం బాగా దెబ్బతింది. అసలు బ్రతకదనే అనుకున్నాం. చివరికి హాసిటల్లో పడిహేను, ఇరవై రోజులుండి వచ్చింది. తర్వాతకూడా ఆయా కంటికి రెప్పలా కాపాడటంవల్ల కాస్త కాస్త కోలుకోసాగింది. ఈ లోగా రజాకార్ మూమెంట్ వచ్చింది. అందులో నాన్నగారు, దాదా చనిపోవటం, ఇదంతా జరిగింది.'

వాసు ఆగి బుగ్గలమీద జారుతున్న కన్నీళ్ళను తుడుచుకున్నాడు. మాధవ్ రెప్పవాల్చకుండా వాసు వైపు చూస్తున్నాడు. దృష్టి అక్కడున్నా అతని మనసు అక్కడలేదు. చెవులు ఆలకిస్తున్నా అర్థం గ్రహించడం మానేశాయి. బ్రమ్మపడిపోయి నిలబడ్డాడు కాని మాధవ్‌లో ఈ మార్పేమీ గ్రహించని వాసు యింకా చెబుతూనే వున్నాడు.

'తర్వాత—మా పరిస్థితులు ఒక్కసారిగా తారుమారయినాయి. నాన్నగారు వున్నప్పుడు మేము బాగా స్థితిమంతుల్లా బ్రతికాం. కాని ఆయన పోయిన తర్వాత కొంత గవర్నమెంట్ లాగేసుకుంది. మిగతాది అప్పుల వాళ్ళు చుట్టేసి లాక్కుపోయారు. మా కన్ని అప్పులున్నాయని మా కంత వరకూ తెలియదు. ఆయన పోయారు. మీ అప్పులతో మాకు సంబంధం లేదని-ఆయా అక్కని దబాయించమని చెప్పింది. కాని అక్క వినకుండా అన్నీ తీర్చేసింది. అక్క వంటిమీద కాస్తోకూస్తో మిగిలిన బంగారం మా తిండికీ, నా మందు ఖర్చుకి సరిపోయింది. తర్వాత ఉద్యోగ ప్రయత్నం చేసింది. ఒక్క ఆఫీసులో కూడా ఈ సంగతి యెలా తెలిసిందో వాళ్ళు నీచంగా ప్రవర్తించేవాళ్ళు. పౌరుషంగా మాట్లాడేవాళ్ళు. తేలికగా చూచేవాళ్ళు. అక్క ఇది భరించలేకపోయినా ఎలాగో దిగమ్రింగుకుని వెళ్ళేది. చివరికి ఓసారి ఆఫీసులో అక్కతోపాటు పనిచేసే అతను తనని పెళ్ళిచేసుకోమని, లేకపోతే ఇదంతా బయటపెట్టి ఉద్యోగం పోయేలా చేస్తానని బెదిరిస్తూ ఉత్తరం వ్రాశాడు. అక్క మర్నాడు ఉదయం వెళ్ళి తనే రిజైన్‌చేసి వచ్చేసింది. ఇంకోసారి ప్రయివేటు కంపెనీలో అక్కచేరి రెండు నెలలన్నా

కాకముందే కంపెనీ మానేజరు ఫైల్స్ తీసుకుని అక్కని గదిలోకి రమ్మని అసహ్యంగా ప్రవర్తించాట్ట! అప్పటికెలాగో తప్పించుకుని బయటపడి ఇంటికి పారిపోయివచ్చి అక్క యేడుస్తూ కూర్చుంది. ఆయా బుజ్జగించి సంగతేమిటని అడిగితే జరిగిందంతా చెప్పింది. ఇలాటి సంఘటన జరిగి నప్పుడల్లా అక్క యెలాగో అయిపోయేది. మళ్ళీ మామూలు మనిషిగా కావటానికి కనీసం వారం, పదిరోజులయినా పట్టేది. ఈసారి ఆయా అక్కకు యిక ఉద్యోగం చేయనవసరంలేదని గట్టిగా చెప్పింది. మేం పుట్టిపెరిగింది హైద్రాబాదే. అప్పుడప్పుడు నాన్నగారితో వెళ్ళి బొంబాయి, మద్రాసు నాలుగు రోజులు చూసి రావడంతప్ప మాకే వూరూ తెలియదు. మాకు బంధువులుకూడా లేరు. నాన్నగారు నిజాం ప్రభుత్వం తరఫున పని చేశా రట. తర్వాత తర్వాత మమ్మల్ని అందరూ అదోలా చూసేవారు. ఆయన వున్నప్పుడు కాస్త స్నేహంగా ఉండే కుటుంబాలు కూడా తర్వాత ఆయన పోగానే వేలెత్తి చూపెంచి వెక్కిరించేవారు. చివరికి యెటూ తోచక ఆయా బలవంతంమీద ఈ వూరు వచ్చిపడ్డాం. ఈ కూరగాయల వ్యాపారం గురించి ఆలోచన ఆయాదే

ఈ వూళ్ళో జోగులు కుటుంబం ఆయాకి దూరపు బంధువు లవు తారు. మా పరిస్థితులు సరిగ్గా వున్నప్పుడు మా దాదా వాళ్ళకి యేదో సాయం చేశాడట. ఉది మనసులో వుంచుకుని వాళ్ళు ఆయా అడిగిన వెం టనే వాళ్ళకి వీలయినంతగా మాకు సాయపడటానికి ఒప్పుకున్నాడు. మొదట మొదట్లో మమ్మల్ని విచిత్రంగా ఆసక్తిగా చూసేవాళ్ళు. ఆయా వాళ్ళని మంచి మాటలతో, చిన్న చిన్న సలహాలతో బాగా కలుపుకుంది. అక్క అంటే వాళ్ళకి యెలాంటి అభిప్రాయం ఉందో తెలియదుగాని, గౌర వాభిమానాలు మాత్రం బాగానే వున్నాయి. వాళ్ళకి అవసరమయిన ఉత్త రాలను వ్రాసిపెట్టడం సాలెవాళ్ళకి చీరెల రంగుల్లో, డిజైన్లలో సలహాలు యివ్వటం, చేయటం మొదలు పెట్టిన అక్క క్రమేపీ వాళ్ళతో కలిసి పోయింది. మమ్మల్ని కూడా ఇప్పుడు వాళ్ళలో ఒకళ్ళుగా ఆదరిస్తున్నారు. మంచి చదువు సంధ్యలు వచ్చునని మేమంటే గౌరవంతో కూడిన భయం కూడా కాస్త ఉంది.'

వాసు చివరి చివరి మాటలు మాధవ్ చెవులకు యెక్కనేలేదు.

అతను హఠాత్తుగా, సిగ్గుతో, అవమానంతో, యేం చెయ్యలేని అశక్తతతో అగాధాల్లోకి జారిపోసాగాడు. భగవాన్! అనుకోకుండా ఒక్క క్షణం తను పశువులా మారి బలహీనతకి బానిస అయితే దాని పరిణామం సంధ్య జీవితం మీద ఇంత భయంకరంగానా? ఇంతవరకూ కేవలం ఆర్థికస్థితి చితికిపోయిందని, ఒకవేళ పెళ్ళి చేసుకున్నా ఆ రాబోయే అతను అవిటివాడయిన వాసుని ఆపేక్షగా చూస్తాడా, తనని చూడనిస్తాడా అనే భయంతో విరక్తి కల్పించుకుని, సంధ్య ఈ మారుమూల గడుపుతోంది అనుకుంటున్నాడే కాని, దీనివెనక యింత భయంకరమయిన గాథ ఉందని, దానికి మూలం తానని ఒక్కసారి కూడా ఆలోచించలేకపోయాడు. సంధ్యకి తన మీద ద్వేషం వుంటే ఉండదూ! మాధవ్‌కి ఆ సమయంలో రెక్కలు కట్టుకుని యెగిరివెళ్ళి సంధ్య ముందు మోకాళ్ళమీద కూలబడి 'సంధ్యా! నన్ను క్షమించు. ఈ పాపం అంతా నాది! ఈ దోషం నాది సంధ్యా!' అని వేడుకోవాలనిపించింది.

'అక్క అప్పటి నుంచి పూర్తిగా మారిపోయింది. అప్పుడప్పుడు నన్ను దగ్గరకు లాక్కుని 'కేవలం నీ కోసం బ్రతుకుతున్నాను వాసూ! అది కూడ నువ్వు మామూలు మనిషివి కాదుగాబట్టి' అంటూ యేడుస్తుంది. నాక్కూడా ఏడుపు వస్తుంది. మీరే చెప్పండి జీవితంలో తన తప్పేమీ లేకుండా అన్యాయంగా యింత క్రూరమయిన శిక్ష అనుభవించిన యే ఆడపిల్ల మనసయినా యింకెలా వుంటుందో! ఇంకా మా సంధ్య చాలా నయం. 'అంతా నా దురదృష్టం' అని ఏడుస్తుంది తప్ప యెవర్నీ పల్లెత్తుమాట అనదు. ఇదంతా మీ కెందుకు చెప్పానంటే-మీరు చాలా మంచివారు. అది గుర్తించకపోవటం అక్క తప్పే. కాని దాని కారణం యిది. అక్క మిమ్మల్ని నిర్లక్ష్యంగా చూస్తోందని బాధపడకండి. చూసి మన్నిస్తారుకదూ!' కళ్ళెత్తి దీనంగా చూస్తూ అడిగాడు వాసు. మాధవ్ చప్పున ముఖం తిప్పేసుకున్నాడు. అతని మనసు వేయి రంపాలతో కోసినట్టుగా వుంది.

'చెప్పండి. అక్కమీద యెప్పుడూ కోపం తెచ్చుకోరు గదూ!' జాలిగా అడిగాడు.

'తెచ్చుకోను వాసూ! తెచ్చుకోను! నువ్వు నా కళ్ళు తెరిపించావు.'

'సంధ్య మీద మీరు చెడ్డ అభిప్రాయం ఏర్పరచుకోవటం నేను భరించలేను.' వాసు కళ్ళలో నీళ్ళు తిరిగాయి.

'లేదు వాసూ! ఇంకెప్పుడు యిక మీదట అలా ఆలోచించను అని చెప్పానుగా. కాని నువ్వు కూడా ఒకటి వాగ్దానం చేయాలి నాకు.'

'ఏమిటది? చెప్పండి.'

'నువ్వు కూడా సంధ్యని బాధపెట్టే పనులు చేయగూడదు. కనీసం మాటలు కూడా అనకూడదు. మనిద్దరం కలిసి సాధ్యమయినంత వరకూ సంధ్యని సంతోషపెట్టే మార్గం ఆలోచిద్దాం.'

వాసు కళ్ళు సంతోషంతో మెరిశాయి.

'ఒట్టు. నే నింకెప్పుడూ అక్కని ఏమీ అనను' అన్నాడు చేయి జాచుతూ.

వాసు ఆదుర్దాగా చూశాడు. మాధవ్ వాసు తలని దగ్గరకుతీసుకుని జుట్టు సరిచేస్తూ 'ఇంకొకటి కూడా నువ్వు మర్చిపోవద్దు ఎలాటి పరిస్థితిలోనూ నా దగ్గర సహాయం తీసుకోవటం మానకూడదు. సాధ్యమయినంత వరకూ సంధ్యకి మెల్లగా మంచి మాటలతో నచ్చచెప్పటానికి ప్రయత్నించు.'

వాసు అలాగే అన్నట్టు చూశాడు.

'నేనీసారి వూరు వెళ్ళినప్పుడు మంచి డాక్టర్ని తీసుకొచ్చి నిన్ను చూపిస్తాను. ఆపరేషన్ వల్ల ఏదయినా నీకు ఉపయోగం ఉంటుంది అంటే యెంత డబ్బయినా సరే నేను యిస్తాను.'

వాసు కృతజ్ఞతని అణచుకోలేక మాధవ్ గుండెల్లో ముఖం దాచుకున్నాడు. అతని కళ్ళ నిండా నీళ్ళు వుబుకుతున్నాయి. మాధవ్ లాటి మానవోత్తములు యెక్కడయినా ఉంటారా అసలు!

'ఈ సంగతులన్నీ మనమధ్యనే ఉండిపోవాలి. ఈ రోజు నుంచి నీకేలోటూ రాకుండా చూసే బాధ్యత నాది. సరేనా?' వాసు తల నిమురుస్తూ అన్నాడు.

పూర్తిగా చీకటి పడిపోయింది. ఆకాశంలో అప్పుడే ఉదయిస్తున్న చంద్రుడు అభాగ్యుడు అందుకోలేని స్వర్గంలా వున్నాడు. ఇంటికి వెళ్ళబోయే ముందు వెళ్ళగానే సంధ్యని పిలిచి క్షమాపణ కోరుకునేట్టు, వుత్తరం

సంగతి యెత్తకుండా వుండడానికి వాసు దగ్గర వాగ్దానం తీసుకున్నాడు.

ఆ రాత్రి ఆతనికి నిద్రపట్టలేదు. అటూ ఇటూ గదిలో తిరుగుతూ గడిపాడు. వాసు నోటినుంచి విన్న విషాదగాథ అతన్ని వెర్రివాడిని చేస్తోంది. బాధతో ముక్కలవుతున్న అతని మనసు శక్తి అంతా కూడ దీసుకుని శూన్యంలోకి చేతులు జాపి 'సంధ్యా! సంధ్యా! నా దగ్గరకు రా! కూలదోసిన నీ జీవిత సౌధాన్ని నన్ను సరిచేయనీ! నాకి అవకాశం కల్పించి నన్ని నరకం నుంచి తప్పించు. నన్ను నీ దగ్గరకు రానీ!' అనిఆక్రోశించ సాగింది. ఎన్ని రోజులు పట్టనీ, ఎన్ని యుగాలు గానీ-సంధ్య జీవితం లోకి ఎలాగయినా ప్రవేశించి మళ్ళీ బ్రతుకు మీద మమకారాన్ని కల్పించాలి. ఇందులో విజయం లభించనీ, లభించకపోనీ కంఠంలో వూపిరి వున్నంతవరకూ ప్రయత్నం చేసి తీరాలి. ఈ ప్రయత్నంలో తన జీవిత కాలం అంతా సరిపోయినా సరే! వృధాగా గడిచిపోయినా సరే! మాధవ్ లెక్కచేయదల్చుకోలేదు తన వ్యక్తిత్వానికి ఇది సవాలుగా తీసుకున్నాడు.

# 21

మాధవ్ యెప్పుడో యధాలాపంగా మాటవరసకి యిచ్చిన ఆహ్వానాన్ని పురస్కరించుకుని ఓ రోజు ఉదయం సుధ, భాస్కరం వూడిపడ్డారు. ఇద్దరు పిల్లల తల్లి అయిన సుధ పచ్చటి రంగుతో మిసమిసలాడుతూ వుంది.

'మా వారు ఓ కేసుని గురించి స్టడీ చేయాలి బావా! అక్కడ వాళ్ళు వీళ్ళు రావడంతో క్షణం తీరిక చిక్కడంలేదు. ఇక్కడయితే ప్రశాంతంగా ఉంటుందని బలవంతంగా నేనే లాక్కొచ్చాను' అంది సుధ.

'పల్లెటూరి ఇల్లు అందే యే గబ్బిలాల కొంపో అనుకున్నాం. ఇల్లు బాగానే ఉందే?' విశాలంగా వున్న గదుల్ని పరిశీలనగా చూస్తూ అన్నాడు భాస్కరం.

మాధవ్ వాళ్ళున్న రెండు రోజులూ వాసు వాళ్ళింటికి వెళ్ళలేదు. బంధువులు వచ్చారనీ, బిజీగా వున్నాననీ ఉత్తరం వ్రాసి నౌకరు చేత

వాసుకి తెలియజేశాడు. అతను అక్కడికి వెడితే ఎవరు ఏమిటి అని ఆరా వస్తుందని అతనికి భయం వేసింది.

మూడోరోజు మధ్యాహ్నం—నిద్రలేవగానే బద్ధకంగా అన్పించి ఆ మత్తు వదలటం కోసం మామిడిచెట్ల మధ్య తిరగటానికి వెళ్ళాడు. మాధవ్ ఆవరణకు, సంధ్యా వాళ్ళింటికి సరిహద్దుగా అడ్డుగా చిక్కగా ముళ్ళకంప వుంది. దాన్ని వత్తుగా అల్లుకున్న అడవి తీగెలున్నాయి. పరధ్యానసగా నడుస్తున్న మాధవ్ మాటలు విన్పించడంతో ఆగిపోయారు. ఇద్దరు మనుష్యులు ఏకాంతంగా మాట్లాడుకుంటున్నారు. అంటే ఏంటరితనం అభిలషిస్తున్నారన్నమాట. దానిని తెలిసి కూడా భంగపరచడం మర్యాదస్థుల లక్షణం కాదు. మాధవ్ వెళ్ళిపోదామని రెండడుగులు వెనక్కు వేశాడు. అయినా యిక్కడ అంత వంటరిగా మాట్లాడుకునేవాళ్ళు యెవరు? సరిగ్గా అతని అనుమానం తీర్చటానికే అన్నట్టు 'నా మాట విను సంధ్యా! నీకీ ఖర్మ ఏమిటి? నాతో వచ్చెయ్. కంటికి రెప్పలా చూసుకుంటాను' అని విన్పించింది. అది భాస్కరం గొంతు. మాధవ్ చటుక్కున ఆగిపోయాడు. భాస్కరానికి సంధ్యకి యెలా పరిచయం? అతను ఊపిరి బిగబట్టి వినసాగాడు.

'ఏమంటావు?' రెట్టించాడు భాస్కరం.

'క్షమించు భాస్కరం! ఇప్పటికి నువ్వు నాలుగోసారి అలా అడగటం-నేనక్కడికి వచ్చి ఏం చెయ్యాలి? యెక్కడుండాలి?'

'అది బొత్తిగా అర్థంలేని ప్రశ్న! నా దగ్గరుందువుగాని. నా ఇంట్లోనే వుంచుకుంటాను!'

'భాస్కర్!'

'నా భార్య ఏమయినా అనుకుంటుందనేగా నీ భయం. అవన్నీ వదిలెయ్... పెళ్ళి చేసుకుని ఇద్దరు పిల్లలు పుట్టినంత మాత్రాన నేను సుఖంగా వున్నాననుకోకు. సుధ వచ్చినతర్వాత నాకు బాగా కలిసి వచ్చిన మాట నిజమే! కానీ సుధని నేనెప్పుడూ ప్రేమించలేదు. కాలేజీలో చదువుకునే రోజుల్లో నిన్ను యెలా ఆరాధించేవాడినో ఇప్పుడు కూడా అలాగే ఆరాధిస్తున్నాను.'

'ఆ మాట అనేందుకు నీవు సిగ్గు పడాలి.'

'సిగ్గెందుకు? యథార్థం చెప్పినందుకా! అయినా సుధకి నేనేం లోటు చేయటంలేదే! భర్తగా ఇవ్వవలసినవన్నీ ఇస్తూనే వున్నాను.'

'అన్నీ అంటే?—'

'అంటే ఏముంది? డబ్బు, హోదా, సుఖపడటానికి అన్ని విధాల వసతులు, సంఘంతో పేరు ప్రతిష్ఠలు—'

'అంతకంటే ఆడదానికి ఇంకేమీ అవసరం లేదని నీ ఉద్దేశ్యమా?'

'ఉన్నాయి. కాదనను. కాని ఆడవాళ్ళలో కూడా రకాలున్నాయి. సుధ వాటితో తృప్తిపడే మనిషి.'

క్షణంసేపు నిశ్శబ్దం!

'నే వెళతాను. ఎవరయినా చూస్తే బాగుండదు.'

'ఇక్కడెవరు చూస్తారులే! మా ఆవిడ వాళ్ళ బావతో సరసాలు ఆడుతూ వుండి వుంటుంది ఆయనగారిని చూస్తే యీవిడగారికి ఒళ్ళు తెలియదు. నిజం చెప్పాలంటే నీ దగ్గర దాపరికం ఏమిటి కాని, మా ఆవిడకి అసలు నా మీద ప్రేమలేదు. బావా మరదళ్ళిద్దరూ చిన్నప్పుడే పెళ్ళి చేసుకోవాలనుకున్నారట! ఈయనగారు జైలుకి వెళ్ళి కూర్చోవటంతో సుధ గాలివాటుగా నాదగ్గరికి కొట్టుకువచ్చింది.'

'జైలుకా?'

'అవును. అతను చాలా గ్రంధసాంగుడు. నీకు తెలియదేమో!'

మాధవ్ పళ్ళు పటపట లాడినాయి. గుప్పెట్లు బిగించి బలవంతంగా ఉద్రేకం ఆపేసుకున్నాడు. రాస్కెల్! ఈ పాటున వెళ్ళి పళ్ళు రాలగొడితే!

'నేను వెడతాను భాస్కర్!'

'నామాట విను. కాస్త ఆలోచించి చూడు.'

'చాలా బాగా ఆలోచించుకున్నాను. ఈ పల్లెటూళ్లో ఈ మారుమూల నాకు ప్రశాంతంగా వుంది. పెళ్ళి చేసుకోవాలి అనే కోర్కెలేదు. నాకు పది మందిలో తిరగాలన్న ఉబలాటం అంతకంటే లేదు. ఈ మాత్రంగా యింకే ఒడిదుడుకులు లేకుండా నా జీవితం వెళ్ళిపోతే చాలు.'

'నువ్వు కావాలని యింత వైరాగ్యం తెచ్చిపెట్టుకోవల్సిన ఖర్మ యేమిటో నాకర్థంగాదు.'

'జీవితంలో ఇంకోసారి దెబ్బతింటే తట్టుకోలేనేమోననే భయంవల్ల.'

'బాగుంది. మనిషి అన్న తర్వాత కష్టసుఖాలనేవి అనేకరూపాల్లో వస్తుంటాయి.'

'నాకు వచ్చినటువంటి కష్టం ప్రపంచంలో యెప్పుడూ ఏఆడపిల్లకీ వద్దు.' సంధ్య కంఠం వణికింది.

'ఎక్కడో పిచ్చిదానిలా ఉన్నావే! ఇప్పుడు బ్రతుకుతున్న వాళ్ళంతా హాయిగానే వున్నారంటావా? ఏదయినా ఒడిదుడుకులుపస్తే ధైర్యంగా దాటాలి కానీ-'

'ఆ రెండూ నాకు లేవు.'

'జీవితాన్ని అసహ్యించుకుంటూ బ్రతకటంవల్ల ప్రయోజనం?'

'అదే నాకూ తెలియదు. ఒక్కోసారి ఆలోచిస్తే నేనెందుకు బ్రతుకుతున్నానో నాకే తెలియదు. వాసు లేకపోతే—వాడికి నా అవసరమే లేకపోతే—'

'వాడొకడు మధ్య మెడకి గుదిబండ నీకు.'

'పొరబడుతున్నావు. ఈ ప్రపంచంలో నాకున్న ఒకే ఒక బంధం వాసు.'

'ఏమిటో! నీమాటల ధోరణే మారిపోయింది. చురుగ్గా తిరిగే ఆ మెరుపుతీగె సంధ్యేనా అనిపిస్తుంది.'

'ఇప్పటికయినా అది అర్థం చేసుకుంటే సంతోషిస్తాను. వస్తాను భాస్కరం.'

'సాయంత్రం అలా యింటికేసి రావా!'

'రాను.'

క్షణంసేపు నిశ్శబ్దం. మళ్ళీ సంధ్య గొంతుక వినిపించింది. 'భాస్కర్ ఒక్కటి మాత్రం నిన్ను వేడుకుంటున్నాను. మనపరిచయాన్ని గురించి దయవుంచి ఇక్కడెక్కడా బయట పెట్టవద్దు.'

'ఏం? అభిమానం కలవారెవరయినా ఈర్ష్యపడి దూరం అవుతారని భయమా?'

'సరే! నీ యిష్టం.' సంధ్య వెళ్ళిపోయినట్టు యెండుటాకు గలగల విన్పించింది.

# 22

తనంటే యెంత అసహ్యం వున్నా వాసు కోసం సంధ్య రాజీపడక పోదని మాధవ్‌కి తోచింది. సంధ్యలో పేరుకున్న యీ కాఠిన్యాన్ని సడలించాలంటే వాసు ఒక్కడే ఆధారం. అందుకే మాధవ్ ఆ ఆధారాన్ని గట్టిగా పట్టుకున్నాడు. అతని పట్టుదల మహాచెడ్డది. ఏదయినా అనుకుంటే సాధించి పొందేవరకూ నిద్రపోడు. ఆశించింది లభించటం ఆలస్యం అయితే నిరాశతో కాళ్ళు బారచాచి ఆ ప్రయత్నం నుంచి విరమించుకునే మనిషికాదు అతను. నూటికి నూరుపాళ్ళు దృఢమయిన నమ్మకంతో చివరి వరకూ ప్రయత్నం చేస్తూనే వుంటాడు. అందులో అలసటకాని విసుగుకాని వుండదు. విరామం అసలే వుండదు. తెలిసో తెలియకో తన మూలంగా సంధ్యకి తీవ్రమయిన అన్యాయం జరిగింది. దాన్ని సరిదిద్దవలసిన బాధ్యత తనది అనుకున్నాడు. పరిస్థితులు వక్రించి వాడిపోయి నేలరాలి యెండిపోవటానికి సిద్ధంగా వున్న సంధ్య జీవనలతని సరిచేసి ఆధారం అందిచ్చి నీళ్ళు పోసి మళ్ళీ అది కలకలలాడుతూ చిగురు తొడిగి పూలుపూసేలా చేయడం తన ధర్మం అని నమ్మాడు. దానికోసమే తీవ్రంగా ప్రయత్నం చేయ సాగాడు. సంధ్యకి ఆనందం కలగాలంటే యే విషయం చేపట్టాలో సూక్ష్మ గ్రాహి అయిన అతని మనసు యిట్టే గ్రహించింది. యేనాటికయినా వాసు ద్వారానే తను సంధ్యను గెలుచుకోగలగాలి.

వారం పదిరోజులు తిరగకముందే హైద్రాబాదులో తనకు తెలిసిన వాళ్ళ ద్వారా ప్రయత్నించి స్పెషలిస్టుని తీసుకువచ్చి చూపించాడు. ఆయన వాసుని పరీక్షచేసి ఆపరేషన్ చేస్తే అతనికాలు సరి అవచ్చునని, కానీ ఆరు యేడు వారాలు పూర్తిగా హాస్పిటల్లోనే చికిత్సకోసం వుంచాలని చెప్పాడు. సంధ్య, ఆయా ముఖాలు చూసుకున్నారు.

వాసు ఆపరేషన్ గురించి ఒక నిశ్చయానికి రావటానికి దాదాపు నెలరోజులపాటు తర్జనభర్జనలు జరిగాయి. ఆపరేషన్‌కి కావల్సిన ఖర్చు

అంతా ప్రస్తుతం తను భరిస్తానని, తర్వాత వీలువెంబడి తనకి తీర్చమని మాధవ్ సూచించాడు.

'అక్కా! నీ యిష్టం! నువ్వు కాదంటే నేనేమీ అనుకోను!' అన్నాడు వాసు దిగులుగా. ఆయా కూడా వాసు పక్షం వహించి వాదించటంతో చివరికి సంధ్యకి బలవంతాన 'ఊఁ!' అని అంగీకారం తెలపటంకంటే మరో గత్యంతరం లేకపోయింది.

ఆ రోజే వాసు వెళ్ళేది. మాధవ్ తనే స్వయంగా కారులో తీసుకు వెడుతున్నాడు. వెనక సీటులో వాసు కోసం మెత్తని దిండ్లు పరిచి జాగ్రత్తగా తయారు చేశారు.

కారువచ్చి యింటిముందు ఆగింది. మాధవ్ దిగి లోపలికి వచ్చేసరికి సంధ్య పాలిపోయిన ముఖంతో వాసు చెయ్యి గట్టిగా పట్టుకుని నిలబడి వుంది. ఆయా వాసుకి కావల్సిన ముఖ్యమయిన సామానులు కారులో పెడుతోంది. మాధవ్ మెల్లిగా మంచం దగ్గరికి వచ్చాడు.

'అక్కా! వెళ్ళనా?' వాసు సంధ్య ముఖంలోకి చూస్తూ అడిగాడు. సంధ్య నిశ్శబ్దంగా వంగి వాసు రెండు బుగ్గలమీద, నుదురు మీద ముద్దు పెట్టుకుంది.

'ఛ! యేడవకు. నువ్వు యేడుస్తే నాకు వెళ్ళాలనిపించదు' అక్కగారి చెంపల మీదకి కారుతున్న కన్నీళ్ళని తుడుస్తూ అన్నాడు.

'ఆపరేషన్‌కి భయపడవుగా!'

'ఊహు! నీ కెందుకు భయం?'

'నువ్వు ఒకవేళ భయపడితే ధైర్యం చెప్పటానికి దగ్గర నేనుండనుగా! అందుకని-'

'నువ్వు లేకపోతేనేం? మాధవ్ వున్నారుగా-'

సంధ్య ముఖం ఈర్ష్యతో ముడుచుకుపోవటం వాసు గమనించలేదు.

'అయినా చూడు. నేను నెలరోజుల్లో పరుగెత్తుకుంటూ రాకపోతే-' వాసు వుత్సాహంగా అన్నాడు.

'నెల రోజులు!' సంధ్య మనసు బరువుగా మూలిగింది.

మాధవ్ 'టైమయింది' అంటూ వాసుని రెండు చేతుల్తో లేపి కారు దగ్గరికి తీసుకు వెళ్ళాడు.

'నొప్పిగా వుందా?' వాసు నుదుటిమీద పట్టిన చెమటను తుడుస్తూ అడిగాడు.

'ఉహుఁ! అయినా ఫర్వాలేదు.' వాసు మాధవ్ మెడచుట్టూ చెయి వేస్తూ బలవంతంగా నవ్వాడు. అతను చూపుతున్న ధైర్యానికి, ఓర్పుకి అందరి కళ్ళల్లోనూ నీళ్ళు తిరిగాయి.

కారు బయలుదేరబోయేముందు మాధవ్ సంధ్యవైపు చూశాడు. సంధ్య చూపులు వాసు ముఖంమీద నిల్చివున్నాయి. ప్రియాతి ప్రియమైన వస్తువునేదో దూరం చేసుకుంటూ ఆఖరిసారిగా మనసారా చూస్తున్న బాధ మనసులో మెలిదిరుగుతున్నట్టు కళ్ళు విషాదంగా వున్నాయి.

'రమ్మంటే రాలేదు. తను వచ్చినా బాగుండేది' అన్నాడు మాధవ్ బాధగా.

'ఎవరు! అక్క సంగతేనా మీరు చెప్పేది. రాకపోవడమే మంచిది లెండి! ఒకవేళ నేను బాధ భరించలేక కేకలుపెట్టి ఏడుస్తే అది అసలే చూడ లేదు' అన్నాడు బాధగా వాసు.

కారు దూరం అయిపోగానే శూన్యంలోకి చూస్తూ శిలాప్రతిమలా నిలబడిపోయింది సంధ్య. ఈ ప్రపంచంలో తనకు మిగిలిన కాస్త అనుబంధాన్ని మాధవ్ బలవంతంగా దూరంగా లాక్కుపోయి తనని ఒంటరిదాన్ని చేసేస్తున్నట్టు అన్పించసాగింది.

# 23

వాసుని ఆపరేషన్ టేబిల్ మీదకు తీసుకు వెళ్ళటానికి సిద్ధం చేశారు. పైకి చెప్పకపోయినా భయంతో వాసుముఖం తెల్లగా పాలిపోయి వుంది.

ప్రక్కనే వున్న మాధవ్ వాసు చేతిని పట్టుకుని ప్రేమతో చూస్తూ 'భయపడటం లేదుగా!' అన్నాడు.

'ఉహుఁ. భయం దేనికి? అంతా సవ్యంగా ముగిస్తే మీ అందరిలా నేనూ బ్రతుకుతాను. లేకపోతే-లేకపోతే-అవిటివాడిగా క్షణంక్షణం చస్తూ ఆ మంచంలో బ్రతికేకంటే ప్రాణం పోవటం—'

'హుష్. అలా అనకూడదు. ధైర్యంగా ఉండాలి.' వాసు నుదుటి మీద పడిన జుట్టును సరిచేస్తూ అన్నాడు.

వాసు మాధవ్ చేతిని రెండు చేతుల్తో గట్టిగా పట్టుకుంటూ 'కాని ఆపరేషన్ టేబిల్‌మీదకి వెళ్ళబోయేముందు మిమ్మల్ని ఒకటి అడుగుతాను. మీరు వాగ్దానం చేయాలి' అన్నాడు.

'ఏమిటది చెప్పు. ఎప్పుడన్నా నేను నీ మాట కాదన్నానా?—'

'అనలేదనుకోండి. కాని—' వాసు సందేహించాడు.

'చెప్పు వాసూ!'

'ఒకవేళ-ఒకవేళ-నాకేదయినా అయితే, అయితే-అక్కని చూసే బాధ్యత మీది.'

మాధవ్ చేతివేళ్ళు ఆ మాటలు వింటూనే బిగుసుకున్నాయి.

వాసు కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. 'మా సంధ్య ఒట్టి అమాయకు రాలు. మీరు దాని కఠినత్వమే చూశారు. కానీ-దాని మంచితనం చూడలేదు. భగవంతుడు దాన్ని అన్ని విధాల అన్యాయం చేశాడు. నా కేదయినా అయితే—సంధ్యని వంటరిగా నేను వూహించుకోలేను. దానికి ఏ లోటూ రాకుండా మీరు చూస్తారా—'

'ఇప్పుడవన్నీ యెందుకు వాసూ?—'

'చెప్పండి. నాకు నిశ్చింతగా వుంటుంది.'

'సరే అయితే—'

'ఊరికే అంటేకాదు, నా తలమీద చేయిపెట్టి చెప్పండి.'

'సరే, సరే—'

'కాదు ఒట్టు వేయాలి.'

'నీమీద ఒట్టు. సరేనా?' వాసు తలమీద చెయ్యిపెట్టి నవ్వబోయి కళ్ళు తడి అవటంతో చప్పున వాసు తలని గుండెలదగ్గర లాక్కుని ముఖం కన్పించకుండా చేసుకున్నాడు.

'మీరెంత మంచివారు! సంధ్య ఎప్పటికయినా గుర్తించి తీరుతుంది మిమ్మల్ని!' వాసు అస్పష్టంగా అన్నాడు.

నర్సు వాసుని తీసుకెళ్ళటానికి వచ్చింది. వాసు-మాధవ్ ఒకళ్ళని ఒకళ్ళు చూసుకుంటూండిపోయారు. ఉన్నట్లుండి వాసు హఠాత్తుగా మాధవ్

మెడచుట్టూ చేతులువేసి అతని గుండెల్లో ముఖం దాచుకుంటూ 'ఒకవేళ అంతా-అంతా సవ్యంగా జరిగితే నాకు మళ్ళీ స్పృహ రాగానే మొట్ట మొదట మీరే కన్పించాలి' అన్నాడు.

'నీ ఆపరేషన్ పూర్తయ్యేవరకూ నేనిక్కడనుంచి కదలను. అంతా సవ్యంగా ముగుస్తుంది. నువ్వు ధైర్యంగా ఉండు వాసూ!' వాసు భుజాలచుట్టూ చెయ్యివేసి గట్టిగా హృదయానికి హత్తుకుంటూ అన్నాడు మాధవ్.

'అక్క సంగతి మర్చిపోవద్దు.' ఇది వాసు ఆఖరిమాట. నర్స్ వాసుని తీసుకెళ్ళిపోయింది. ఆపరేషన్ గది తలుపులు మూసుకున్నాయి. బయట వంటరిగా నిలబడిపోయాడు మాధవ్. ఒకవేళ వాసుకేదయినా అయితే! ఎన్నడూలేంది భయంతో అతని శరీరం జలదరించింది. సంధ్య ముఖం తను చూడగలడా?

# 24

రెండు రోజుల తర్వాత హాస్పిటల్‌కి ఆయా, సంధ్య వచ్చారు. తెల్లటి బెడ్‌మీద రక్తంలేక పాలిపోయినట్టు పడుకునివున్నా, ముఖంలో నీరసం బాగా కన్పిస్తున్నా వాసు కళ్ళు మాత్రం ఉత్సాహంతో మెరుస్తున్నాయి. సంధ్య దగ్గరికి వెళ్ళింది.

'అక్కా!'

'వాసూ!' అప్పటికే నిండి వున్న కన్నీళ్ళుజారి వాసు నుదుటిమీద పడ్డాయి.

'ఛ! ఎందుకు? అంతా సవ్యంగా జరిగిపోయిందిగా. అక్కా! నేను క్షేమంగా బ్రతికి బైట పడ్డందుకు నిజంగా నీకు ఆనందంగా వుందా! చెప్పు—' వాసు అడిగే తీరుచూచి సంధ్య తెల్లబోయింది.

'నిజంగా మనస్ఫూర్తిగా నువ్వు సంతోషిస్తుంటే నువ్వు స్వయంగా మాధవ్‌గారికి కృతజ్ఞతలు చెప్పు. ఆయన ఋణం మనం యెన్ని జన్మ లెత్తినా తీర్చుకోలేం. తీర్చుకోగలమా నువ్వే చెప్పు?'

అక్కగారి మనసులో మాధవ్ పట్ల సదభిప్రాయాన్ని తెప్పించి

అవునని ఒప్పించటానికి ఇదే మంచి అవకాశం అని ఆశించిన వాసు సంధ్య నోటిచేత అవుననిపించటానికి తహతహలాడిపోతున్నాడు. క్షణంసేపు బిత్తరపోయిన సంధ్య నోట్లోంచి యే మాట లేకుండా తమ్ముడివైపు చూస్తూ నిలబడిపోయింది. వాసుమాటలు విని సంధ్య చూడబోయే ఒక చల్లటి చూపుకోసం ఆత్రంగా యెదురుచూసిన మాధవ్‌కి నిరాశతప్ప యేమీ యెదురవలేదు.

అక్కడి నుంచి వెళ్ళిపోయి గుమ్మంలో నిలబడ్డాడు. తనెందుకు బాధపడాలి! వాసు ద్వారా సంధ్యకి కలిగిన అన్యాయిం సరిచేయాలనుకున్నాడు. చేస్తున్నాడు. అంతే. సంధ్య గుర్తించి కృతజ్ఞత చూపించకపోతే ఏం? గుర్తించనీ, గుర్తించకపోనీ, తను చేయగలిగింది చేస్తాడంతే!

'హల్లో మధూ!—'

మాధవ్ వులిక్కిపడి వెనక్కి తిరిగి చూశాడు.

జ్యోతి పరుగెత్తుకుంటూ వచ్చింది.

'మధూ! నువ్వు—ఇక్కడ—' ఆశ్చర్యాన్నంతా కళ్ళల్లోనూ, కనుబొమల్లోనూ ప్రదర్శిస్తూ చొరవగా అతని చేతిని తన చేతిలోకి తీసుకుంటూ అడిగింది.

'నువ్వు ముందు ఇక్కడెందుకున్నావ్ చెప్పు' అన్నాడు మాధవ్.

'నా ఫ్రెండ్ ఒకమ్మాయికి ఆపరేషన్ అయింది. నువ్వు ఇక్కడ ఎందుకున్నావు?'

'నాకు తెలిసినవాళ్ళ కుర్రాడికి ఆపరేషన్ అయింది.'

సంధ్య యిటుతిరిగి వాళ్ళవైపు చూసింది.

'ఎవరూ తెలిసినవాళ్ళు?'

'నువ్వెరుగవు. నీకు తెలియదు.'

'నాకు తెలియని నీ మిత్రులెవరబ్బా!' జ్యోతి లోపలికి తొంగి చూసింది. ఇటు చూస్తున్న సంధ్య చూపులు జ్యోతి చూపుల్లో కలిసినాయి.

'ఎవరూ?' అంటూ జ్యోతి మాధవ్‌ని తోసుకుని లోపలికి వచ్చింది.

సంధ్య చటుక్కున ముఖం తిప్పేసుకుంది.

'అరె! నువ్వా ఇంకెవరో అనుకున్నాను!' ఆశ్చర్యం వెలిబుచ్చింది జ్యోతి.

'మీరు తెలిసిన వాళ్ళేనా? అయితే నాకు పరిచయం చేయాల్సినపని తప్పిందన్నమాట!' మాధవ్‌కూడా నవ్వుతూ లోపలికి వచ్చాడు.

'అంత ప్రత్యేకంగా పరిచయం చేసుకోవలసినంత ప్రముఖులేం కాదులే! అవునుగాని మధూ! వీళ్ళు నీకెక్కడ దొరికారు?' జ్యోతి మాధవ్ వైపు తిరిగి నిర్భయంగా వ్యంగ్యంగా అడిగింది.

మాధవ్ తెల్లబోయినట్టు చూశాడు.

'అవన్నీ నీ కనవసరం! ముందు నువ్వీ గదిలోంచి వెళ్ళు.' వాసు కోపంతో గట్టిగా అరిచాడు.

'వాసూ!' ఆయా ఆదుర్దాగా దగ్గరకు వెళ్ళింది.

జ్యోతి వాసువైపు నిర్లక్ష్యంగా ఓ విషపుచూపు విసిరి సంధ్యతో 'ఊ! అయితే అక్కా తమ్ముళ్ళిద్దరూ మంచివాడినే పట్టారన్నమాట' అంది.

'జ్యోతీ!' మాధవ్ వారిస్తున్నట్టు పిలిచాడు.

'నీకు తెలియదు. నాకేం భయంలేదు. వీళ్ళ సంగతి అంతా నాకు తెలుసు. ఏదీ ధైర్యం వుంటే ముఖంయెత్తి నాతో మాట్లాడమను చూస్తా. మధూ! నీకు గట్టిగా చెబుతున్నా! నీ స్నేహం పొందాల్సిన మనుషులు కాదు వీళ్ళు!' అప్పటికి మాధవ్ జ్యోతి రెక్కపట్టుకుని బయటకు లాక్కుపోయాడు.

'రాక్షసి! ఇక్కడికెలా వచ్చింది. మాధవ్ కెలా పరిచయం?' పళ్ళు బిగిస్తూ అన్నాడు వాసు.

సంధ్య అపట్పికే రెండు చేతుల్తో ముఖం దాచుకుని వెక్కి వెక్కి ఏడవసాగింది. ఆయా పిల్లలిద్దర్నీ సముదాయించటం మొదలుపెట్టింది.

# 25

'జ్యోతి! నీకు బుద్ధుందా? చదువు, సంస్కారం వున్న మనుష్యులు మాట్లాడే తీరేనా ఇది? మర్యాదేనా నీకు!' అవతలకి వచ్చింతర్వాత మాధవ్ కోపంగా అన్నాడు.

'వాళ్ళ మొహం. వాళ్ళకి మర్యాదేమిటి? ఆ అమ్మాయి యెంత గ్రంధసాంగురాలో నీకు తెలియదు.' నిర్లక్ష్యంగా అంది జ్యోతి.

మాధవ్ వినటం యిష్టం లేనట్లు సిగరెట్ తీసి వెలిగించుకున్నాడు.

'అసలు వాళ్ళు నీకెక్కడ తగిలారు?'

'ఏం! అంత తెలుసుకోకూడని మనుష్యులా?'

'ఖచ్చితంగా. వాళ్ళు మనుష్యులా? కాదు విషనాగులు. చాలా భయంకరమయినవాళ్ళు. ఆ అమ్మాయి పెళ్ళి పెటాకులులేకుండా పిల్లాడిని ప్రసవించింది తెలుసా?'

మాధవ్ ముఖంలోకి ఒక్కసారిగా రక్తం పొంగింది. భగవాన్! సంధ్యని వీళ్ళంతా కలిసి వేటకుక్కల్లా తరిమి వుంటారు. అందులో సందేహం లేదు. అయినా జ్యోతికి సంధ్యకి యెలా పరిచయం? అదే అడిగాడు.

'మీ యిద్దరూ ఒకళ్ళకి ఒకళ్ళెలా తెలుస్తో—?'

'ఒకే కాలేజీలో వెలగబెట్టాంలే! అబ్బో! కాలేజీలో చదివే రోజుల్లో యీవిడిగారి మిడిసిపాటు యేమని చెప్పమంటావు? ఆ బట్టలు, పెద్ద నవాబు కూతురులాగా ఆ దర్జా. ఓ మూడుగుర్రాలబండి ఓహో! అడగకు. పాపం ఆ పొగరంతా ఆ దెబ్బతో దిగిపోయింది.'

మాధవ్ మాట్లాడలేదు. ముఖం తిప్పేసుకున్నాడు!

జ్యోతి అనుమానంగా చూస్తూ 'ఇదంతా అబద్ధం అని కదూ నీ ఉద్దేశ్యం? అవున్లే! అసలు మీ మగాళ్ళబుద్ధే అంత. కాస్త యెర్రగా బుర్రగా కనిపిస్తే చాలు. కళ్ళు మూసుకుపోతాయి. నేను అబద్ధం ఆడుతున్నానని నువ్వు అనుకుంటే నాకు వళ్ళు మండుతుంది. అనవసరంగా ఒకళ్ళని గురించి ఆడిపోసుకునే అలవాటు నాకు లేదు. కావాలంటే రా! తీసుకెళ్ళి చూపిస్తాను.'

'ఏం చూపిస్తావు?' మాధవ్ నిర్భయంగా అడిగాడు.

'ఈవిడగారు కని వదిలేసిన పుత్రరత్నాన్ని!'

'అబద్ధం!' రక్తంలేని ముఖంతో అన్నాడు.

'అబద్ధమా? అయ్యో రామ! నువ్వు వాళ్ళ వలలో బాగా పడ్డట్టుందే! అబద్ధాలు చెప్పాల్సిన ఖర్మ నాకేమిటి? కావాలంటే నిజం తెలుసుకోవాలని

నీకు గట్టిగా వుంటే నాతో రా! ఇప్పుడే చూపిస్తాను!' ఈర్ష్య నిండిన ముఖంతో అంది.

'చూపించకపోతే?' జ్యోతి చెయ్యి నొప్పి పుట్టేంత గట్టిగా గుచ్చి పట్టుకుంటూ అడిగాడు.

'నా పేరు జ్యోతే కాదు. నువ్వు మళ్ళీ నా ముఖం చూడకు!'

మాధవ్ రెప్పవాల్చకుండా జ్యోతివైపు చూస్తూండిపోయాడు.

'ఏం రావటానికి నీకేమయినా అభ్యంతరమా?' సవాల్ చేస్తున్నట్టు అడిగింది.

'లేదు.'

'అయితే పద!' మాధవ్ చేతిలోంచి తన చేతిని విడిపించుకుని విసురుగా దారి తీసింది. మాధవ్ అనుసరించాడు. అతని గుండెలు వేగంగా చిత్రంగా కొట్టుకున్నాయి. ఒంట్లో రక్తం అంతా మరుగుతున్నట్టు వేడెక్కి ముఖంలోకి పొంగింది. ఇది నిజమా? నిజంగా సంధ్య కొడుకు బ్రతికి బాగున్నాడా? కానీ—కానీ, వాసు చెప్పలేదే! ఇష్టంలేక అలా వదిలేసాడా? కారులో కూర్చుని స్టార్టుచేయటానికి స్టీరింగుమీద వేసిన అతని చేతులు కొద్దిగా వణికాయి. కారు బయలుదేరింది.

వెడుతూండగా దారిలో జ్యోతి చటుక్కున గుర్తు వచ్చిన దానిలా 'మాధవ్! నువ్వు ఓ చిన్న అబద్ధం చెప్పాలి' అంది.

'ఏమిటది?'

'నువ్వా కుర్రాడికి తండ్రివని చెప్పాలి. లేకపోతే వాళ్ళు చూపించరు. ఇదంతా నీకేం తెలియదని ఆ సమయంలో నువ్వు ఫారెన్‌లో ఉండటంవల్ల యిలా జరిగిపోయిందని అబద్ధం ఆడాలి. ఇదంతా ఇలా అయినందుకు చాలా బాధపడుతున్నట్లు నటించాలి. పిల్లాడిని చూపించి యిచ్చేస్తే హాస్పిటల్‌కి పదివేలు విరాళం యిస్తానని ఆశపెట్టాలి. కుర్రాడిని చూడటానికి తహతహ లాడిపోతున్నట్టు ఆదుర్దా ప్రకటించాలి.'

మాధవ్ ముఖం కందగడ్డలా తయారయింది.

'ఏం! ఏమంటావు?' జ్యోతి ఆదుర్దాగా అడిగింది.

'సరే! నా కభ్యంతరంలేదు.'

బొంగురుపోయిన అతని కంఠం విని ప్రక్కకు తిరిగి చూసిన

జ్యోతి 'థాంక్స్!' నాకు తెలుసు. నీకు కొంచెం కష్టం అవుతుంది. అయినా ఓ అరగంటేగా! ప్రక్కన నేనుంటాను. అన్నింటికి నేనే జవాబు చెప్తాను.' అతని చేతిమీద తన చేయి వేస్తూ తృప్తిగా అంది. సంధ్య మాధవ్‌కి తెలుసు నన్న విషయం జ్యోతి భరించలేకుండా వుంది అతి త్వరగా ఆ రహస్యం బయటపెట్టి మాధవ్‌కి సంధ్య అసలు స్వరూపం తెలియజేసేంతవరకూ వూపిరాడనట్టు వుక్కిరి బిక్కిరి అవుతోంది.

# 26

'అక్కా! మాధవ్ యింకా రాలేదూ!' వాసు నీరసంగా అడిగాడు. ఈ రోజు మాధవ్ సంధ్య ఆప్యాయంగా మాట్లాడుకుంటారని, తన దగ్గర కూర్చున్న యిద్దర్నీ తృప్తిగా చూడొచ్చునని ఏవేవో ఆశించాడు అతను. జ్యోతి అనుకోకుండా వచ్చి అంతా నాశనంచేసి వెళ్ళింది.

'స్నేహితురాలు బహుశా వదిలి వుండదు.' కఠినంగా అంది సంధ్య.

'మాధవ్‌కి మనకంటే మంచి స్నేహితురాలయి వుంటుందంటావా?' ఈర్ష్యగా అడిగాడు.

'ఎందుకు కాకూడదూ? అయినా నీ పిచ్చిగాని, మనం స్నేహితులం యెలా అవుతాంరా? అతని దగ్గర దయా ధర్మం తీసుకునే యాచకులం గాని. బిచ్చగాళ్ళకి.... స్నేహితులకి నీకు అర్థాలు తెలియవా?....' సంధ్య మనసులో అగ్నిపర్వతాలు బ్రద్దలవుతున్నాయి. కాని పైకి ప్రశాంతంగా, తెచ్చిపెట్టుకున్న చిరునవ్వుతో తమ్ముడిజుట్టు సరిచేస్తోంది. భగవాన్! తన సలు యిక్కడికెందుకు వచ్చింది! అయినా అసలు జ్యోతికి అతనికి ఏ విధంగా పరిచయం! అతనికి యేమని చెప్తోందో? ఇంకేం చెబుతుంది? ఉన్న దేదో చెబుతుంది. చెప్పనీ! భయమా? తన యీ సర్వనాశనానికి ఎవరో ఆ మూర్ఖుడికెలా తెలుస్తుంది! గదిలోకి రాగానే మంచంమీద క్షేమంగా వాసు కన్పించగానే మొట్టమొదటిసారి మనసు అతనిపట్ల కృతజ్ఞతతో మెత్తబడిపోయింది. ఇంతలో జ్యోతి వచ్చింది. ఇప్పుడు మాధవ్ పేరు చెప్తేనే అసహ్యంతో రోషంతో విలవిలలాడుతోంది మనసు. అసలు భగవం తుడే అన్యాయం చేశాడని బాధపడుతుంటే మధ్యలో వీళ్ళ గోలకూడా

ఏమిటి? జ్యోతి....మాధవ్ యిద్దరూ చాలా ఆత్మీయులు కాబోలు. ఎందుకు కాదు! జ్యోతి వచ్చి అలా అతని చెయ్యి పట్టుకోవటంలోనే కన్పిస్తోంది. అయినా అతనికేం తక్కువ కావాలి? ఆడపిల్లని చూడగానే నిగ్రహం కోల్పోయే పశువు! పెళ్ళయిన సుధతో ప్రేమకలాపం ఆడే అప్రాచ్యుడు! పెళ్ళికాని జ్యోతితో పరిచయం ఉండటంలో ఆశ్చర్యం ఏముంది? ఈ మనిషి మళ్ళీ యిలా తన జీవితంలో ప్రవేశించాడెందుకు? సంధ్యకి ఆ క్షణంలో మాధవ్ అంటే ఆడవాళ్ళ వేటకాడు అతి క్రూరుడుగా కన్పించాడు.

'అక్కా! ఆయన ఈ రాత్రికి కన్పించరా?....' హీన స్వరంతో మరోసారి అడిగాడు వాసు.

'నాకెలా తెలుస్తుందిరా!'

'ఒకవేళ ఆయన వస్తే నన్ను లేపటం మర్చిపోకు.' కళ్ళు మూతలు పడుతూండగా అన్నాడు వాసు. వాడికి దగ్గరున్న అక్కగారు అవసరం లేదు. అక్కడలేని మాధవ్ కావాలి. సంధ్య హృదయం ఈర్ష్యతో చిద్రు మంది. తనకంటే మాధవ్‌ని ఎక్కువగా ప్రేమిస్తాడా?

అసలు అతనిలో యేముందని అందరూ అలా ఆకర్షింపబడతారు? ఒక్క వాసేకాదు. ఇప్పుడిప్పుడు ఊళ్ళోవాళ్ళు కూడా కమ్మరి, సాలె, పల్లె అనే విచక్షత లేకుండా అందరూ అతని దగ్గరకొచ్చి స్వవిషయాలు చెప్పుకుని 'దొరగారూ! ఏం చెయ్యమంటారండీ?' అంటూ సలహా అడుగుతారు. ఇలాటి హీనులకి భగవంతుడు అలాంటి ఆకర్షణ ప్రత్యేకంగా యెందుకిస్తాడో మరి!

# 27

మాధవ్, జ్యోతి కారుదిగి సరాసరి నర్సింగ్‌హోమ్‌లోకి వెళ్ళారు. దాదాపు యిరవై ముప్ఫై సంవత్సరాల క్రితం యూరోప్ నుంచి వచ్చి యిక్కడ స్థిరపడిపోయి ఒక ఆంగ్లేయుడు భారతదేశంలో మట్టి అయిపోయిన తనభార్య జ్ఞాపకార్థం కట్టించిన భవనం అది. అందులో నర్సులు ఉచితంగా సేవచేస్తారు. దిక్కులేని ఆడవాళ్ళకి ఆ హాస్పిటల్లో పురుడుపోసి

పంపిస్తారు. ప్రసవించిన తర్వాత ఏ కారణాల వల్లనైనా వద్దని వదిలేసి పోయిన శిశువులని పెంచి పెద్దజేసి క్రైస్తవ మత బోధకులుగా తీర్చి దిద్దుతారు. సాధారణంగా ఈ నర్సింగ్‌హోమ్‌కి మరీ బీద వాళ్ళు, అసలు దిక్కులేనివాళ్ళు తప్ప, వున్నత కుటుంబీకులు గాని, గౌరవనీయులయిన వాళ్ళు కాని రారు.

జ్యోతి తెల్లగా పొట్టిగా గుమ్మటంలా వున్న ఓ సిస్టర్ని కలుసుకుని ప్రసాద్ పేరు చెప్పి తనని పరిచయం చేసుకుంది. సంధ్య విషయం యెత్తి మాధవ్‌ని పరిచయం చేసింది. ముందు కుర్రాడు సంగతి యేమీ చెప్పకుండా సిస్టరు ఇద్దర్నీ అనుమానంగా చూస్తూ సవాలక్ష ప్రశ్నలు వేసింది. జ్యోతి వాటన్నిటికీ చురుగ్గా, చాలా తెలివిగా సమాధానాలు యిచ్చింది.

'క్షమించాలి. ఆ సమయంలో నేను లేను. చాలా పొరపాటయిపోయింది.' ఎలాగో అయిపోయిన కంఠంతో అన్నాడు మాధవ్.

'దానికేముందిలెండి పొరపాటు చేయటం అనేది మానవ నైజం. అది తెలుసుకుని చక్కదిద్దుకున్నప్పుడే మానవోత్తముడవుతాడు. మీలో కుర్రాడి పోలికలు స్పష్టంగా కన్పిస్తున్నాయి. నాకు వేరే సాక్ష్యాలు కూడా అనవసరం.' జ్యోతి అన్ని విధాల అతికినట్టు చెప్పటంతో సంతృప్తి పొందిన సిస్టర్ నవ్వుతూ ప్రసన్నంగా అంది.

ఇద్దర్నీ కూర్చోమని చెప్పి బాబుని తీసుకురావటానికి లోపలికి వెళ్ళింది.

'ఏడిసింది. లక్కపిడతలా మొహం యిదీను. వెర్రిపీనుగ. నిజంగా నువ్వు తండ్రివని నమ్మేసినట్టుంది.' జ్యోతి వెటకారంగా నవ్వుతూ అంటున్న మాటలు మాధవ్ చెవుల్ని సోకనేలేదు. అతని గుండెలు వేగంగా కొట్టుకున్నాయి. సంభ్రమమో, ఆశ్చర్యమో తెలియని అద్భుతమయిన భావంతో అంతరాత్మ సుడిగుండంలోపడి గిరగిరా తిరుగుతున్నట్టు వుంది. ఇది నిజమా, నిజమా అని మనసు పదిసార్లు, వందసార్లు ప్రశ్నించ సాగింది.

పది నిముషాల్లో సిస్టర్ తిరిగి వచ్చింది. వెంట ఆవిడ చిటికినవేలు పట్టుకుని నాలుగయిదు సంవత్సరాల కుర్రాడు నడచి వస్తున్నాడు మంచి

పోషణలో పెరుగుతున్న సూచనగా తెల్లగా, బొద్దుగా, చక్కటి పిల్ల బొమ్మతో తనవైపు వస్తున్న వాడిని చూడగానే మాధవ్‌కి పూర్తిగా మతి పోయింది.

'గుడ్ యీవినింగ్ చెప్పు' అంది సిస్టర్. ఆవిడ చెప్పగానే చెయి జాస్తూ 'గుడీవినింగ్' అన్నాడు సిగ్గు సిగ్గుగా. తనవైపు చాచివున్న ఆ లేత చేతిని తాకటానికి మాధవ్ చేయి క్షణంసేపు వణికింది. కాని వెంటనే తనకి తెలియకుండానే రెండు చేతులూ జాపి దగ్గరకు లాక్కున్నాడు. వాడి స్పర్శ తగలగానే శరీరం అంతా విద్యుత్తు ప్రవహించినట్లయింది.

'చాల తెలివిగలవాడు. నేను ప్రత్యేకంగా పెంచుకుంటున్నాను.' బాబువైపు ఆప్యాయంగా చూస్తూ అంది సిస్టర్.

'సంధ్య కళ్ళు పూడిపోయినాయి ఎంత చక్కటి కుర్రాడు' అంది జ్యోతికూడా.

'నో! నో! ఆ అమ్మాయికి తెలియదు. ప్రసవించగానే చాలా సుస్తీ చేసింది. అసలు బ్రతకదనే అనుకున్నారు. ప్రసవించగానే నాలుగయిదు రోజులకి యీ నర్సింగ్‌హోమ్ నుంచి యింటికి తీసుకెళ్ళిపోయారు సంధ్యకి శిశువు కలిగిన విషయం తెలియనీకుండా నేను తీసుకుని కొద్దిరోజులు పెంచే టట్టు రహస్యంగా తండ్రి యేర్పాటు చేశారు. తర్వాత రజాకార్ మూమెంట్ జరిగింది. ఆయన్ని కాల్చేసినట్టు విన్నాను. తర్వాత నేను ప్రయత్నించినా ఆ అమ్మాయి యెక్కడుందో తెలుసుకోలేకపోయాను. ఇప్పుడెక్కడుందో మీకయినా తెలుసా?—'

జ్యోతి—మాధవ్ ముఖాలు చూసుకున్నారు.

'తెలియదు. ఆ గొడవలు జరిగిన తర్వాత కొద్దిరోజులు యీ ఊళ్ళోనే వుంది. తర్వాత ఎక్కడికెళ్ళిందో ఏమయిందో మాకు తెలియదు' అతి సహజంగా అంది జ్యోతి.

'అలాగా? ఆ సమయంలో నాక్కూడా ఒంట్లో బాగాలేక విశ్రాంతి కోసం మద్రాసు వెళ్ళి కొన్ని రోజులున్నాను. తిరిగి వచ్చిన తర్వాత వాకబుచేస్తే ఏ సంగతి తెలియలేదు.' మాధవ్ చెవులు యథాలాపంగా ఈ మాటలు వింటున్నా మెదడు అర్థం గ్రహించటం మానేసింది. అతని రెండు కళ్ళూ కుర్రాడిలో అణువణువుని ఆత్రంగా, జాగ్రత్తగా పరిశీలిస్తున్నాయి.

సిస్టర్ అన్న మాటలో యథార్థం లేకపోలేదు. తన చిన్ననాటి ఫొటోలో యించుమించు యిలాగే వున్నాడు. కానీ ఆ కనుబొమలు, ఆ పెదవుల వంపు పరీక్షగా గమనిస్తే సంధ్య పోలికలు గుర్తుకువస్తాయి. కుర్రాడి మెళ్ళో వేళ్ళాడుతున్న శిలువ చూడగానే అతని మనసు అవ్యక్తమయిన ఆవేదనతో గిలగిలలాడింది. తనకి సత్యం తెలియకపోతే యింత చక్కటి బాబు సిస్టర్ నీడలో పెరిగి పెద్దయి వ్యక్తిగా రూపొంది యే ఫాదరీగానో ఎక్కడో క్రైస్తవ మతంయొక్క వున్నతిని చాటుతూ-భగవాన్! ఆ పైన ఆలోచించటానికి అతనికి శక్తి చాలలేదు.

'మధూ! ఇక పోదామా?—' ఇంకా కూర్చుంటే సిస్టర్ యింకేం ప్రశ్నలు వేస్తుందో యెక్కడ చిక్కుపడి—పట్టుపడి పోవాల్సి వస్తుందో నని భయపడిన జ్యోతి లేచింది. అయినా వచ్చినపని యెలాగో ముగియనే ముగిసింది. ఇంకెందుకు యిక్కడ? జ్యోతి త్వరపడటంతో మాధవ్‌తప్పని సరిగా లేచాడు.

ఇద్దరూ వెడ్తామని శలవు తీసుకుంటూండగా సిస్టర్ మెడచుట్టూ చేతులువేసి చెవిలో రహస్యంగా అడుగుతున్నాడు.

'ఏమిటది?' అన్నాడు మాధవ్ కుతూహలంగా.

'మీరెవరని అడుగుతున్నాడు. వయసు చిన్నదయినా ప్రతిదీ తెలుసుకోవాలనే ఆరాటం జాస్తి.' బాబు రెండు బుగ్గలమీద ముద్దుపెట్టు కుంటూ ఆప్యాయంగా అంది.

'తండ్రినని చెప్పండి' అన్నాడు మాధవ్.

జ్యోతి నవ్వేసి అతని చెయిపట్టుకుని బయటకి లాక్కొచ్చింది.

సిస్టర్ రూమ్ దాటగానే అప్పటి వరకూ బలవంతంగా బిగపట్టుకుని యిక ఆపుకోలేనట్టుగా విరగబడి నవ్వుతూ 'భలేవాడివి' అంది.

'ఏమిటది?' అన్నాడు మాధవ్ కనుబొమలు ముడుస్తూ.

'ఎంతబాగా నటించావు! నిజంగా నువ్వు తండ్రివే అని ఆ లక్క పిడత నమ్మేస్తోంది. మధూ! నువ్వింత బాగా నటించగలవంటే నిజంగా రెండు కళ్ళతో చూసినాకూడా నమ్మలేకపోతున్నాను' అంది, వచ్చి కారులో కూర్చుంటూ.

మాధవ్ నవ్వలేదు గంభీరంగావచ్చి స్టీరింగ్‌ముందు కూర్చున్నాడు.

కారు వెళుతుండగా 'ఇప్పుడు చెప్పు. సంధ్య నీకెలా పరిచయం? యెప్పటినుంచీ?' అంది.

'ప్లీజ్! జ్యోతీ! ఇంకెప్పుడైనా సమాధానం చెప్తాను. ఇప్పుడు మాత్రంకాదు' అన్నాడు. అతనిదృష్టి రోడ్డుమీదకి నిశ్చలంగా చూస్తోంది.

జ్యోతి అర్థం చేసుకున్నట్టు నవ్వింది. వెంటనే అతని చేతిమీద తన చేతిని ఆనిస్తూ 'ఆల్ రైట్. సరే! పోనీ, యిప్పుడైనా జ్యోతి అనవసరంగా మాట్లాడే మనిషికాదని నమ్ముతావుగా!' అంది సగర్వంగా.

'నీ ఋణం యీ జన్మలో తీర్చుకోలేను. చాలా మేలు చేశావు. ఆజన్మాంతం నీకు కృతజ్ఞుడిని' అన్నాడు మాధవ్ సమాధానంగా!

'దాని కేముందిలే! నాకు తెలిసింది చెప్పాను. ఇంకెప్పుడూ నా మాటలు అనుమానించకపోతే సంతోషిస్తాను. అదే చాలు' అంది. పిల్లాడిని చూడగానే మాధవ్ యెలాగో అయిపోవటం జ్యోతి కనిపెట్టక పోలేదు. అయితే ఈ మధ్య ప్రవర్తనలో మార్పుకి కారణం సంధ్య అన్నమాట! అసలు వాళ్ళిద్దరికీ పరిచయం యెలా అయిందో? యెలాగైనా అవనీ! ఈ దెబ్బతో అతను సంధ్యనీడ చూడటానికికూడా అసహ్యించుకుంటాడు. అందులో ఏమాత్రం సందేహంలేదు అనుకుంది.

'జ్యోతీ! ఈ కుఱ్ఱాడిసంగతి నీ ఒక్కదానికే తెలుసా? లేక మీ వాళ్ళందరికీ-'

'ఊహుఁ! మా ఒక్క కుటుంబానికి తప్ప యెవరికీ తెలియదు. అది కూడా-మాకూ తెలిసేది కాదేమో! సంధ్య నర్సింగ్‌హోమ్‌లో వున్న ఆ టైమ్‌లోనే మా అమ్మవూరునుంచి వచ్చిన ఒకావిడని, ఆవిడకి యెవరూ లేకపోతే నర్సింగ్‌హోమ్‌లో చేర్పించటానికి తీసుకెళ్ళాం. అక్కడ సంధ్య వుంది. సంధ్యా వాళ్ళఆయా మమ్మల్ని చూడగానే దొంగదానిలా నక్కి-నక్కి పారిపోయింది. మా ప్రసాద్ అన్నయ్య తర్వాత మా అమ్మకి సంధ్య విషయం చెప్పాడు. అంతేకాదు. ఈ విషయం ఎక్కడా అనొద్దనీ తెలియనట్టు వూరుకోమని నన్ను గట్టిగా మందలించాడుకూడా! అసలు యివి యెవరి ఇబ్బందులు వాళ్ళవి. మాకేమిటి సంబంధం? మేము అసలలా అన

వసరంగా అనుకునేవాళ్ళం కాదు. మా నాన్నగారు మమ్మల్ని బాగా శిక్షణతో జాగ్రత్తగా పెంచారు!'

కారు జ్యోతివాళ్ళ యింటిముందు ఆగింది.

'లోపలికివచ్చి అమ్మకి కన్పించి వెళ్ళవూ?' అంది దిగుతూ.

'లేదు, జ్యోతీ! పనుంది. ప్లీజ్! తర్వాత వస్తాను '

'తర్వాతంటే? రేపు వస్తావా?'

'చూస్తాను.'

'కాదు-తప్పక రావాలి.'

'అలాగే.' మాధవ్ అప్పటికే కారు బ్యాక్ చేసుకుంటున్నాడు.

జ్యోతి సగర్వంగా చూస్తూ చెయ్యిఊపింది పోన్లే! పాపం కోలుకోటానికి టైమ్ కావాలి. ఈ సమయంలో దేనికీ అతనిని ఒత్తిడిచేసి చిరాకుపరచకూడదనుకుంది.

మాధవ్ సరాసరి అక్కడనుంచి మళ్ళీ నర్సింగ్‌హోమ్‌కి వెళ్ళాడు. అతనికి యిప్పుడు ప్రపంచంలోవున్న ఆకర్షణ అంతా ఆ కుర్రాడిలో కేంద్రీకరింపబడి అది అయస్కాంతంలా అతనిని అటువైపు బలంగా లాగుతున్నట్టు అన్పించసాగింది

# 28

రాత్రిచాలా పొద్దుపోయిం తర్వాత మాధవ్ హాస్పిటల్‌కి మాంచి ఉల్లాసంగా తిరిగి వచ్చాడు. కొద్దిరోజులపాటు అప్పుడప్పుడు ముందువచ్చి బాగా అలవాటుచేసుకున్న తర్వాత బాబుని యివ్వటానికి ఎలాగైతేనేం చివరికి సిస్టర్ ఒప్పుకుంది. ఒప్పించి అంగీకారం తెలిపితేకాని అతను బైటకి రాలేదు. ఫలితంగా కృతజ్ఞతతో అతను నర్సింగ్‌హోమ్‌కి పదివేలు విరాళం యిస్తానని వాగ్దానంచేశాడు. ఇప్పుడతనిలో అపురూపమైన వస్తువేదో పొందిన తృప్తి, ఆనందం కనిపిస్తున్నాయి. ఈసారి అతను సంధ్యవైపు చూడటానికి జంకలేదు. మాట్లాడటానికి సంకోచించలేదు. ఆ పసివాడిని చూసిన తర్వాత సంధ్య తన రక్తంలో రక్తంగా శరీరంలో ఒక భాగంగా అన్పిస్తోంది. ఇప్పుడిద్దరిమధ్యా ఓ అనుబంధం వుంది. సిస్టర్ మెడచుట్టూ

చేతులు పెనవేసి గుండెల్లో ముఖం దాచుకున్నట్టు బాబు యెప్పుడైనా సంధ్యని అలా పెనవైచుకుంటాడా? ఇద్దరూ అలా కలిసివున్న ఆ దృశ్యం చూసే అదృష్టం తనకుందా? ఎప్పటికైనాసరే: ముందు భవిష్యత్తులో ఆరోజు వచ్చితీరాలి! ఆ రోజుకోసం ఆ క్షణంకోసం తను తీవ్రంగా కృషి చేస్తాడు. అవసరం అయితే జీవితాన్ని పణంగా పెడతాడు!

'ఎలా వుంది!' వాసు ప్రక్కలో కూర్చుని నుదుటిమీద చెయ్యి వేసి తాకి చూస్తూ అడిగాడు.

'మీకోసం చాలసేపు అడిగాడు' అంది ఆయా.

'అలాగా?'

'రాగానే లేపమని మరీ చెప్పి నిద్రపోయాడు.'

'పన్నెండు గంటలకు యెలాగూ మందు యివ్వాలిగా; అప్పుడు నేను దగ్గరే వుంటాను.' మాధవ్‌కి వాసుని చూస్తుంటే ఇదివరకు ఎప్పుడూ లేని ఓ విధమైన సోదరభావంతో మనసు పురకలు పెడుతోంది. మధ్యలో వాసు అనే సారధి లేకపోతే తనకి విషయాలు యెప్పటికీ తెలిసివుండేవి కావు. ఈ సారధివల్లే అవతలితీరంలో వంటరిగా నిలబడివున్న సంధ్యని తను చేరుకోవాలి. వాసే లేకపోతే ఆ ఆశ గగనకుసుమంలా కన్పించేది. ఎప్పటికప్పుడు దూరంగాపోయి యెండమావిలా వెక్కిరించేది.

'రేపు వుదయం మేం వెళ్ళిపోతాం' అంది ఆయా. సంధ్య మాటలు ఆయా అప్పచెపుతోందని గ్రహించిన మాధవ్ సూటిగా సంధ్యవైపు చూస్తూ 'యెందుకని?' అన్నాడు 'వెళ్ళిపోతాం' ముక్తసరిగా అని వూరుకుంది ఆయా.

సంధ్య కిటికీదగ్గర నిలబడి ప్రాణంలేని బొమ్మలా బైటకి చూస్తోంది. మాధవ్‌కి ఈ రోజు సంధ్యని తాకాలనిపిస్తోంది. దగ్గరికి లాక్కుని పిచ్చిపిచ్చిగా యేవేవో చెప్పాలనిపిస్తోంది. కనీసం దగ్గరగావెళ్ళి నిలబడాలనే కోర్కె అయినా తీర్చుకోకుండా వుండటానికి నిగ్రహించుకో లేకపోయాడు. లేచి సంధ్య దగ్గరగా వెడ్తూ 'ఏం సంధ్యా! ఎందుకని?' అడిగాడు.

సంధ్య చివ్వున తల తిప్పి చూచింది. క్షణంసేపు అతని కళ్ళలో కలిపిన ఆ కళ్ళలో ప్రపంచంలో వున్న అసహ్యం ద్వేషం అంతా పోగు

పోసినట్టుంది. అంతేకాదు. ఏమిటీ మనిషి-అనే హీనమైనభావం నిండివున్న వాడియైన చూపు అది. అప్పటివరకూ వూహల అలలమీద వూగుతూ, గాలిమేడల్లో విహరిస్తూ మేఘాల్లో తేలిపోతున్న మాధవ్ మనసు చురుక్కు మన్నట్టు తీక్షణంగావున్న ఆ చూపుతో తక్షణం క్రిందికి దిగివచ్చింది. వాస్తవికతను గుర్తించిన అతను అక్కడ నిలబడలేక మరుక్షణంలో గిరుక్కున వెనక్కు తిరిగి దూరంగా వచ్చేశాడు.

# 29

'ప్రియమైన అక్కయ్యకి-

వాసు నమస్కరించి వ్రాయునది! నేనిక్కడ క్షేమంగానేవున్నాను. ఇంకో వారం రోజులలో ఇంటికి వెళ్ళిపోవచ్చునని డాక్టరు చెబుతున్నారు. ఆరువారాలు, యెంతో త్వరగా తిరిగిపోయాయి కదూ? అక్కా! నాకు బుద్ధి తెలిసిన తర్వాత నిన్ను చూడకుండా యిన్ని రోజులు నేనెప్పుడూ ఉండలేదు. నా కెలాగోవుంది. ఎప్పుడెప్పుడు నీ దగ్గరకు పరుగెత్తుకొస్తానా అని ఆత్రంగావుంది. ఒక్కవారం రోజులేగా! ఎక్సర్‌సైజ్ మానేస్తే ఏమవుతుంది!- అంటే మాధవ్ ఒప్పుకోవటంలేదు. అక్కా! మళ్ళీ నా రెండుకాళ్ళమీద ఇలా నడుస్తుంటే ఎంతబాగుందని! పాత జీవితం అంతా భయంకరమైన పీడకలలా తోస్తోంది. పడుకుని నిద్రపోవాలంటే భయం. మళ్ళీ, నిద్ర మెలకువ వచ్చేసరికి కుంటివానిగా మంచంలో ఉండిపోతా నేమో ఇదంతా కలేమో అనిపిస్తుంది. ఆ వూహవస్తే చాలు, మెళ్ళకొద్దీ వేగంగా పరుగెత్తటానికి మనసు తొందరపడుతుంది. ఇలాగని మాధవ్‌కి చెప్తే ఆయన నవ్వి నా బుగ్గపట్టుకుని సాగదీస్తూ 'నీకు ఆలోచన్లు అధికం అంతకంటే ఏమీలేదు' అంటారు. అక్కా! ఆయన యెంతో మంచివాడు కదూ? ఇది యేనాటి ఋణమో మరి. మనం అడక్కుండా దేవలం భగ వంతుడు పంపిన దేవదూతలావచ్చి నా జీవితాన్ని చక్కబరచాడు. మనం ఏం యిస్తే ఆయన చేసిన యీ సహాయానికి ఋణం తీర్చుకోగలమో చెప్పు! నువ్వేమో కనీసం ఒక్క మంచి మాట అయినా మాట్లాడవయ్యె. అప్పుడప్పుడు ఇది గుర్తుకొచ్చి సిగ్గుతో నాకు చావాలనిపిస్తుంది. ఆయన

మంచివారు కాబట్టి పట్టించుకోరనుకో! అక్కా! ఏ
ఎత్తుకుపోయారని చెప్పి మిగతా ప్రపంచంలో అం
జమకట్టే ఏం బాగుంటుంది. చెప్పు? నాకు తెలుసు. తర
నీకు ఆయన ఒక్కరే ఆత్మీయులు. అది నువ్వెప్పటికి గ్రహి
తెలియకుండా వుంది. నువ్వింత నిర్లక్ష్యంగా వున్నా ఆయన కాస్త
పట్టించుకుంటున్నారా? అంతటి విశాలహృదయం యెవ్వరికి వుంటుందో
చెప్పు- కాస్త వింటాను. ఈ ఒక్క విషయం చాలదూ, ఆయన వ్యక్తిత్వం
అర్థంచేసుకోటానికి! మాధవ్‌లాంటి వాళ్ళు ఉండబట్టే యింకా యీలోకంలో
అక్కడక్కడ దయా-ధర్మం-జాలి- స్నేహం కన్పిస్తున్నాయని నా
వుద్దేశం. కేవలం నా నిస్సహాయస్థితి చూసి జాలిపడి, చితికిపోయిన మన
కుటుంబం మీద సానుభూతితో కాకపోతే ఆతని కిదంతా చేయాల్సిన
అవసరం ఏమిటి? నా కెందుకో మీ యిద్దరు స్నేహంగా వుంటే బాగుండు
ననిపిస్తుంది. నాకు తెలుసులే-ఇలాచెప్తే నీకు కోపంవస్తుంది. అయినా చెప్ప
కుండా వుండలేను. వుండటానికి నా మనసు అంగీకరించటం లేదు.

అక్కా! అసలు సంగతి మర్చిపోయాను. నిన్న ఈ హాస్పిటల్‌కు
మోహన్ వచ్చాడు. వాళ్ళ మామయ్యకి ఏక్సిడెంట్ అయి చెయ్యి విరిగితే
యిక్కడ చేర్పించాడట. నేను వరండాలో తిరుగుతుంటే కన్పించాడు. వాడు
నన్ను గుర్తు పట్టలేదు. నేనే గుర్తుపట్టి వాడిదగ్గరకు వెళ్ళి పలకరించాను.
మళ్ళీ నడుస్తున్న నన్ను చూసి ఎంత తెల్లబోయాడని! వాడిప్పుడు
అయిదవ ఫారం చదువుతున్నాట్ట! క్రికెట్ ఆట బాగా వచ్చిందట! వాడి
మొహం వాడికసలు బాట్ పట్టుకోవడం నేర్పింది నేను. వాడి కబుర్లు
వింటుంటే ఎంత ఈర్ష్య అన్పించింది. నాకీ కాలుకుంటి లేకపోతే యీ సరికి
నేను కూడా వాడితోపాటు వుండాల్సింది కదూ! 'ఇప్పుడైనా టైమ్ మించి
పోలేదు. దిగులుపడకు' అంటారు మాధవ్. నిజంగా- ఆయన పేరు తలి
స్తేనే నాకు రెండుచేతులెత్తి నమస్కరించాలనిపిస్తుంది. ఎలాటి సమయంలో
కూడా మనిషి దిగజారిపోకుండా ధైర్యం చెప్తారు. అక్కా! కాలు నయం
అయిపోయిందిగా! మామూలుగా నడవగలుగుతున్న నేను మళ్ళీ చదువుకో
వచ్చు కదూ! నువ్వు నన్ను స్కూల్లో చేర్పిస్తావుగా! మళ్ళీ పుస్తకాలు

...ను కూడా స్కూలుకి వెళుతున్న దృశ్యం కళ్ళ
...టి! భగవాన్! సంధ్యలాంటి అక్కని, మాధవ్‌లాంటి
...ందటానికి క్రిందటి జన్మలో నేనేం సుకృతం చేశాను?
... మీరిద్దరూ అంత మంచివాళ్ళు. నాకెంత ఆపులు!
... ఆయాని అడిగానని చెప్పు. నాలుగయిదు రోజుల్లో పరుగెత్తుకొస్తు
న్నానని తెలియజేయి. వుంటాను.

ఇట్లు,
వాసు.'

సుదీర్ఘమైన ఆ వుత్తరం నిండా మాధవ్ గొడవే. ఎంత చిత్రం! ద్వేషంతో, అవమానంతో అక్క మనసు కరకరమంటుంటే కృతజ్ఞతతో-స్నేహంతో తమ్ముడి మనసు తొణికిస లాడుతోంది. ఉత్తరం యెన్నిసార్లు చదివినా యెక్కడా అక్కా! నువ్వేలా వున్నావు—ఏం చేస్తున్నావు అనే ముక్కలేదు.

సాయంత్రంపూట కూరగాయల తోటదగ్గర పరధ్యాసగా నిలబడిపోయి ఆ రోజు మధ్యాహ్నం తమ్ముడిదగ్గర నుంచి వచ్చిన ఉత్తరాన్ని పదేపదే నెమరు వేసుకుంటోంది సంధ్య. వాసు కాలు నయం అయిందన్న ఆనందాన్ని ఈ చదువుకుంటాననే గొడవ ఆవిరిలా మాయం చేస్తోంది. ఇప్పుడింకో కొత్త సమస్య తలెత్తింది. వాసు చదువుకోసం యిక వూపిరి పోడనివ్వడు. తనకికూడా చదివించాలనే వుంది. కాని ఎలా? ఏం పెట్టి! వేరే ఊరువెళ్ళి చదువుకోవాలంటే మాటలా? ఎంత డబ్బు కావాలి? ఈ కూరగాయలమీద వచ్చింది పొదుపుగా వాడుకుంటే బొటాబొటిగా తింటానికి సరిపోతోంది. ఇంకా పై ఖర్చులకి కూడా యెక్కడ మిగులుతుంది.

సంధ్య దృష్టి తోటమీదికి మళ్ళింది. చెట్లు, పాదులు యెదిగి కాపుకి వచ్చాయి. పువ్వులు, పిందెలతో కళకళ లాడుతున్నాయి. ఈ తోటంటే సంధ్యకి చంటిబిడ్డతో సమానం. కష్టపడి బ్రతకటంలో ఎంత తృప్తి వుంది! మొదట మొదట ఈ కాయకష్టానికి శరీరం యెదురు తిరిగినా తర్వాత క్రమేపీ అలవాటుపడిపోయింది. ఇప్పుడు బాధేమీ అన్పించదు సరికదా, అదో విధమైన ఆనందం కలుగుతుంది.

పోనీ, యీ స్థలాన్నే ఇంకా కొంచెం చదునుచేసి తోటని ఆ వైపుకి

పెంచి పెద్దజేస్తే! చేస్తే బాగానే వుంటుందిగాని మళ్ళీ బోలెడంత ఖర్చు. చేతి క్రింద ఇంకో మనిషి అవసరం. ఇప్పటికే ఆయా తనూ శక్తికి మించి చేస్తున్నారు. డబ్బు పెట్టుబడి పెట్టాలి. అన్నీ సమస్యలే. అలాగని వాసుని చదువు విషయంలో నిరాశపరచటం కూడా యిష్టంలేదు. వాసు చదువుకుని పైకి వస్తే ఒకనాటికయినా తన కష్టాలు తీరుతాయి. వయసు గడిచిన తర్వాతనయినా నిశ్చింతగా గడుస్తుంది. ఎల్లకాలం తన కీశక్తి వుంటుందని ఏం నమ్మకం! అందుకే ఈ లోపల వాసు ఈ భారం మోయగలిగినశక్తిని కల్పించాలి.

పోనీ, మళ్ళీ హైదరాబాద్ వెళ్ళి యేదయినా వుద్యోగం చేసుకుంటే! ఉహుఁ వద్దు, వద్దు! మళ్ళ పాత మనుష్యులు-పాత విషయాలు. అవన్నీ గుండెల్లో పొడిచినట్లయి అసలు జీవితం అంటేనే విరక్తి పుడుతుంది.

సంధ్య కళ్ళముందు జ్యోతి ముఖం మెదిలింది. చదువుకునే రోజుల్లో జ్యోతికి తనమీద అకారణంగా అసహ్యంగా ఉండేది. అది ఈర్ష్యతో కూడిన చాతకానితనం అని తనకు తెలుసు. జీవితం తలక్రిందులై, దురదృష్ట దేవత క్రూరంగా నవ్విన ఆ రోజుల్లో తన పతనానికి యెక్కువగా సంతోషించిన వ్యక్తి జ్యోతి అని చెప్పటానికి యేమాత్రం సందేహంలేదు.

ఆ రోజు హాస్పిటల్లో తనని చూసింతర్వాత బయటకి వెళ్ళిపోయినప్పుడు మాధవ్‌కి యేమని చెప్పి వుంటుంది? ఇంకేం చెప్తుంది? చెప్పటానికి యింకేవుంది? కాని యీ దౌర్భాగ్యానికి అంతటికి కారణం యెవరు? నూరేళ్ళ జీవితం నాశనం చేసుకుని యీ మారుమూల యీ పల్లెటూళ్ళో జీవచ్ఛవంలా బ్రతకటానికి బలిచేసింది యెవరు? అందరిలా ఆత్మీయతకీ గౌరవాభిమానాలకీ దూరం అయి వెలిగా బ్రతుకుతున్నది ఎవరిమూలంగా? ఎవరిమూలంగానో ఆ హీనుడికెలా తెలుస్తుంది? ఎవరు తెలియచెపుతారు ఆతనికి?

అన్నిటికంటె అసలు గుర్తువస్తేనే భరించలేని దారుణం, చివరి చివరికి తండ్రి తనని నిర్లక్ష్యంతో కుటుంబ గౌరవాన్ని మంటకలిపిన భూతంలా చూసేవారు. పరువుప్రతిష్టలని మింగిన రాక్షసిలా ఏవగించుకునేవారు. ఆయన చూపుల్నీ, ఆ కళ్ళల్లో అసహ్యాన్నీ గుర్తుకుతెచ్చుకుంటేనే మనసు విలవిలలాడుతుంది. అన్నింటి కంటే అపురూపంగా తన్ను చూసుకున్నది

తండ్రిప్రేమ. అది పోగొట్టుకున్నప్పుడు తను చూసిన నరకం యెవరు వూహించగలరు! అవన్నీ ఎలా మర్చిపోతుంది?

వాసుకి తన అవిటితనం బాగు చేయించాడు కాబట్టి కృతజ్ఞతతో మాధవ్ దేవుడుగా కన్పించవచ్చు కాని-తన జీవిత కుసుమాన్ని నిర్దాక్షిణ్యంగా నలిపి నాశనం చేసిన మనిషి ముఖం వెగటు లేకుండా తనెలా చూడగలుగుతుంది?

అయినా ఇదేం దురదృష్టం? అతనేవచ్చి స్వయంగా వాసు కింత సహాయం చేయటం యెంత విచిత్రం? అదే యింకోవ్యక్తి అయితే కృతజ్ఞతతో చర్మం వలిచి అతనికి చెప్పులుగా కానుక అర్పించేది. ఇప్పుడు వేరు. వాసుకి తనలో వున్న ఈ బాధంతా యెలా తెలుస్తుంది? సిగ్గు విడిచి తనెలా చెప్పగలుగుతుంది? చెప్పలేదు. నిశ్శబ్దంగా యీ గరళాన్ని మింగి వూరుకోవటంకంటే గత్యంతరంలేదు.

తనకి కావాల్సింది వాసు క్షేమం. వాడి ఆరోగ్యంకోసం వాడిని బాగుచేసి మళ్ళీ జీవితం యివ్వడం కోసం-గర్భశత్రువయినాసరే వాళ్ళ ముందు మోకాళ్ళమీద కూలబడి రెండు చేతులూ జాచి భిక్షం తీసుకుంటుంది. సిగ్గుపడదు. అవమానం అనుకోదు.

మాధవ్ పట్ల తను చూపే నిర్లక్ష్యం, అతనిచ్చిన వస్తువులను తాకాలంటే చూపే అసహ్యం ఆయాకి కూడా అర్థంకాదు. కుతూహలంగా చూస్తుంది. కళ్ళతో కారణం ఏమిటి చెప్పమని ప్రార్థిస్తుంది. కాని నోరు తెరిచి అడగలేదు. కారణం, ఎంత కన్నతల్లిలా చూసినా కొన్ని కొన్ని విషయాల్లో యజమానికి నౌకర్లకి ఉండే హద్దుని తను గిరిగీసి చూపిస్తుందని ఆయాకి అనుభవ పూర్వకంగా తెలుసు.

అప్పటికే మేఘావృతం అయివున్న ఆకాశం నుంచి టపటపమని చినుకులురాలి మీదపడటంతో సంధ్య వులిక్కిపడి తలెత్తి చూసింది. ఆకాశంలో పడమటి దిక్కునుండి కారుమబ్బులు గుంపులు గుంపులుగా యిటువైపు వస్తున్నాయి. బాగా వానని సూచిస్తున్న వాతావరణం చూసి ఆలోచనల వేగం నుంచి తేరుకున్న సంధ్య గబగబా యింటికి నడిచింది.

# 30

'వచ్చావుకదా! పెద్దవాన పడేట్టుంది. తడిసిపోతావేమోనని భయపడ్డాను' అంది ఆయా ఎదురొస్తూ. అప్పటికే గాలిజోరు ఎక్కువయింది. చూస్తూండగానే కుండపోతగా వర్షం ప్రారంభమైంది-చీకటి పడిపోయింది. వేగంగా వీస్తున్న గాలికి తలుపులూ, కిటికీలూ కొట్టుకోవటం ప్రారంభించాయి. ఆకాశంలో మెరుపులు, ఉరుములమధ్య మేఘాలు గర్జిస్తూ పరవళ్ళు త్రొక్కటం ప్రారంభించాయి.

'తోటంతా పూతమీద, పిందెమీద వుంది. ఈ గాలివాన చూస్తుంటే-' దిగులుగా అంది సంధ్య.

ఆయా మాట్లాడలేదు. ఈ వానకి తోట ఏదన్నా అయితే అది సంధ్య మనసుమీద ఎంత దెబ్బ తీస్తుందో, ఎండనకా, వాననకా ఎంత కాయకష్టంచేసి ఫలితం కోసం ఎదురుచూస్తోందో ఆయాకి కాకపోతే ఇంకెవరికి తెలుస్తుంది?

రాత్రంతా వర్షం పడుతూనే వుంది. ఉదయానికి తగ్గకపోగా గాలి విసురు మరింత ఎక్కువైంది. పగలంతా ఒక్క నిమిషం కూడా తెరిపి ఇవ్వలేదు. ఈదరుగాలితో కుంభవృష్టి కురుస్తూనే వుంది.

సాయంత్రం అవుతుండగా 'ఓసారి తోటకి వెళ్ళి చూసి వస్తాను' అంది సంధ్య.

'ఈ వానలోనా? నీకేమయినా మతిపోయిందా!' ఆయా కసిరింది.

ఈ వూరికి వచ్చిన తర్వాత ఈ రెండు మూడు సంవత్సరాలలో ఇంత పెద్దవర్షం యెప్పుడూ పడలేదు. ఇల్లువేసి చాలా రోజులు కావటంవల్ల పెంకుల మధ్యనుంచి ఇంట్లోకి వాన కురుస్తోంది.

చీకటి పడింది. ఆయా వెలిగించిపెట్టిన లాంతరు గాలికి రెపరెపలాడుతోంది. రాత్రి వానతగ్గే సూచనలేవీ కన్పించడంలేదు. వాసు పడుకునే మంచంమీద సంధ్య ముడుచుకుని కూర్చుంది. ఆయా ఇంట్లో వున్న చెంబులు గిన్నెలు తెచ్చి అక్కడక్కడ వాననీళ్ళు పడుతున్న చోట పెట్టింది. అయినా లాభం లేకుండా వుంది రాత్రంతా యిలాగే పడితే ఇల్లంతా వాన

నీళ్ళకి నిండిపోయేట్టుగా వుంది. గోడలనుంచి కూడా తేమగా నీళ్ళు కారుతున్నాయి.

సంధ్య నిస్సంకోచంగా చూస్తూ కూర్చుంది.

వాకిలి తలుపులు తెరిచినట్టు చప్పుడైనాయి.

'ఎవరు?' అంది ఆయా బిగ్గరగా.

'ఎవరూ లేరు. నీకు ఒకటే ఆలాపన. గాలి శబ్దం.' సంధ్య విసుక్కుంది.

'నాకు ఎవరో పిలిచినట్టు విన్పించింది.'

'కావాలంటే వెళ్ళి చూడరాదు?' ఇంత చీకట్లో ఎవరు వస్తారో ఇక్కడికి అనుకుంది.

ఆయా వెళ్ళి తలుపు తీయగానే మాధవ్ రెయిన్ కోటునుంచి నీళ్ళు కారుకుంటూ లోపలికి వచ్చాడు.

అతన్ని చూడగానే సంధ్య చటుక్కునలేచి నిలబడింది

ఒక్కసారి తలుపులు తెరుచుకోగానే హఠాత్తుగా వచ్చిన గాలి విసురుకి లాంతరు రెపరెపలాడింది. ఆయా చప్పునవెళ్ళి చేతులు అడ్డు పెట్టింది.

మాధవ్ వెంటనే తన వెనక తలుపులు మూసేడు.

'మీరు ఊరునుంచి ఎప్పుడు వచ్చారు?' అంది ఆయా

'ఉదయమే వచ్చాను. బయటికి కదలనివ్వకుండా ఒకటే వర్షం.' సాధారణంగా అతను ఊరునుంచి రాగానే సంధ్యా వాళ్ళింటికి వచ్చి వాసు క్షేమ సమాచారాలు తెలియజేస్తాడు.

మాధవ్ ఇంటి నిండా పరిచిన గిన్నెలవంక ఆశ్చర్యంగా చూస్తున్నాడు. పొడుగ్గా వున్న రెయిన్ కోటులో అతను మరింత పొడుగ్గా లావుగా కన్పిస్తున్నాడు. వాన జల్లుకి తడిసిన జుట్టు నుదుటిమీదపడి అంటుకుపోయింది. అదీ ఒక అందంగానే వుంది. ఎప్పటికప్పుడే యిప్పుడెంత బాగుంది అన్పించి మరోసారి చూడాలి అన్పించే ప్రత్యేకత వుంది ఆ జుట్టుకి.

'ఒకటేవాన! ఈ రాత్రికికూడా తగ్గేట్టులేదు' అంది ఆయా,

'ఇల్లంతా కురుస్తోందిలా వుందే!' రెయిన్‌కోటు విప్పేస్తూ అన్నాడు. దాన్నుంచి కారుతున్న నీళ్ళు కాలువ కడుతున్నాయి.

ఇంత వానలో ఇప్పుడీ చీకట్లో రాకపోతే ఏం మునిగిపోయిందో! క్రిందికి చూస్తూ నిలబడిన సంధ్య ముఖం చిట్లించుకుని కనుబొమలు ముడుచుకుంది.

'లోపలంతా కూడా కురుస్తోందా?' అంటూ మాధవ్ చొరవగా లోపలంతా చూసి తిరిగివస్తూ 'బాప్‌రే! గోడలుకూడా కారుతున్న నీళ్ళతో నానుతున్నాయి' అన్నాడు.

ఆయా మాట్లాడలేదు.

'ఈ రాత్రికి వాన తగ్గదు' అన్నాడు.

మళ్ళీ ఎవరూ సమాధానం చెప్పలేదు. సంధ్య వంచిన తల ఎత్తలేదు.

'నది ఇప్పటికే ఒడ్డురాచుకుని ప్రవహిస్తోంది. ఏ క్షణంలో పొంగినా పొంగవచ్చు. పల్లెవాళ్ళంతా గుడిసెలు ఖాళీచేసి ఊళ్ళోకివచ్చారు. ఈ రాత్రంతా వానపడితే నది పొంగటం మాట దేవుడెరుగు, ముందీ వర్షపు నీళ్ళతోనే ఈ ఇల్లు మునిగిపోయేలా వుంది.' నవ్వుతూ అంటూండగానే పై నుంచి టపటప చినుకులువచ్చి అతని తలమీద పడినాయి. వాటి నుంచి తప్పించుకోటానికి మాధవ్ అనుకోకుండా సంధ్యవైపు జరిగాడు.

'ఈ రాత్రప్పుడు ఎక్కడికి పోతాం' అంది ఆయా సందేహంగా.

'మా యింటికి రండి! మళ్ళీ తెల్లవారగానే వచ్చేద్దురుగాని' అన్నాడు మాధవ్.

'ఫర్వాలేదు, వాన తగ్గిపోయింది.' మొట్టమొదటిసారిగా మాట్లాడుతూ అంది సంధ్య.

లాంతరు వెలుగులో క్షణంసేపు సంధ్యవైపు చూస్తూండిపోయిన మాధవ్‌కి సంధ్య నిలబడినతీరు, ఆ వంచుకున్న ముఖం చూసేసరికి దగ్గరగా వెళ్ళి బలవంతంగా రెండు చేతుల్తో ముఖం పైకెత్తి కళ్ళెత్తి చూడమని ఆజ్ఞాపించాలి అనిపించింది. అలా చూసినప్పుడు 'నేనేం చేస్తే నీకు నామీద వున్న అసహ్యం పోతుందో చెప్పు. సప్తసముద్రాలు ఈదనా? మంచుకొండలమీద నుంచి క్రిందికి జారనా! అగ్నిపర్వతాల మధ్యనుంచి

చిరనవ్వుతో నడవనా? ఏం చెయ్యను? ఏం చేస్తే నీ ముఖంలో ఆవరించు కున్న కాఠిన్యం కరిగి నాపట్ల ప్రసన్నత కలుగుతుందో చెప్పు సంధ్యా' అని అడగాలనిపించింది. కాని పైకి మాత్రం మామూలు స్వరంతో, అతి సహజంగా 'అర్ధరాత్రివేళ ఏదయినా అయితే?' అన్నాడు.

'ఏంకాదు!' దృఢంగా వచ్చింది సమాధానం.

'కీడెంచి మేలెంచటం మంచిది. చెడుని వూహించి జాగ్రత్త పడటంలో నష్టం ఏమీలేదు. ఈ రాత్రి ఏమీకాదని మీరనుకుంటే ఏదయినా అవవచ్చునని నా భయం. మనిషి కెప్పుడూ తన నమ్మకాలమీద గుడ్డి విశ్వాసం పనికిరాదు. భగవంతుడు ఒక్కోసారి మనం వూహించిన దానికి పూర్తి వ్యతిరేకంగా జరిపిస్తాడు.' చివరి మాటలోని శ్లేష ఒక్క సంధ్యకే అర్థమైంది! క్షణంసేపు నిశ్శబ్దం యేర్పడింది.

లాంతరువత్తి సరిచేస్తున్న ఆయా సంధ్యవైపు చూసింది. ఈ గాలి, ఈ వాన, నీళ్ళతో నానుతున్న ఈ గోడలు చూస్తుంటే ఆవిడకి భయంతో ప్రాణం పోతోంది. కనీసం కప్పుకునేందుకు మంచి బట్టలుకూడా లేవు.

'ఏమంటావు ఆయా?' మాధవ్ తనేపనయినా చేయదల్చుకుంటే ఆయాతోనే సంప్రదిస్తాడు.

'నాకేంగీ—' అనుమానంగా అంది.

'అయితే తక్షణం బయలుదేరు. చిన్నవాళ్ళ అభిప్రాయాలకి విలువ యివ్వాల్సిందే, కాదనను. కాని పెద్దరికంతో ఆజ్ఞాపించాల్సిన సమయాలు కూడా కొన్ని వున్నాయి.'

సంధ్య ముఖం ఎర్రబడటం ఎవరూ గమనించలేదు.

'నేను ప్రాణం పోయినాసరే, ఇక్కడే ఉంటాను. కాసీ మీ ఇంటికి రాను. ఇక్కడ నుండి వెళ్ళు' అని బిగ్గరగా అరవాలనిపించింది. కాని వివేకం కోపాన్ని ఆగమని హెచ్చరించింది. ఆయాని చూసి మాట్లాడమని బతిమిలాడింది. సంధ్య కళ్ళెత్తి ఆయావైపు చూసింది. చలిలో గడగడలాడుతూ—భయంతో అనుమానం నిండిన కళ్ళతో 'వెళదాం' అని ప్రాధేయపడుతూ దీనంగా ఉన్నట్లు ఆవిడ ముఖం కన్పించగానే సంధ్య తగ్గింది. ఈ గాలికి, ఈ వానకి ఆయాకి యేదయినా జబ్బుచేస్తే అది మరీ కష్టం సంధ్య రాజీపడక తప్పలేదు.

ఎలాగయితేనేం బయలుదేరారు.

'మీరిద్దరూ ఈ రెయిన్‌కోటు కప్పుకోండి. తల తడవకుండా వుంటుంది.'

మాధవ్ రెయిన్‌కోటు అందిచ్చాడు.

ఆయా తీసుకుంది.

'అవసరంలేదు. నేనిలా రాగలను.' తల తిప్పేసి విసురుగా అంది సంధ్య! ఆ అనేటప్పుడు ఆ కళ్ళలో కన్పించిన కంపరం మాధవ్ గుర్తించలేదు. ఆయాకి కోటు జాగ్రత్తగా కప్పాడు.

ఇంటికి తాళంవేసి వరండా దిగుతుంటే మట్టిలో సంధ్య కాలు జర్రున జారింది.

'ఆఁ! ఆఁ! జాగ్రత్త—' వెనకగా వస్తున్న మాధవ్ చప్పున బలంగా జబ్బగుచ్చి పట్టుకుని పడిపోకుండా ఆపాడు. ఆ ప్రయత్నంలో సంధ్య తల వచ్చి అతని గుండెలకి ఆనింది. సరిగ్గా నిలబడి మాధవ్ చేతిని విదిలించుకునేలోపల అతనే వదిలేశాడు. అతని స్పర్శ అసహ్యంగా ఉన్న మాట వాస్తవమే! కానీ మెరుపులా అతను పట్టుకుని ఆపకపోతే ఈ పాటికి బురదలో బోర్లాపడి ఉండేది. అందుకే సంధ్య అనుకున్నంతగా అసహ్యించుకోలేకపోయింది.

# 31

ఎప్పుడూ దూరం నుంచి వేలగా చూడటంతప్ప దగ్గరగా ఈ ఇల్లు ఎలా ఉంటుందో సంధ్యకి, ఆయాకి యిద్దరికీ తెలియదు. వరండా దాటి లోపల అడుగు పెట్టేసరికి హాలునిండా బిలబిలలాడుతూ చాలా మంది కన్పించారు. వాళ్ళలో ఎక్కువమంది పనివాళ్ళు వున్నారు. సాలీలు-కొంతమంది కమ్మరివాళ్ళు కూడా ఉన్నారు. మగవాళ్ళుకూడా వున్నారు. మగవాళ్ళు కంబళ్ళు కప్పుకుని కూర్చున్నారు. వాళ్ళందర్నీ చూసింతర్వాత సంధ్య తేలికగా నిట్టూర్చింది. తల దాచుకోటానికి ఆశ్రయం యివ్వటంలో మాధవ్ తనకి ప్రత్యేకత చూపలేదు. చాలామంది అనాథల్లా తనూ వచ్చింది—అంతే.

'రండి!' అంటూ లోపలి గదిలోకి తీసుకెళ్ళి 'గోవిందూ!' అని కేక వేశాడు.

'వస్తున్నా!' లోపలినుంచి జవాబు వచ్చిన రెండు క్షణాల తర్వాత గోవిందు అక్కడికి వచ్చాడు. అతను ఒంటరిగా రాలేదు. తెల్లగా బొద్దుగా చక్కటి జుట్టుతో, ఆరోగ్యంతో మిసమిసలాడుతున్న నాలుగయిదు సంవత్సరాల కుర్రాడిని ఎత్తుకొచ్చాడు!

'అరె! నువ్వింకా నిద్రపోలేదూ?' మాధవ్ చేతులు జాస్తూ అడిగాడు.

'ఉహుఁ! నువ్వెక్కడికి వెళ్ళావు?' తండ్రి చేతుల్లోకి వచ్చిన బాబు సంధ్యా వాళ్ళని చూస్తూ అడిగాడు.

'గోవిందూ! వాళ్ళకి లోపల ఎడమవైపు గది చూపించు' అన్నాడు మాధవ్.

'ఎవరీ కుర్రాడు?—' ముద్దొస్తున్న బాబుని చూసి ఆయా అడక్కుండా ఉండలేకపోయింది.

'నా కొడుకు!' ఎంత సహజంగా చెప్పాలన్నా అతని కంఠం ఎలాగో అయిపోయింది.

సంధ్య ఉలిక్కిపడింది.

ఆయా విచిత్రంగా చూసింది.

'ఏం? పెళ్ళి పెటాకులూ లేకుండా కొడుకెలా వచ్చాడనా? నాలాటి వాళ్ళకి వస్తాడు. వీడు నా కొడుకు—అని తెలిసింది. వెంటనే తెచ్చుకున్నాను. తల్లి ఎక్కడుందో తెలియదు.' అతని మాటల్లో శ్లేష అందరికీ అర్థం అవుతూనే అంతా ఆశ్చర్యపోయారు కూడా.

'బాబూ! ఆయా దగ్గరికి వెళతావా?—' ఆయాకి అందిస్తూ కొడుకుని అడిగాడు. వాడు వెళ్ళినట్టే వెళ్ళి మళ్ళీ తండ్రి కోసం చేతులు చాచాడు.

'అచ్చు మీ పోలికే సుమా!' ఆయా నవ్వు తెచ్చి పెట్టుకుంటూ అంది. మాధవ్ నా కొడుకు అని చెప్పిన విషయం కుర్రాడి ముఖంలో స్పష్టంగా కనిపిస్తున్న అతని పోలికలు ఖచ్చితంగా రుజువు చేస్తున్నాయి.

'ఎక్కువ నా పోలికలున్నమాట నిజమే. కాని పరీక్షగా చూస్తే

పెదవుల్లో ముక్కులో తల్లిపోలికలు కూడా కన్పిస్తున్నాయి.' అతని ముఖం క్రీనీడలో ఉండటంవల్ల అక్కడ ఎలాటి భావం వుందీ ఎవరికీ కన్పించదు.

ఈ ప్రసంగం ఆపైన వినటం యిష్టంలేనిదానిలా సంధ్య అక్కడి నుంచి గోవిందుతో లోపలికి వెళ్ళిపోయింది.

'పిల్లాడిని ఎవరు చూస్తున్నారు మరి?—' అంది ఆయా.

'ఇంకా ఎవరూ దొరకలేదు. ఆయాల కోసం వెతుకుతున్నాను. నేనున్నా లేకపోయినా కంటికి రెప్పలా చూసే మనిషి కావాలి' అన్నాడు మాధవ్.

'ఔనౌను!' ఆయా కూడా అక్కడ నుంచి లోపలికి వెళ్ళిపోయింది.

వాళ్ళు వెళ్ళిపోయింతర్వాత మాధవ్ ఒక్కసారి బాబుని గుండెలకి హత్తుకుని అక్కడున్న ఒక కుర్చీలో కూలబడ్డాడు. ఎంత విచిత్రం! సంధ్యకి వీడిని చూపించి నా కొడుకు అని ఎలా చెప్పాలా అన్న సమస్య ఇంత సులభంగా పరిష్కారం అయిపోతుందని అతను కల్లోకూడా అనుకో లేదు. ఈ రోజే వాడిని సిస్టర్ దగ్గరనుంచి పూర్తిగా తెచ్చేసుకున్నాడు. ఈ రోజే అనుకోకుండా తప్పనిసరి కావడంవల్ల సంధ్య ఈ యింటికి తలదాచుకోటానికి వచ్చింది. 'నా కొడుకు!' అని చెప్పినప్పుడు సంధ్య ముఖంలో కన్పించిన అసహ్యమయిన భావం అతను గుర్తించకపోలేదు. ఏనాటికయినా బాబుని తీసుకెళ్ళి సంధ్యకి అందిచ్చి 'వీడు నీ కొడుకు సంధ్యా!' అని చెప్పే క్షణం వస్తుందా?

బాబుని అలవాటు చేసుకోటానికి అతను యెన్ని తిప్పలు పడ్డాడో ఆ భగవంతుడికే తెలుసు. దాదాపు ప్రతిరోజూ నర్సింగ్ హోమ్‌కి వెళ్ళే వాడు. వెళ్ళినప్పుడల్లా వాడిని తీసుకుని కారులో కూర్చోపెట్టుకుని ఊరంతా త్రిప్పేవాడు. చాక్లెట్లు, బిస్కెట్లు, బొమ్మలు, బట్టలు-ఒక టేమిటి-వాడి దృష్టిని ఆకర్షించేవి-కన్పించిన ప్రతి వస్తువు స్వయంగా షాపుకి తీసుకెళ్ళి కొనిపెట్టేవాడు. అందువల్లే వాడు అలవాటు అవటానికి ఎక్కువ రోజులు పట్టలేదు.

రాను రాను బాబుకి మాధవ్ అంటే ఒక విచిత్రమయిన లోకం చూపించే మనిషిగా, తనేవి కావాలంటే అది యిచ్చే ఆప్తుడుగా తెలిసి పోయింది. అందుకే సిస్టర్ 'ఆయనతో వెళతావా?' అంటే వెంటనే తల

వూపాడు. పదిహేను రోజులకి, లేకపోతే కనీసం నెలరోజులకి ఒకసారైనా తీసుకొచ్చి బాబుని చూపించి, బెంగపడటం లేదని రుజువు చేయాలని సిస్టర్ గట్టిగా హెచ్చరించి మరీ యిచ్చింది. వాడిని దగ్గరికి తీసుకుంటున్నప్పుడో, ఒళ్ళో కూర్చోబెట్టుకున్నప్పుడో వాడివైపు ఉద్రేకంగా చూస్తూ గంటల తరబడి ఆలోచనల్లోకి జారిపోవడం మాధవ్‌కి అలవాటయిపోయింది.

అప్పటికి కూడా వాడిని తాకితే విద్యుత్ తాకినట్టే అన్పిస్తుంది అతనికి. సంధ్య దగ్గరికి బాబు వెళ్ళేలా చేయటం ఎలాగన్నది ప్రస్తుతం మాధవ్‌ని వేధిస్తున్న సమస్య. అతని మనసు దానికోసం వేయి మార్గాలు వెతకసాగింది.

గదిలోకి వచ్చిన తర్వాత పడుకోబోయే ముందు ఆయా 'నిజంగా కొడుకేనంటావా?' అంది యింకా అదే ఆలోచిస్తూ నమ్మలేనట్టుగా.

'ఏం? ఎందుకు కాకూడదూ?' కఠినంగా ప్రశ్నించింది సంధ్య.

'మరి తల్లి!'

'గంగలో దూకి వుంటుంది. లేకపోతే మరో పెళ్ళి చేసుకుని మర్చిపోయిందో!'

'ఏంతయినా కుర్రాడు మాత్రం ముత్యంలా వున్నాడు సుమా! ఆ జుట్టూ ఆ కళ్ళూ ఆ నుదుటూ అచ్చు ఆయనే—' అంది ఆయా.

సంధ్య మాట్లాడలేదు. మనసంతా భయంకరమయిన జ్ఞాపకంతో కదలాడుతోంది. తనకి కూడా ఒకవేళ ఆ కుర్రాడు బ్రతికి వుంటే! సంధ్య శరీరం భయంతో జలదరించి వెంటనే జుగుప్సతో ముడుచుకుపోయింది. ఛీ, ఛీ! ఇంతవరకూ అలాంటి ఆలోచన యెప్పుడూ రాలేదు. అయినా అతనికి ఎంత సిగ్గులేదూ! ఎంత గర్వంగా చెప్పుకుంటున్నాడో?

సంధ్యకి తండ్రీ కొడుకులు కలిసిన ఆ దృశ్యం కళ్ళముందు మెదలగానే శరీరం అంతా తేళ్ళూ జెఱ్ఱులూ పాకినట్టు కంపరం పుట్టింది. అతని జీవితంలో ఎంతమంది ఆడవాళ్ళు! రోజు రోజుకీ పరిచయం పెరిగినకొద్దీ ఈ ఆడవాళ్ళ సంఖ్య పెరిగి పోతోందే! సుధ, జ్యోతి, ఈ కుర్రాడితల్లి, తనూ, అబ్బా! నిజంగా ఏం మనిషి? సంధ్యలో అణువణువు అతనంటే మరింత ద్వేషంతో అసహ్యించుకోసాగింది. అయినా ఇదేం ఖర్మం! ఈ ఇంట్లో అసలు తనెందుకు అడుగుపెట్టింది? భగవాన్! నేనేం

పాపం చేశాను? నన్నింత క్రూరంగా శిక్షిస్తున్నావు? చీకట్లో, వాన చప్పుడు వింటూ పడుకున్న సంధ్య కళ్ళనుంచి నిశ్శబ్దంగా వెచ్చటి కన్నీళ్ళు ప్రక్కలకి జారసాగినాయి.

# 32

మర్నాడు వర్షపు ఉధృతం కాస్త తగ్గింది. గాలి జోరు ఏ మాత్రం తగ్గలేదు. రాత్రి మాధవ్ యింట్లో వున్న అందరూ ఆ రోజు కూడా అక్కడే వుండేట్టు అతను ఏర్పాట్లు చేశాడు గోవింద, అతని భార్య, తల్లి అందరికీ భోజనం సంగతి చూస్తున్నారు. అంత పని వుండే చూస్తూ ఊరికే వుండలేని ఆయా తను కూడా వంట యింటివైపు వెళ్ళింది. అంత క్రితం కొద్దిసేపటి మునుపు సంధ్య ఒక్కసారి వెళ్ళి తోటని చూసివస్తాను అంది. ఈ వానలో అడుగు బయటపెట్టడానికి వీల్లేదని ఆయా గట్టిగా చెప్పింది.

గదిలో వంటరిగా కూర్చున్న సంధ్య ఆయా వంట యింట్లో హడావుడిలో మునిగిపోయిందని గ్రహించగానే మెల్లిగా బయటికి జారుకుని, చీర కొంగు తిప్పి తలమీద కప్పుకొని తోటవైపు పరుగెత్తింది. వడివడిగా అడుగులు వేస్తూ, ఏదో ఆలోచిస్తూ తోట కభిముఖంగా వస్తున్న సంధ్య అల్లంతదూరంలోనే మీట నొక్కినట్టు ఆగిపోయి కళ్ళు వెడల్పు చేసుకుని చూడసాగింది. అక్కడంతా జలమయం అయిపోయింది. పైన నీళ్ళమీద తెప్పలా తేలుతున్న పువ్వుల్నీ పిందెల్నీ చూసి అక్కడ తోట వుందని అనుకోవాలి. పందిరిమీదికి ప్రాకిన తీగెలు కూడా ఎడా పెడా పడిపోయి నాయి.

స్థాణువులా నిలబడిపోయిన సంధ్యకి యెదురుగుండా కనిపిస్తున్న ఈ భయంకరమైన యథార్థాన్ని గ్రహించటానికి యెంత ప్రయత్నించినా మనసు ఒప్పుకోవటంలేదు. గాలికి తలమీది కొంగు జారిపోయింది సరి చేసుకోవాలనే ధ్యాసకూడా లేదు. ఆ వానలో అక్కడ యెంతసేపు నిల

ఒడిపోయిందో సంధ్యకి గుర్తేలేదు. ఎన్ని రోజుల కష్టం! ఎంత శ్రమ! ఎన్ని ఆశలు! వీటన్నిటిని నిరాశ అనే ప్రవాహం ముంచేసింది.

క్రుంగిపోయిన మనసుతో, మెల్లిగా కాళ్ళీడ్చుకుంటూ సరాసరి ఇంటికి వచ్చి తలుపు తీసి లోపల ప్రవేశించింది. ఇల్లంతా నీళ్ళు నిండి వున్నాయి. నీరసంగా వాసు మంచంమీద కూలబడింది గుమ్మంలోంచి చల్లటి ఈదురుగాలి రివ్వు రివ్వుమని వీస్తోంది. వానకి తల, బట్టలు పూర్తిగా తడిసిపోయినాయి. ఎంత ఆపుదామనుకున్నా ఆగకుండా శరీరం అంతా చలికి గడగడా వణుకుతోంది. పళ్ళు కట కట లాడుతున్నాయి. సంధ్యకి ఒక్కసారి వెర్రికేక పెట్టి విరగబడి నవ్వాలనిపిస్తోంది. తోటంతా సర్వనాశనం అయింది. ఏం తినాలి? మళ్ళీ యెంత డబ్బు ఖర్చు చేస్తే— ఎంత శ్రమపడితే మామూలు స్థితికి వస్తుందీతోట. భగవంతుడికి తనంటే ఎందుకింత కసి! ఏం చేసిందని తను? ఎటువైపు వెళ్ళినా ఈ విధంగా క్రూరంగా నవ్వుతున్నాడు. కళ్ళనిండా నీళ్ళు నిండి వెచ్చగా బుగ్గలమీద కారసాగాయి.

ఉన్నట్టుండి ఫెళ ఫెళా విరిగిపడ్డ చప్పుడు విన్పించింది. భయంకర మైన ఆ శబ్దం ఏమిటో తెలియని సంధ్య కెవ్వుమని మంచానికి కరుచుకు పోయింది. ఒక్కసారిగా వానజల్లు వచ్చి విసురుగా సంధ్య మీద పడి యింకా యింకా తడిపేస్తోంది. సంధ్య మెల్లగా తలెత్తి చూసింది. అటు వైపు యిల్లంతా కూలిపోయింది. లేచి అక్కడనుంచి బైటకి పారిపోవా లని ప్రయత్నించింది. కాని సూదుల్లా వచ్చి మీదపడుతున్న వర్షపుధారలు కళ్ళు తెరవనివ్వలేదు. కాళ్ళు వణుకుతున్నాయి. లేవబోయిన సంధ్య మళ్ళీ కూలబడింది. కళ్ళమీదకి మత్తులాంటిది వస్తోంది అది పూర్తిగా వశం చేసుకోకముందే యిక్కడనుంచి బయటికెళ్ళాలి. కూలిపోయిన యింట్లో వంటరిగా వుంది తను. ఇంకా కొద్దిసేపటిలో ఈ భాగంకూడా కూలి పోతుంది! ఏ మాత్రం సందేహంలేదు. తను తక్షణం బయటకి పారిపోక పోతే దీని అడుగునపడి నలిగి ముక్కలవుతుంది. శరీరం నామరూపాలు లేకుండా నాశనం అవుతుంది. సంధ్య ఏమయిపోయిందో ఎవరికీ తెలి యదు. ఎప్పుడో శిధిలమైన ఈ ఇల్లుని కదిలిస్తుండే— ఏ ఎముకలో— బయటపడితే అప్పుడు గుర్తిస్తారు. కళ్ళముందు క్షణంసేపు కదిలిన స్పష్ట

మైన ఈ ఊహా చిత్రాన్ని చూసి సంధ్య వణికిపోయింది. మరింత కంగా రుతో లేచి పరుగెత్తాలనుకుంది. కాని శరీరం ఏ మాత్రం సహకరించలేదు. లేచి రెండడుగులు వేయబోయి మళ్ళీ మంచంమీద పడింది. పాతకాలపు కోళ్ళున్న మంచం, సంధ్య తలవెళ్ళి కోడుకి కొట్టుకుంది. 'అబ్బా!' అన టానికి పెదవులు తెరుచుకున్నాయి కాని శబ్దం పైకి రానేలేదు. సంధ్యకి స్పృహ తప్పిపోయింది.

# 33

ఎంతసేపు అలా వుందో సంధ్యకి ఏమాత్రం గుర్తులేదు. మెల్ల మెల్లగా నాలుగు మూలలనుంచీ నీళ్ళు వచ్చి నిండుతున్నాయి. ఆ నీటిలో ఆకులు, పిందెలు పువ్వులతోపాటు తన శరీరంకూడా తేలియాడుతోంది. ఉన్నట్టుండి ఒక్కసారి ఉధృతంగా గాలి వీచింది. అకస్మాత్తుగా నీళ్ళన్నీ అమితమైన వేగంతో ఎటో ప్రవహించటం ప్రారంభించినాయి. ఆ జాలులో పడి సంధ్య శరీరంకూడా కొట్టుకుపోతోంది అయినాసరే భయంవేయలేదు పైనుంచి హాయిగా శాంతిగా వుంది. నీళ్ళన్నీ పెద్ద ఎడారిలోకి ప్రవహించి అక్కడున్న ఇసకలో యింకిపోయినాయి. దూదికంటె మృదువుగా, అతి మెత్తగావున్న ఆ యిసకలో సంధ్య శరీరం బోర్లాపడివుంది. ఎంత ప్రయత్నంచేసినా లేవలేకపోతోంది. నిర్జీవంగా వున్న ఆ ఎడారిలో వున్న ట్లుండి విచిత్రమైన కేక ఒకటి విన్పించింది. అది ఏమిటో ఎటువైపునుంచి వస్తోందో తెలుసుకోవాలని యావచ్ఛక్తిని కూడదీసుకుని పెనుగులాడు తున్నా ప్రయోజనం లేకుండా వుంది. విచిత్రంగావున్న ఆ శబ్దం మెల్లగా దగ్గరగావచ్చి అది క్రమేపి 'సంధ్యా' అన్న పిలుపుగా మారిపోయింది. ఎవరో వచ్చారు తనకోసం ఎవరై వుంటారు? వాసా? వాసు కంఠంలో గంభీరత్వం యెక్కడుంది? మాధవా? మాధవ్‌కి తనని వెతకాల్సిన పనే ముంది? అయితే ఎవరు మరి? ఏదో సంధ్యా అన్న పిలుపుతో దిక్కులు పిక్కటిల్లుతున్నాయి. మోచేతులమీద లేవబోయిన సంధ్య నీరసంతో మళ్ళీ బోర్లాపడిపోయింది! చుట్టూ సంధ్యా అన్న పిలుపు వేయికంఠాలతో విన్పిస్తోంది 'ఇక్కడున్నాను' అనాలనుకుంది కాని అనలేకపోతోంది.

అర్థంగాని యీ ఆసక్తితో సంధ్యకి కళ్ళంబడి నీళ్ళు కారుతున్నాయి. సంధ్యకి కళ్ళమీదకి మసక మసకగా మళ్ళీ మత్తులాంటిదివచ్చి ఆవరించు కుంది. అమ్మయ్యో! చచ్చిపోతున్నాను. ఫర్వాలేదు. కాని, కాని. వాసు! వాసుకి చెప్పనేలేదు. ఇలా తను చచ్చిపోయినట్టు వాడికెలా తెలుస్తుంది? ఎవరు చెప్తారు? సంధ్య మనసు వాసుకోసం బెంగపడ్తుండగా యీ సారి పూర్తిగా స్పృహతప్పిపోయింది.

మళ్ళీ మెలకువ కలిగేసరికి కళ్ళముందు తెల్లటి వెలుగు కన్పిస్తోంది. అది సూర్యకాంతిలా తీక్షణంగాలేదు. వెన్నెలలా చల్లగావుంది.

అయినా వెన్నెలకాదు. ఆ లేత వెలుగులో అడవిపూలు కలకల లాడుతూ గాలికి వూగుతున్నాయి. పక్షులు ఆకాశంలో పల్టీలు కొడుతూ వలయాలు, వలయాలుగా తిరుగుతున్నాయి. సంధ్యకి తనెక్కడుందో ఏం చేస్తోందో వూహించనుకూడా వూహించలేనంత నీరసంగా వుంది. కళ్ళు తెరిచేసరికి "అక్కా!" అంటూ వాసుమీదవంగి ఆత్రంగా అడుగుతున్నాడు.

'వాసూ!' శూన్యంలోకి తడుముకుంటూ చెయ్యిజాచింది.

'అక్కా, మెలకువ వచ్చిందా?'

'వాసూ! నిజంగా- నిజంగా నువ్వేనా- లే-'

'నిజంగా నేనేనక్కా!' వాసు కంఠం దుఃఖంతో వణికింది.

సంధ్యకి పూర్తిగా తెలివివచ్చింది. తన ప్రక్కలో దగ్గరగా కూర్చుని వున్నాడు.

'వాసూ! నువ్వు- నువ్విక్కడికి ఎప్పుడు వచ్చావు?'

'అదంతా తర్వాత చెప్తాను. ముందు నువ్వు మందువేసుకో!' వాసు లేచి ప్రక్కనే టేబిల్ మీదవున్న మందు, మంచినీళ్ళు తెచ్చి యిచ్చాడు!

'వాసూ! నువ్వు- నువ్వు' సంధ్య చప్పున లేవబోయింది.

'లేవకు!' తలవైపునుంచి గంభీరంగా విన్పించింది. సంధ్య గడ్డం బాగా పైకెత్తి అటువైపు చూసింది అక్కడ మాధవ్ మంచాన్ని పట్టుకుని నిలబడి వున్నాడు. క్షణంసేపు సంధ్య కళ్ళతో కలిపిన అతని కళ్ళలో ప్రపంచంలో వున్న ప్రేమానురాగాలు అంతా ప్రోగుచేసి అక్కడ సంధ్యకోసం దాచిపెట్టినట్టు నిండుగా తొణికిసలాడుతున్నాయి. అతని

చూపులనుంచి కళ్ళు విడతీసుకున్న సంధ్య వెంటనే కనుబొమ్మలు ముడిచింది. మళ్ళీ వెనక్కు జారి మెల్లగా దిండుమీద తల ఆన్చుకుంది. వాసు మందుయిస్తూ 'వేసుకుంటావా!' అన్నాడు.

'వాసూ!' సంధ్య కళ్ళు ఆశ్చర్యానందాలతో మెరిశాయి. వాసు మళ్ళీ నడుస్తున్నాడు. అది మొట్ట మొదటిసారిగా చూస్తోంది. వాసు-అక్కగారి కళ్ళలో ఆ భావాన్ని కనిపెట్టిన వాసు- 'చూశావా! నేను నడిచేస్తున్నాను. మొట్ట మొదటిసారిగా యిక్కడికి రాగానే స్పృహలేని నిన్ను చూసి ఎంత నీళ్ళు కారిపోయానో! చూడు. ఎలా నడిచేస్తున్నానో' అంటూ వాసు గబగబా గది అంతా తిరగటం ప్రారంభించాడు.

'ఆ, ఆ! చాల్లే! ఎక్కువ అలసటపనికిరాదని డాక్టరు చెప్పలా?' మాధవ్ వారిస్తూ మందలించాడు.

'ఆల్‌రైట్ హుజూర్!' వాసు బుద్ధిమంతుడిలా మానేసి వచ్చి సంధ్య దగ్గర కూర్చున్నాడు. మాధవ్ మూలంగా తన జీవితం నాశనం అయినా, అతని పశుత్వం మూలంగా స్త్రీగా పొందవలసిన సుఖాలకి శాశ్వతంగా దూరం అయినా ఇప్పుడిలా వాసుని మళ్ళీ మనిషినిచేసి జీవితం ప్రసాదించినందుకు సంధ్య మనసు కృతజ్ఞతతో మెత్తపడింది.

కొద్దిసేపయిన తర్వాత మాధవ్ గదిలోంచి వెళ్ళిపోయాడు. అతను వెళ్ళగానే వాసు ఆత్రంగా ముఖంపెట్టి 'అక్కా! ఇంట్లోవున్న ఆ చిన్న కుర్రవాడు ఎవరు? మాధవ్ తనకొడుకు అంటున్నారు నిజమేనా?' అని అడిగాడు.

సంధ్య మనసులో ఏర్పడిన మృదుత్వం వెంటనే కఠినంగా మారి పోయింది. రెప్పవాల్చకుండా తమ్ముడివైపు చూడసాగింది.

'అక్కడికీ తమాషా చేస్తున్నారేమో అన్పించి, అనుమానం పట్ట లేక 'పెంపుడు కొడుకా' అనికూడా అడిగాను. 'లేదు, స్వంత కొడుకే నా రక్తం, అన్నారు అక్కా! అదెలా సాధ్యం. ఈయన కసలు పెళ్ళే కాలేదు. పిల్లలెలా పుట్టారు? స్వంతకొడుకు అంటే ఎలా నమ్మేది?'

'ఎందుకు నమ్మకూడదు?' గంభీరంగా అంది సంధ్య.

'కానీ అక్కా, మాధవ్‌లాటి మనిషి—'

'అలాటి వాళ్ళకి ఏదయినా సాధ్యమే. నువ్వు వాడిని గురించి ఎక్కువ ఆలోచించకు.'

'అంతేనంటావా? అయితే నిజంగా కొడుకేనంటావా?' ఈర్ష్యగా అడిగాడు వాసు.

సంధ్య ముఖం త్రిప్పేసుకుంది. కుర్రాడినిచూసి మధ్య వీడికెందు కింత బాధ!

'కాని— అక్కా! అసలు మాధవ్—'

'వాసూ, నన్ను కొంచెం పడుకోనిస్తావా? నిద్రవస్తోంది' అంది కొద్ది విసుగ్గా.

'అలాగే అలాగే, నిద్రపో. నేనిక్కడే కూర్చుంటాను' అన్నాడు వాసు.

తర్వాత ఆయా ద్వారా జరిగినదంతా తెలుసుకుంది సంధ్య. ఎంత సేపటికీ తను యింటికి రాకపోతే మాధవ్ వెతకటానికి వెళ్ళాట్ట. చివరికి వెతికి వెతికి ఎక్కడా కన్పించక ఇంటికి తిరిగివస్తుంటే- దోవలో సంధ్య యిల్లు సగం కూలి కన్పించింది. తలుపులు తెరచి వున్నాయి. ఆత్రంగా లోపలికి పరుగెత్తుకెళ్ళి చూస్తే అక్కడ సగం పడిపోయిన యింట్లో ఓ ప్రక్కగా వాసుమంచం దగ్గర స్పృహలేకుండా పడివున్న సంధ్య కన్పించింది. వెంటనే రెండుచేతులమీద ఎత్తి ఇంటికి తీసుకువచ్చాట్ట. వానలో తలా అవీ బాగా తడవటంవల్ల న్యుమోనియా వచ్చింది. ఒకరోజు హైద్రాబాదు తీసుకెళ్ళకపోతే లాభంలేదు అన్నంతప్రమాదం అనిపించింది. ఆ రోజుచూసి తగ్గకపోతే మర్నాడు తీసుకువెళ్ళే ఏర్పాట్లు చేశారు. కాని ఆ అవసరం రానేలేదు. తగ్గుముఖం పట్టింది జ్వరం. వాసు అక్కగారికి సుస్తీచేసిందని తెలియగానే ఇంటికి వచ్చేశాడు. జ్వరం తీవ్రంగా వున్న నాలుగైదు రోజులు రాత్రిపూటలు మాధవ్ తనే స్వయంగా మేలుకుని దగ్గర కూర్చుని మందులవీ యిచ్చాట్ట. అంత జ్వరంలో కూడా సంధ్య అతన్ని అసహ్యించుకున్నట్లు మాట్లాడేది. మందు తాగనని తోసేసేది. దగ్గర కూర్చున్న మాధవ్‌ని గుప్పెళ్ళు బిగించి గుద్దింది. ఇదంతా చూసి ఆయా, వాసు భయపడుతుంటే 'ఏం లేదు. జ్వరంతీవ్రత. ఖంగారు పడకండి' అని ధైర్యం చెప్పాట్ట. ఒక నిమిషంకూడా అతను సంధ్య

మంచం వదల్లేదు. మందువేసుకోనని పళ్ళు బిగించి పెనగులాడుతున్న సంధ్య పక్కలో కూర్చుని ఒళ్ళోకి లాక్కొని బలవంతంగా మందు త్రాగించటం అతనికి ఒక్కడికే సాధ్యం అయింది. ఇవన్నీ ఆయా నోటినుంచి వివరంగా వింటుంటే సంధ్యకి సిగ్గుతో ప్రాణం పోయినంత పనయింది.

# 34

సంధ్య కోలుకోటానికి ఎక్కువరోజులు పట్టలేదు. పడిపోయిన యింటిని బాగుచేయాలంటే మిగతా భాగాన్ని కూడా కూలదోసి మళ్ళీ కట్టడం మంచిదని, లేకపోతే ఇంకోసారి యిలాటి వర్షం వస్తే ఈ భాగం కూలుతుందని మేస్త్రీ చెప్పాడు. మాధవ్ రోడ్డు దగ్గరగా వున్న తన స్థలంలో చిన్న డాబా వేయించటానికి ప్లాను గీయించాడు. ఇల్లు కట్టటానికి డబ్బులేదు. అందుకే ఇష్టంలేకపోయినా సంధ్య తప్పనిసరిగా ఆయాచేత అదివరకు మాధవ్ ఆ ఇంటిని కొనుక్కోవటం విషయం గుర్తుకు తెచ్చి అడిగించింది. మాధవ్ ఒప్పుకున్నాడు. కాని అతను గీయించిన ఆ ప్లానుకి కట్టబోతున్న యింటికి తను అమ్మిన యింటిపైకం ఓ మూలకి కూడా రాదని సంధ్యకి తెలియదు. మాధవ్ చెప్పదలచుకోలేదు.

ఎంతలేదన్నా యిల్లు కట్టాలంటే నాలుగైదు నెలలకిపైనే పడు తుందికాని తక్కువ పట్టదు. ఈ వ్యవధిలో మాధవ్ యింట్లో వుండ టంకంటే వేరు గత్యంతరం ఏమీ కన్పించలేదు. ఈ విధంగా పరిస్థితు లన్నీ మూకుమ్మడిగా యెదట నిలిచి సంధ్యని బలవంతంగా మాధవ్వైపు నెట్టటం ప్రారంభించాయి.

ఆయాకి బాబు అంటే రాను రాను యిష్టం అధికం కాసాగింది. వాడి చిన్నతనం చేష్టలు, వచ్చీ రాని పసి మాటలు, అల్లరి అందర్నీ ఆక ర్షిస్తున్నా సంధ్యని మాత్రం ఆకర్షించటంలేదు. బాబుకి తల దువ్వటం, స్నానం చేయించి బట్టలు వేయటం, వేళపట్టున భోజనం తినిపించటం ఇవన్నీ ఆయా తనే స్వయంగా చూస్తోంది. అంతేకాదు గోవిందు భార్యని వంటపని మాన్పించి ఆ భారంకూడా తనమీదే వేసుకుంది. సంధ్య

అడ్డు చెప్పబోతే 'నువ్వూరుకో! ముగ్గురం పడి తింటున్నాం. ఈ మాత్రం చేయటం ఒక లెక్కకాదు' అని కసిరింది. ఆయా అప్పుడప్పుడు యీ పన్లతో సతమతమౌతుంటే సంధ్య సాయం చేయటానికి వెళ్ళేది. ఆయా బాబు పనులు చూడమని పురమాయించేది. వాడిని ముట్టుకోడానికి, ఆ పనులు చేయటానికి సంధ్య కెలాగో అన్పించేది. వాడివంక భయం భయంగా చూసేది. ఇవేవీ తెలియని బాబు ఎందుకో సంధ్యంటేనే యిష్ట పడేవాడు. ఏదో విధంగా దగ్గర కెళ్ళాలని ఆరాటపడేవాడు.

కుర్రాడు అంటే మాధవ్‌కి యెంత అపురూపమో యింట్లో అందరికీ స్పష్టంగా తెలుస్తూనే వుంది. వాసు మాత్రం ఈర్ష్యని దాచుకోలేక, బైటపెట్టలేక సతమతమౌతున్నాడు.

ఆ రోజు సంధ్య తన గదిలో కిటికీ దగ్గర నిలబడి పరధ్యాసగా బయటికి చూస్తోంది. దూరంగా మామిడి చెట్ల కింద, వాటి నీడలో నిలబడి వాసు గాలిపటం యెగరేస్తున్నాడు. ప్రక్కనే నిలబడి దారపు వుండ పట్టుకున్న బాబు గాలిపటం చూపిస్తూ ఏదో అడుగుతున్నాడు. వాసు విన్పించుకోలేదు. బాబు వాసు చెయిపట్టుకుని గుంజి మరీ అడిగాడు. వాసు విసుగ్గా కసిరాడు. బాబు వెంటనే దారపుండ క్రిందపారేశాడు. వాసు వున్నట్టుండి బాబు వీపుమీద టపటపమని గట్టిగా రెండు చరిచాడు. సంధ్య తెల్లబోయి చూస్తోంది. బాబు వెంటనే యేడుపు లంకించుకున్నాడు. మాధవ్ ఇంట్లోనే వున్నాడు. పిల్లాడియేడుపు వింటే యింకేమైనా వుందా? సంధ్య చూస్తూండగానే యింతలో ఆయా అక్కడికి పరుగెత్తుకు వెళ్ళింది. యేడుస్తున్న బాబుని యెత్తుకుని యేమిటని అడిగింది. వాడు ఒకచేతితో కళ్ళు నులుపుకుని యేడుస్తూనే యింకో చేతితో వాసుని చూపించాడు. ఆయా వాసుని అడిగింది. వాసు నిర్లక్ష్యంగా తల యెగరేసి సమాధానంగా యేదో అన్నాడు. వెంటనే ఆయా వాసురెక్క పట్టుకుని బరబరా లోపలికి ఈడ్చుకువచ్చింది. సంధ్యకూడా ఆదుర్దాగా బయటికి వచ్చింది.

'ఏమిటది? ఏమైంది? ఎందుకేడుస్తున్నాడు?' అప్పటికి మాధవ్ ఆయాకి ఎదురు వెళుతూ అడిగాడు. అతను అప్పుడే తలారా స్నానం చేశాడులా వుంది. పొడిపొడిగావున్న జుట్టు కొద్దిగా నుదుటిమీదికి పడి గాలికి కదుల్తోంది. ఒంటిని షర్టుకి బదులు మీద తువాలుంది.

'దారపువుండ సరిగ్గా పట్టుకోలేదుట. పట్టుకు కొట్టాడు. పిల్లలు ఏమేముంది?' అంది ఆయా.

'ఏం వాసూ?—' అన్నాడు మాధవ్, చేతులు జాపి కొడుకుని అందుకుంటూ.

'అవును కొట్టాను.' వాసు నిర్భయంగా అన్నాడు. వాడి మొండితనానికి సంధ్యకి, ఆయాకి యిద్దరికీ ఆశ్చర్యం వేసింది.

'ఎందుకుకొట్టావు? మీ యిద్దరూ స్నేహంగా ఉండాలని నేను చెప్పలేదూ?—'

'నాకూ వాడికీ స్నేహం ఏమిటి? నేను పెద్దవాడిని, వాడు చిన్నవాడు.'

'అందుకని కొడ్తావా?—'

'కొట్టటంకాదు, అవకాశం దొరికితే చంపేస్తాను. వాడంటే నాకంత అసహ్యం.'

మాధవ్ వాసు దగ్గరగా వచ్చాడు. ఆయాకూడా భయంగా చూస్తోంది.

'అసహ్యం యెందుకో కాస్త వివరంగా తెలియచేస్తారా వాసుదేవ రావుగారూ!—' గంభీరంగా అడిగాడు మాధవ్.

వాసు చురుగ్గా కళ్ళెత్తి చూశాడు. వెంటనే కళ్ళనిండా గిర్రున నీళ్ళు తిరిగాయి. పళ్ళు బిగబట్టి 'అసహ్యంకాదూ? ఈ వెధవ వచ్చినప్పటినుంచి మీరెంత మారిపోయారు? నేను వచ్చినప్పటినుంచి చూస్తున్నాను. నాతో మీరు ఒక్కసారికూడా సరిగ్గా మాట్లాడలేదు, ఒక్క క్షణం కూడా నన్ను దగ్గర కూర్చోపెట్టుకోలేదు. ఎప్పుడూ వాడే-' కంఠం బొంగురుపోవటంతో ఆగిపోయి చప్పున కళ్ళు తుడుచుకున్నాడు.

సంధ్య తెల్లబోయి చూడసాగింది.

మాధవ్ కొద్దిసేపు రెప్పవాల్చకుండా చూచి వెంటనే చెయిజాపి వాసు భుజాలచుట్టూ వేసి దగ్గరకు లాక్కున్నాడు.

'మీరు- మీరు- నన్ను సరిగ్గాచూస్తే నేను వాడిని ఏమీ అనను వాడిమీద నాకేంలేదు.' వెక్కిళ్ళమధ్య అస్పష్టంగా అన్నాడు.

'తెలిసింది, వాసూ! తెలిసింది. పొరపాటునాదే. ఇంకెప్పుడూ అలా చేయనుగా!' వాసు జుట్టులోనికి వేళ్ళుపోనిస్తూ ప్రేమగాఅన్నాడు మాధవ్.

'నేను-నేనుకూడా వాడిని యెప్పుడూ కొట్టను.' అతని చేతికి పెన వేసుకుపోతూ వాగ్దానంచేశాడు వాసు.

ఆయా మెల్లిగా లోపలికి వెళ్ళిపోయింది. సంధ్యకూడా తన గది లోకి తిరిగి వచ్చింది. ఈ సంఘటనతో సంధ్యకి కొత్త సత్యం తెలిసింది. వాసుకి మాధవ్ ప్రేమ అంత అవసరమా? స్వంత అక్క ప్రాణంగా చూసే అభిమానం వాడికి చాలదా? ఆ మాటకొస్తే వాసుని తనకంటే మాధవ్ ఎక్కువ ప్రేమిస్తాడా? అసలు యిదివరకు వాసు తన దగ్గర కూర్చోవాలనికాని, కబుర్లు చెప్పాలనిగాని చూడలేదే? ఒకవేళ యెప్పుడైనా బలవంతంగా కూర్చోపెట్టుకున్నా వాడి మనసు, ప్రాణం రెండూ మాధవ్ దగ్గరే వుంటాయి. భగవాన్! తనేం పాపం చేసిందని వాసుకూడా చివరికి దూరమైపోతున్నాడు! ఇది గుర్తించిన సంధ్య మనసు వికలంకాసాగింది.

# 35

'నన్నాయన స్కూల్లో చేర్పిస్తానంటున్నారు' అన్నాడు వాసు, వుత్సాహంగా అక్కగారి ప్రక్కన వచ్చి కూర్చుంటూ.

'వద్దు.'

'ఎందుకని?' విచిత్రంగా చూశాడు.

'మనకంత డబ్బులేదు.'

'ఆయనిస్తానంటున్నారుగా.'

సంధ్య చర్రుమనిలేచింది. 'తీసుకోటానికి అంతూపంతూ లేదా?'

వాసు ముఖం వాడిపోయింది. గదిలోంచి లేచి బయటకి వెళ్ళిపోయాడు. కాలు నయంకాగానే యెన్ని కలలు కన్నాడు-మళ్ళీ స్కూల్లో జేరవచ్చునని, ఇదంతా పీడకలలా మర్చిపోవచ్చునని, యింకా యెన్ని ఆశలు పెట్టుకున్నాడు. ఇన్ని కష్టాలమధ్య దేవుడిచ్చిన వరంలా మాధవ్ అండ దొరికింది. ఏం? మాధవ్ దగ్గర ఎందుకు తీసుకోగూడదు? ఇప్పుడు ముగ్గురి తిండి అతను భరించటంలా? అసలు తీసుకోనేకూడదు. కాని

తీసుకోటం మొదలుపెట్టిన తర్వాత యెక్కువ, తక్కువ భేదం ఏముంది? ఒక్కరూపాయి తీసుకుంటే ఎంతో పది రూపాయలు తీసుకున్నా అంతే. సంధ్యని యెదుర ప్రశ్నలువేసి తర్కిస్తే మరీ మండిపడుతుంది. మెల్లగా నచ్చచెప్పి ఒప్పించాలి. గదిబయట కాసేపు అటూ ఇటూ తారట్లాడిన వాసు. వెనక్కు తిరిగి మళ్ళీ అక్కగారి దగ్గరకు వచ్చాడు.

'పోనీ అప్పుగా తీసుకుందాం' అన్నాడు.

'తీసుకోగానే సరా! మళ్ళీ తీర్చొద్దూ?—'

'నేను చదువుకుని ఉద్యోగంచేసి తీర్చేస్తాను.'

'మహ తీర్చావులే. ఇప్పుడు తీసుకొన్నదంతా మొదటతీర్చు.'

వాసుకి కోపం వచ్చింది. 'అయితే యెల్లకాలం ఆయన పీకలమీద యిలా కూర్చుని తింటూ వుందాం. అది బాగుంటుంది నీకు.'

'నోర్మూయ్! ఎల్లకాలం ఎందుకుంటాం? ఆ స్థలం మళ్ళీ దున్నించి తోట వేసుకుందాం. ఇల్లు పూర్తికాగానే ఆ యింట్లోకి వెళ్ళిపోదాం. కూర గాయలమీద డబ్బు రావటం ప్రారంభం అవగానే కాస్త కాస్త అప్పు తీర్చేద్దాం.'

'పోనీ అలాగే అనుకుందాం. అదయినా యెన్నాళ్ళు? నువ్విలా బ్రతికివున్నంతకాలం కాయకష్టంచేస్తూ కూర్చుంటావా?'

'ఎప్పుడూ యెందుకు చేస్తాను? నువ్వు పెద్దయ్యేవరకూ చేస్తా నంతే.'

వాసు దిమ్మెరపోయినట్లు చూశాడు. 'నేనా! నావల్ల అవుతుందా? బరువు పనులు యెప్పుడూ చేయకూడదని డాక్టరు చెప్పినమాట మర్చి పోయావా?'

సంధ్య మాట్లాడలేదు.

వాసు బ్రతిమలాడటం ప్రారంభించాడు- 'అక్కా నా మాట విను.'

'ఈ విషయంలో మాత్రం వినదల్చుకోలేదు వాసూ! ఇప్పటికే తప్పనిసరిగా చాలా సహించాను. నే నింక సహించలేను. నాకా శక్తి లేదు.'

'అయితే నేను చదువుకోవటం నీ కిష్టంలేదుకదూ?' నిష్ఠూరంగా

అడిగాడు. సంధ్య మౌనం వహించింది. వాసు ముఖం కోపంతో జేవురించింది.

'అంతేలే. నేను జాగ్రత్తగా కష్టపడి చదువుకుంటానంటే నువ్వు వినవు. ఎలాగో కొద్దిరోజులు కాలం గడుపుకోమంటే గడుపుకోలేవు. ఆ బరువు పనులు నేను చేయలేను. నువ్వు చేస్తుంటే చూస్తూ ఊరుకోలేను. ఎప్పుడో ఓ రోజు నీకు సాయం చేయబోయి నడుంవిరిగి మళ్ళీ మంచంలో పడ్తాను. సరిపోతుంది. అప్పుడు నీ కళ్ళు చల్లగా వుంటాయి.'

'వాసూ!' సంధ్య బిగ్గరగా అరిచింది.

'అయితే నా మొహాన అదే వ్రాసిపెట్టివుంది. అలా జరక్కపోతే చూడు నువ్వు.'

వాసు విసురుగా తలయెగరేసి అక్కడనుంచి వెళ్ళిపోయాడు.

'వాసూ!' సంధ్య వణుకుతూ పిల్చింది. వాసు మళ్ళీ మంచంలో పడటమా? వాడికి పునర్జన్మ యివ్వటంకోసంకదూ తను అభిమానాన్ని చంపుకుంది. వాసు మళ్ళీ మనిషిగా మారటంకోసంకదూ తనకున్న అసహ్యం అణుచుకుంది. లేకపోతే మాధవ్ నీడనైనా తను కన్నెత్తి చూసేదా? ఇదంతా వాసు మళ్ళీ మంచంలోపడి యెప్పటిలా అవిటి బ్రతుకు బ్రతకటానికేనా తను చేసింది.

ఆ రాత్రి వాసు భోజనం చేయలేదు. మూతిముడుచుకుని మంచం మీద పడుకున్నాడు. ఆయా వచ్చి పిలిస్తే 'తంతాను! అవతలకి వెళ్ళు' అని అరిచాడు. సంధ్య స్వయంగా వచ్చి యెంతసేపో బ్రతిమలాడింది. అయినా వినలేదు. చివరికి చదువుకి ఒప్పుకున్నానని అంగీకారం తెలుపుతూ అనుమతి యిచ్చింది. 'నిజంగా!' వెంటనే లేచి అక్కగారి రెండుచేతులూ పట్టుకుంటూ ఆత్రంగా అడిగాడు.

'నిజంగానే!'

'నేను అన్నం తిన్న తర్వాత మళ్ళీ మనసు మార్చుకోవుగా?' అనుమానంగా చూశాడు.

'మార్చుకోను. నువ్వు లేచి భోజనం చెయ్యి.' కఠినంగా అంది సంధ్య. వాసుకి రెక్కలు వచ్చాయి. ఎగిరిపోతున్నాడు. ఆకాశానికి ఎగిరి

పోవాలని తహతహలాడుతూ రెక్కలు కొట్టుకుంటున్న పిట్టని బలవంతంగా పట్టుకుని ఆపాలనుకోటంకంటె వెర్రితనం ఇంకోటిలేదు.

# 36

వాసుని తీసుకెళ్ళి హైదరాబాదులో స్కూలులో చేర్పించి కావలసిన సదుపాయాలన్నీచూసి వచ్చాడు మాధవ్. ఇల్లుకడుతున్న మేస్త్రీ భార్య చనిపోవటంవల్ల యింటిపని ఆగిపోయింది. మాధవ్ యింట్లో భోజనం చేస్తున్న ఋణం ఆయా యెలాగూ ఉంచుకోవడంలేదు. సంధ్య కూడా వుంచుకోదలచుకోలేదు. బాబు పనులన్నీ యిప్పుడు సంధ్యే చూస్తోంది. వాడిని తాకినప్పుడల్లా మనసు పవిత్రంగా అనుభూతి పొందటం మానలేదు. మాతృత్వానికి శాశ్వతంగా దూరమైన మనిషినని గుర్తు రావడంవల్లనా! అందరి ఆడవాళ్ళలా కాకుండా తన జీవితం ఈ విధంగా అష్టవంకరలు యెందుకు తిరిగింది? వాసు వెళ్ళిపోవటంతో వంటరితనంతో శూన్యమైన సంధ్య మనసు మెల్ల మెల్లగా తనకు తెలియకుండానే బాబువైపు తిరుగసాగింది. మాధవ్ కోరుకున్నది— ఎంతో ఓపకగా యెదురుచూస్తున్నదికూడా దీనికోసమే. ఎన్నిసార్లో సంధ్యకి అసలు విషయాన్ని చెప్పాలని ప్రయత్నం చేశాడు. కాని అతను సిద్ధం చేసుకున్న సంభాషణ అంతా సంధ్య కనుబొమ్మలమధ్య ముడి చూడగానే గుర్తుపట్టలేనంత దూరంగా పారిపోయేది.

సంధ్యకి తీరికగా కూర్చుని మాధవ్ ఇంట్లో వుంటున్నానని ప్రత్యేకించి జ్ఞాపకం చేసుకుంటేతప్ప గుర్తురాదు. మాధవ్ సాధారణంగా ఇంట్లో వుండడు. ఉన్నప్పుడుకూడా ఎక్కువకాలం అతను గదిలోనే గడుపుతాడు. నెలకి 20 రోజులు అతను పట్నంలో వుండి చేసే పని యేమిటో సంధ్యకి తెలియదు! రకరకాలుగా వూహించుకుని మరింత అసహ్యించుకునేది. ఏదయినా అతనెక్కువగా ఇంట్లో వుండకపోవటం మాత్రం ప్రాణానికి హాయిగావుంది. తీరిక సమయం అంతా రాట్నం వడకటంతో గడుపుతోంది. ఆ యేకులు అమ్మగావచ్చిన డబ్బు ఆయాద్వారా మాధవ్‌కి అందచేస్తోంది. కానీ అందులో చిల్లి గవ్వకూడా అతను ముట్టుకోలేదని, అదంతా భద్రంగా

ఆయా దగ్గరే వుంచమని చెప్పాడనీ, ఆయా అలాగే దాచివుంచిందనీ సంధ్యకి తెలియదు. రోజులు గడిచినకొద్దీ ఆయాకిమాత్రం మాధవ్ అంటే మాతృత్వంతో కూడిన మమకారం వెల్లువలా పొంగసాగింది. బుద్ధిమంతుడైన అతన్ని సంధ్య భర్తగా స్వీకరిస్తే బాగుండునని మనసులో ఆశించేది. కాని పైకి చెప్పాలంటే సంధ్య ఎక్కడ విరుచుకుపడుతుందోనని లోలోపలే ఆ అభిప్రాయాన్ని దిగమింగి వూరుకుంది. కాని కొద్దిరోజులు యిలాగే అతనితో కలిసివుంటే అతని వ్యక్తిత్వంచూచి యేనాటికైనా ఆకర్షింపబడక మానదనికూడా అనుకునేది. అందుకే భగవంతుడ్ని బలవంతాన ఈ యింట్లో వుండాల్సివచ్చిన పరిస్థితులకి మనసారా నమస్కరించేది.

# 37

అందరిలాగానే బాబుకూడా సంధ్యని పేరుపెట్టి పిలుస్తున్నాడు. అది చూసి మాధవ్ ఓసారి ఒంటరిగా వున్నప్పుడు అలా పిలవకూడదు. తప్పు అని చెప్పాడు.

'మరి యేమని పిలవాలి?' తండ్రి ఒళ్ళో కూర్చుని గడియారంతో ఆడుకుంటున్న బాబు తలెత్తి సూటిగా అడిగాడు.

మాధవ్ క్షణంసేపు తటపటాయించి 'అమ్మా అను' అన్నాడు.

'అమ్మ అంటే?'

మాధవ్ జవాబు చెప్పలేకపోయాడు.

'చెప్పు, అమ్మ అంటే?' ప్రతిదాన్నీ వివరంగా తెలుసుకోవాలనే ఆరాటం వాడికి మహా యెక్కువ. సమాధానం చెప్పేవరకూ వదలడు.

'అమ్మంటే— చాలా మంచిది. అందంగా వుంటుంది. నిన్ను బాగా చూస్తుంది.'

'సంధ్యలాగానా?'

మాధవ్ ఔనన్నట్టు చూశాడు. తదేకంగా తండ్రిముఖంలోకి చూస్తున్నవాడు వేలుజాపి బుగ్గమీద మచ్చవున్నచోట ఆనించి 'ఇదేంటి' అన్నాడు.

మాధవ్ కొడుకువైపు క్షణంసేపు అలాగే చూస్తుండిపోయాడు.

'చెప్పు! పడ్డావా?'

'లేదు.'

'మరి? ఎవరన్నా కొట్టారా?'

మాధవ్ ఔనన్నట్టు తలూపాడు

'ఎవరు?'

'సంధ్య!'

బాబు కళ్ళు ఆశ్చర్యంతో పెద్దవైనాయి. 'ఎందుకు? గాలిపటం చింపావా?'

చింపలేదన్నట్టు చూశాడు మాధవ్.

'మరి తలంటిపోసుకోలేదా?'

అదికూడా కాదన్నట్టు చూశాడు.

'చాకలెట్లు అన్నీ తినేశావా?'

'ఉహుఁ' అడ్డంగా తలూపాడు మాధవ్.

'ఇంకెందుకు కొట్టింది?' ప్రపంచంలో దెబ్బతినటానికి యింకా కారణాలు వుంటాయి, అంటే పసిమనసు నమ్మలేక ఆశ్చర్యపోతోంది.

'నువ్వే అడుగు.'

'ఎవరిని? సంధ్యనా?'

'సంధ్య అనకూడదు అని చెప్పలా.'

'అంటే యేమవుతుంది?'

'కళ్ళు రెండూ పోతాయి.'

క్షణంసేపు తండ్రి కళ్ళలోకి చూసిన బాబు వెంటనే ఒళ్ళోంచి వంటయింటివైపు పరుగెత్తాడు.

# 38

'అమ్మా, అమ్మోయ్!' కొత్తగా నేర్చుకున్న మాటని అప్పటికప్పుడు ఉపయోగించేస్తూ హుషారుగా బిగ్గరగా పిలిచాడు బాబు

ఉతికి ఆరేసినబట్టలు తెచ్చి మడతపెడుతున్న సంధ్య చివ్వున వెనక్కు తిరిగి చూసింది.

'మా నాన్నగారి బుగ్గమీద యెందుకు కొట్టావు?' సీరియస్‌గా అడిగాడు.

సంధ్య చిత్రంగా చూసింది.

'చెప్పమ్మా?'

'అమ్మా!'

'అవును. నీ పేరు సంధ్యకాదు. అమ్మ!' చేతులు కట్టుకుని నీ సంగతి నాకు తెలుసులే అన్నంత ధీమాగా గంభీరంగా అన్నాడు.

సంధ్యకి చాచి చెంప పగలగొట్టాలన్నంతకోపం వచ్చింది

అయినా నిగ్రహించుకుంటూ 'ఎవరు చెప్పారు?' అంది.

'నాన్న-' వాడు వాక్యం పూర్తిచేయలేదు. సంధ్య చేస్తున్నపని వదిలేసి చరచరావచ్చి వాడిరెక్క పట్టుకుని మాధవ్ గదిలోకి యీడ్చుకొచ్చింది.

మాధవ్ ముఖానికి పేపరు అడ్డుంది. చదువుకుంటున్నాడు కాబోలు!

'మీ అబ్బాయికి సరైన మాటలు నేర్పుకుంటే బాగుంటుంది' అంది రోషంగా.

'ఏం చేశాడు?' పేపరు తీసేస్తూ యేం తెలియని వాడిలా ఆశ్చర్యంగా అడిగాడు.

'ఆయాని అమ్మాని పిలిస్తే యెంత అసహ్యం?'

'పసివాడు. ఆయాకీ అమ్మకీ భేదం వాడికేం తెలుస్తుంది?' మాధవ్ :మగా బాబుని దగ్గరకు లాక్కుని రెండు బుగ్గలమీద గట్టిగా ముద్దు ఎట్టుకున్నాడు. సంధ్య యీడ్చుకు రావటంతో బెదిరిపోయిన బాబు తండ్రి మెడచుట్టూ చేతులు పెనవేసి కౌగిలించుకున్నాడు. వాళ్ళిద్దర్నీ అలా స్తుంటే సంధ్య హృదయం ఈర్ష్యతో భగ్గుమంది. వాడంటే మాధవ్‌కి ౹త ప్రాణం యెందుకని! వాడితల్లిని అంతగా ప్రేమించేవాడా! ఆ ప్రేమ ప్రతిఫలం కాబట్టి వాడంటే అంత అపురూపమా? అయినా స్త్రీలోలుడైన మాధవ్‌కి అలాటి సున్నితమైన భావాల విలువలుకూడా తెలుసా?

వికలమైన మనసుతో సంధ్య గదిలోంచి గిర్రున వెనక్కు తిరిగి వెళ్ళిపోయింది

'బాబూ! నీకు అమ్మ బాగుందా- సంధ్య బాగుందా?' కొడుకుని అడిగాడు మాధవ్. బాబు వెనక్కు తిరిగి గదిలోంచి సంధ్య వెళ్ళిపోయిందని నమ్మకంగా తెలుసుకున్న తర్వాత త[illegible]లో రహస్యంగా 'అమ్మే బావుంది' అన్నాడు.

'ఆల్ రైట్. అలాగే పిలు[illegible]

'కాని సంధ్య కొడ్తుందిగా!' [illegible]

'కొట్టదు. కొడితే నాకు చె[illegible]

'ఏం చేస్తావు?'

'సంధ్య చెవులు మెలేస్తాను.'

బాబు కళ్ళలో కుతూహలం కలిసిన సం[illegible]సింది.



ఆ సాయంత్రం భోజనం చేస్తుండగా 'అమ్మా, మంచినీళ్ళు' అన్నాడు చిరాగ్గా.

'నీక్కాదూ చెప్పేది. అమ్మకాదు ఆయా!' మంచినీళ్ళ గ్లాసు తెచ్చి గట్టిగా పెడుతూ కోపంగా అంది సంధ్య.

'ఆయా నాకు బాలేదు.' మొండిగా అన్నాడు.

'ఎందుకని?'

'ఏం బాగుంటుంది? ఆయా అంటే నల్లగా, అసహ్యంగా మీ ఆయాలా వుంటుంది.'

'అమ్మంటే?—'

'నీలా ఎర్రగా బాగుంటుంది.' వాడి ముంగమూతి చూసేసరికి సంధ్య కోపం పటాపంచలైంది. నవ్వు నాపుకుని వాడిబుగ్గ గిల్లుతూ 'అయితే సంధ్యా! అని పిలు' అంది.

'ఉహుఁ!'

'ఎందుకని?'

'కళ్ళుపోతాయి.' బాబు రెండు కళ్ళూ మూసుకున్నాడు. ముద్దొ

స్తున్న వాడిముఖంవైపు అలా తదేకంగా చూస్తుంటే మళ్ళీ అదే బాధ! మనసులో మారుమూల యెక్కడో కలుక్కుమన్నట్టు అన్పిస్తుంది. ఈపసి వాడిమీద తన కెలాటి అధికారం లేదు. ఈ జీవితంలో బాబులాటి వాడికి తనెప్పటికీ జన్మ యివ్వలేదు. ఆ బాధే వాడంటే యేర్పడిన ఈర్ష్యకి అసలు కారణం.

మాధవ్‌మీద యెంత ద్వేషంవున్నా సంధ్య బాబువైపు ఆకర్షింప బడకుండా ఉండలేకపోతోంది. పిలవకుండానే వచ్చి మీదపడి అల్లరి చేస్తూ ఆడక్కుండానే తన చుట్టూ తిరగాలని ఆరాటపడటం సంధ్యకి ఒకోసారి ఆశ్చర్యం అన్పించేది. వాసు చదువుకోసం దూరంగా వెళ్ళి పోపటంతో, వంటరితనంతో కృంగిపోతున్న సంధ్యకి బాబు రాను రాను ఒ లోకంగా తయారవుతున్నాడు. వాడి చురుకుదనం, ముద్దొచ్చే ఆ మాటలు తనకి తెలియకుండానే మనసంతా నిండిపోతున్నాయి ఇప్పుడిప్పుడు ఒక్క అరగంట వాడు కన్పించకపోతే కళ్ళు బాబు కోసం యిల్లంతా గాలిస్తాయి. కొద్దిసేపు వాడు వచ్చి మీదపడి, యేవేవో ప్రశ్నలతో వేధించి విసిగించక పోతే ఏదో ఆగిపోయినట్టే వుంటుంది. ఇదంతా అప్పుడప్పుడూ గుర్తుకు రాగానే సంధ్యకి యెలాగో అన్పించసాగింది. బాబుని బాబుగాగాక మాధవ్ కొడుకుగా చూసి అసహ్యించుకోవాలని అనేక విధాల ప్రయత్నించసాగింది కాని లాభం లేకపోతోంది.

# 38

'ప్రియమైన బావకి-

సుధ నమస్కరించి వ్రాయునది. నేను, పిల్లలు యిక్కడ కులాసా గానే వున్నాం. నీ క్షేమం బొత్తిగా తెలియటంలేదు. నువ్వసలు ఆ పల్లెటూరు వదిలి యిక్కడికి రావటంలేదా? లేక ఒకవేళ వచ్చినా నాకు కన్పించకుండా వెళ్ళిపోతున్నావా? ఈ మధ్య నిన్ను గురించి విన్న కొన్ని వార్తలనుబట్టి నాకు రెండోదే నిజమని అన్పిస్తోంది. బావా! ఇది నిజమేనా? ఎవరో మనిషిని తెచ్చి యింట్లో పెట్టుకున్నావుట? ఇది

ఆయన తనే స్వయంగా కళ్ళారా చూసి వచ్చాను అని చెప్పినా నేను నమ్మలేకపోతున్నాను. పైనుంచి వారు నీ క్షేమం కోరి ఏదో హెచ్చరించబోతే మీదపడి కొట్టినంత పని చేశావుట. ఆయన ఇంటికి వచ్చి యిదంతా చెప్పి నాతో 'నువ్వికనుంచి మీ బావతో రాకపోకలుగాని, ఉత్తర ప్రత్యుత్తరాలు గాని మానెయ్యాలి' అని అంత ఖచ్చితంగా అత్తగారు వాళ్ళముందు చెబుతుంటే దుఃఖంతో, అవమానంతో నా గుండెలు ఎలా పగిలిపోయి నాయో నీకు తెలుసా? అసలయినా అయినవాళ్ళని కూడా నువ్వు అవమానించి పంపించటానికి వెనుదీయనంతటి అప్సరా యిపోయిందా ఆవిడ? అసలు ఆ మనిషి యెవరు? నాకా వూళ్ళో కాస్త చదువు సంస్కారం కలిగిన మనుషులెవరూ కన్పించలేదే? అంటే— నా బావ, పురుష లోకానికే మణిపూసలాంటి వ్యక్తిత్వంగల నా బావ— చివరికి ఓ పల్లెటూరి కులుకులాడికి లొంగిపోయి ఆమె చెప్పుచేతల్లో నడుస్తున్నాడంటే ఆ నిజం నమ్మే బదులు యెందులోనయినా పడి చావటం వుత్తమం అన్పిస్తోంది. అయినా నీకా ఖర్మయేమిటి? అయినింటి పిల్లని చేసుకొని మా అందరిలా పిల్లా, జెల్లాతో సుఖంగా సంసారం చేసుకుంటూ యిలా దిగ జారటం ఏమిటి? ఎంత ఆలోచించినా నాకేమీ అర్థం గావటంలేదు. బావా! ఇప్పుడే చెబుతున్నా! ఆ మనిషి ఎవరో తక్షణం నువ్వు యింట్లోంచి వెళ్ళగొట్టకపోతే స్వయంగా నేనే వచ్చి ఆ పని చేస్తాను. నీ మరదలుగా, నీ చిన్ననాటి స్నేహితురాలిగా, యీ ప్రపంచంలో నీకున్న ఒక్కగా నొక్క ఆప్తురాలిగా నా కర్తవ్యం నాకు తెలుసు. నీ జీవితం ఎలా పక్క మార్గంలో పడిపోతుంటే నేను చూస్తూ వూరుకోలేను. అసలు నువ్విలా అయిపోవటానికి సగం కారణం నేనేనేమో అన్పిస్తోంది. అందుకే నా బాధ్యతని నేను నిర్వర్తించటానికి నిశ్చయించుకున్నాను. ఇప్పుడర్థమవు తోంది. ఆ పల్లెటూరిలో, ఆ నిరక్షరకుక్షుల మధ్య నిన్ను నెలల తరబడి అక్కడే వుండిపోయేలా బంధించుతున్న ఆకర్షణ ఏమిటది [illegible] మాట. బావా! తక్షణం ఆ మనిషిని ఇంట్లోంచి పంపివేయకపోతే నీ [illegible] సుధ చచ్చిపోయినంత ఒట్టు. నా పిల్లలమీద చెయ్యిపెట్టి నేనీ ఒట్టు వేస్తున్నాను. నువ్వా వూరునుంచి మకాం మార్చేసి యిక్కడికి రా! మా

అందరిలో కలిసి తిరుగుతుంటే మళ్ళీ జీవితం దానంతట అదే గాడిలో పడ్తుంది. బావా! నన్నర్థం చేసుకుని నా యీ గుండెలమీద బరువుదించమ్మని ప్రార్థిస్తున్నాను. నా ప్రార్థనని మన్నిస్తావుకదూ! నీ రాకకోసం, నువ్వు చెప్పబోయే ఆ చల్లని వార్తకోసం వేయికళ్ళతో యెదురు చూస్తుంటాను.

నన్ను నిరాశ పరచవనే గాఢమైన నమ్మకంతో-

నీ చిన్నారి మరదలు
సుధ.'

ఉత్తరం చదవటం పూర్తయేసరికి మాధవ్ ముఖం యెర్రబడటమే కాదు, కోపాన్ని బలవంతంగా నిగ్రహించుకున్నట్టు దవడలు బిగుసుకున్నాయి. సుధకి హఠాత్తుగా యిన్ని సంవత్సరాల తర్వాత మళ్ళీ అనురాగం—- అధికారం గుర్తుకురావటం యెంత విచిత్రం? ఉత్తరాన్ని విసుగ్గా మంచంమీద పారేసి లేచి కిటికీ దగ్గరకెళ్ళి నిలబడ్డాడు. పదిరోజుల క్రితం—జ్యోతి పెళ్ళి ప్రసంగం యెత్తబోతే ఖచ్చితంగా తిరస్కరించి, అసలు తనకిప్పుడు పెళ్ళి చేసుకునే వుద్దేశ్యమేలేదని తెలియచేసి, మళ్ళీ జ్యోతి అవమానం పొందినట్టు భావించకుండా మెల్లగా చల్లటి మాటలతో మృదువుగా సేదతీర్చి ఆ రోజు సాయంత్రమే యింటికి తిరిగి వచ్చేస్తున్నాడు. ఊరికి సరిగ్గా ఆరుమైళ్ళ దూరంలో కారుటైర్ బరస్టు అయింది. డ్రైవర్ దిగి మరో టైర్ బిగించే ప్రయత్నం ప్రారంభించాడు. సూర్యాస్తమయం కావస్తోంది. చల్లటి సాయంత్రం. నిర్మానుష్యంగావున్న రోడ్డు. మాధవ్ చేతివాచీ చూసుకున్నాడు. అరగంటపాటు నడిస్తే యిల్లు చేరుకోవచ్చు. వంటరిగా, ప్రశాంతంగావున్న ఆ పరిసరాల్లో అతనికి నడవాలనే అన్పించింది. తన తిరస్కారాన్ని జ్యోతి యెలా తీసుకుంటుందో? ఈ సంఘటనవల్ల ప్రసాద్ కుటుంబంతో తన పరిచయంలో యేమైనా మార్పులు వస్తాయేమోనని ఆ విషయాన్నే పరధ్యాసగా ఆలోచిస్తూ నడుస్తున్న అతను ఆ కొద్దిదూరం యెప్పుడు నడిచేశాడో జ్ఞాపకమేలేదు. ఊళ్ళో ప్రవేశించగానే 'ఆదేంటిదొరా! నడిచి వస్తుండారే?' అని యెవరో పలకరించటంతో వులిక్కిపడ్డాడు.

పొలిమేరదాటి మలుపులు తిరిగి తనయింటి ఆవరణలో ప్రవేశిస్తూనే

తెల్లబోయాడు. ఇంటి వరండాముందు భాస్కరం కారు ఆగివుంది. ఆ రోజు మధ్యాహ్నమే బజారులో భాస్కరం కలిసినప్పుడు 'వుంటారా రెండు రోజులు' అంటే 'ఇవాళమాత్రం వుంటాను' అని జవాబిచ్చాడు. తనతో యేదయినా పని వుంటే అక్కడే చెప్పవచ్చుగా! అయినా అసలు తను హైదరాబాదులోనే వున్నాడని అంత ఇచ్ఛితంగా తెలిసికూడా అత నిక్కడికి రావటంలో గల వుద్దేశ్యం! ఆలోచనలతో— అనుమానంతో అతని కనుబొమలు ముడిపడ్డాయి. ఇల్లంతా బార్లా తలుపులు తెరిచి వున్నాయి. ఎక్కడా శబ్దంలేదు. సంధ్యయేది? భాస్కరం యెక్కడున్నట్టు? వంట యింటివైపు వెళ్ళిన అతనికి వంటయింటి తలుపులు చేరవేసి కన్పిం చాయి. ఇంట్లో ఆయా, బాబుకూడాలేరు. వీళ్ళంతా ఒక్కసారి యిలా తలుపులన్నీ తెరిచేసి యెక్కడికి వెళ్ళినట్టు! వంటయింటి ముందునుంచి వెనక్కి తిరిగి వచ్చేస్తున్న మాధవ్ సంధ్య గుమ్మం ముందు ఆగి పోయాడు. లోపలనుంచి మాటలు విన్పిస్తున్నాయి. తలుపులు వేసివున్నాయి. అతనికెందుకో ఒక్కసారి ఒంట్లోనున్న రక్తం అంతా మరిగిపోయింది. పిడికిలిచాచి తలుపుమీద గట్టిగా కొట్టబోయాడు. అతని చేయి తలుపు దగ్గ రికి వెళ్ళకముందే మధ్యలోనే ఆగిపోయి వాలిపోయింది.

'భాస్కరం! మర్యాదగా దారికి అడ్డులే. తలుపుతీయి.' కోపంగా అంటోంది సంధ్య.

'ఊహుఁ! తియ్యను. నువ్వు నా ప్రశ్నకి సమాధానం చెప్పేవరకూ ఈ గది తలుపులు తెరుచుకోవు.'

'సమాధానం యిందాకే చెప్పాను.'

'నాక్కావల్సింది సమాధానంకాదు. అంగీకారం.'

క్షణం నిశ్శబ్దం.

మాధవ్ బైట బొమ్మలా నిలబడిపోయాడు.

కొద్దిసేపయింతర్వాత కోపాన్ని అణచుకున్న కంఠంతో 'నువ్వి లాటి దుర్బుద్ధితో వచ్చావని తెలిస్తే అసలు యింట్లో అడుగు పెట్టనిచ్చే దాన్నికాదు. ఒకవేళ రానిచ్చినా అలా తెలివితక్కువగా అప్పుడే ఆయాని యేకులు యిచ్చి రమ్మని పంపేదాన్నికాదు' అంది.

భాస్కరం నవ్విన శబ్దం విన్పించింది.

మళ్ళీ సంధ్య అంది. 'మాధవ్‌కి ఈ విషయం తెలిస్తే నీ రక్తం కళ్ళ చూస్తాడు.'

'ఏం? నువ్వు మాధవ్ భార్యవా, అక్కవా, చెల్లివా?—'

'ఏంకాకపోయినా నీలాటి దుర్మార్గుల్లో లేని మంచితనం అతనిలో వుంది.'

'ఓహో! ఏం మంచితనం, సరే. నేనిప్పుడు నీ నోటినుంచి అతని పొగడ్తలు వింటానికి రాలేదు. ఆ సంగతి వదిలేసి మన విషయానికి వద్దాం. నువ్వు నాతో హైదరాబాద్ వచ్చేసినా సరే! పోనీ, నీ కలా యిష్టం లేకపోతే నేనే అప్పుడప్పుడు యిక్కడికి వస్తుంటాను. ఎలాగైనా నువ్వు నాదానివి కావాలి. నువ్విలా మాధవ్ యింట్లో ఉండటానికి వీల్లేదు.'

'నువ్వెవరు చెప్పటానికి?'

'నే నెవర్నా?–' క్షణంసేపు ఆగి,

'నీ జీవితంలో వున్న భయంకరమైన రహస్యం ఒకటి నా చేతిలో వుంది.'

'బెదిరిస్తున్నావా?–'

'ఉహుఁ! నా మాట విని నా దానివి కమ్మని బ్రతిమిలాడుతున్నాను. నువ్విలా మాధవ్‌తో ఒంటరిగా వున్నావని తెలిస్తే మా ఆవిడ ఒక్క క్షణంకూడా నిద్రపోదు. తక్షణం వచ్చి నిన్ను మెడబట్టి బయటికి గెంటితే కాని పచ్చి మంచినీళ్ళుకూడా ముట్టదు. అనవసరంగా ఎందుకు అవమానం పొందతావు? ఆ బావా మరదళ్ళ మధ్య నువ్వెందుకు అడ్డు వెళ్ళాలి?'

'నువ్వు తలుపు తీస్తావా తీయవా!'

'నేను తీయను. కావాలంటే నువ్వు వచ్చి తీసుకో! నాకభ్యంతరం లేదు.'

'నువ్వు అడ్డంతే!–'

'అన్నీ నువ్వు చెప్పినట్టు వినాలని ఎక్కడుంది?–'

'అయితే నేను తీస్తాను.'



మరుక్షణంలో తలుపులీయబోయిన శబ్దం, ఆ వెంటనే 'సంధ్యా నా సంధ్యా' అన్న భాస్కరం గొంతును, 'ఛీ-వదులు. వదులు' అని సంధ్య పెనుగులాట- ఈ రెండింటి మధ్య 'సంధ్యా' అన్న మాధవ్ కంఠం ఫురిమినప్పుడు, అతని చెయ్యి పిడుగుపడ్డట్టు తలుపుని కొట్టటం- అన్నీ ఒక్కసారిగా కలగాపులగంగా జరిగిపోయినాయి.

'సంధ్యా! నిన్నే- తలుపుతీయ్-' మాధవ్ అరిచాడు. అతని ముఖంకూడా చెమటలు పట్టాయి.

వెంటనే తలుపులు తెరుచుకున్నాయి. తెరిచిన తలుపులమధ్య బెదిరిపోయిన కళ్ళతో ఆయాసపడ్తూ సంధ్య నిలబడింది. తనని చూడగానే సంధ్య కళ్ళలో కన్పించిన భావంచూసి వెంటనే ముందుకు అడుగువేసి తన చేతుల్లో వాలిపోతుంది అనే అనుకున్నాడు. కాని సంధ్య ఎంతో ప్రయత్నం మీద నిగ్రహించుకుని గుమ్మంపట్టుకుని ఆగిపోయింది.

'హలో మాధవ్! ఎప్పుడు రావటం?' భాస్కరం నవ్వు తెచ్చి పెట్టుకుంటూ అన్నాడు. మాధవ్ వేలుపెట్టి బైటకిచూపిస్తూ 'ఐదు నిమిషాల్లో నువ్వు యీ యింటి ఆవరణదాటి వెళ్ళిపోవాలి' అన్నాడు.

భాస్కరం కళ్ళు ఆశ్చర్యంతో పెద్దవైనాయి. కోపం తెచ్చి పెట్టుకుంటున్నట్టుగా 'నువ్వింట్లో లేని సమయంచూసి నేనేమీ నీ వస్తువును యెత్తుకుపోవటానికి రాలేదులే! సంధ్యా- నేను- పాతస్నేహితులం. ఏం సంధ్యా?—' అతని వాక్యం పూర్తికానేలేదు. మాధవ్ కాలర్ పట్టి దగ్గరకులాగి గుమ్మంలోనుంచి బయటికితోస్తూ 'గెటవుట్ రాస్కెల్' అన్నాడు! మాధవ్‌కూడా వాక్యం పూర్తిచేయలేదు. భాస్కరం చెయ్యి వచ్చి అతని చెంపమీద చెడేలుమంది. క్షణంలో సగంసేపు గదిలో భయంకరమైన నిశ్శబ్దం యేర్పడింది. అంతే మరుక్షణంలో మాధవ్ ఒకడుగు ముందుకువేసి భాస్కరం షర్టు గుండీలదగ్గర పట్టుకున్నాడు. మొదట భాస్కరం ఆ చెంప ఈ చెంప అదిరిపోయింది. తర్వాత మాధవ్ తోసిన తోపుకు వెళ్ళి గోడదగ్గరగాపడ్డాడు. అతనెలాగో లేవబోతుంటే ఈ లోపల మాధవ్‌వచ్చి పై పట్టుకుని పైకిలాగాడు. అతని కుడిచేయి పిడికిలిగా మారి అతన్ని మళ్ళీ డొక్కల్లో ఆ ప్రక్క యీ ప్రక్క గుద్దింది. భాస్కరం

కిందపడ్డాడు. కోపంతో వివేకం కోల్పోయిన మాధవ్ మళ్ళీ చేయి ఎత్తాడు, కాని అప్పటికే తేరుకున్న సంధ్య కెవ్వుమంటూ వచ్చి అతను యెత్తినచేతిని బలవంతంగా దించేసి దాన్ని గట్టిగా పెనవేసుకుని పట్టుకుంది. ఊపిరి పీల్చుకోటానికి ఆగిన మాధవ్‌కి స్పృహ తెలిసి తను చేసినపని గుర్తుకు వచ్చింది.

'మీరు— మీరు అతన్ని చంపేశారు' అంది సంధ్య యేడుస్తూ.

'ఏం లేదు.' మాధవ్ సంధ్యచేతిని వదిలించుకుని వంటయింటి వైపు వెళ్ళాడు. అతను నీళ్ళగ్లాసుతో తిరిగివచ్చేసరికి సంధ్య మోకాళ్ళ మీద కూర్చుని భాస్కరం భుజాలుపట్టి వూపుతూ 'భాస్కర్ - భాస్కర్' అంటోంది.

'కొద్దిగా నీళ్ళు తాగిస్తే సరి, అతనే సరి అవుతాడు.'— తనుకూడా మోకాళ్ళమీద కూర్చుని నీళ్ళు తాగించబోయాడు. సంధ్య అతనివైపు తీక్షణంగా చూసి అతనిచేతిలో గ్లాసుని విసురుగా లాక్కుంది. 'భాస్కర్, భాస్కర్!' అని మృదువుగా పిలుస్తూ యెలాగో నీళ్ళు తాగించింది. క్షణం సేపు సంధ్యవేపు భాస్కరంవేపు మార్చి మార్చి చూసిన మాధవ్ తర్వాత మెల్లిగా అక్కడనుంచి లేచి వెళ్ళిపోయాడు. అతని నాలికకూడా పొడారి పోయింది. అతనికికూడా దాహం వేస్తోంది.

వంటయింట్లో మంచినీళ్ళు తాగినవెంటనే అతను బయటికి రాలేక పోయాడు. చెప్పలేనంత నీరసం- తనమీద తనకే అర్థంలేని కోపం- తన బలహీనతకి సిగ్గు- అన్నీ కలిగాయి.

అతను తిరిగి వచ్చేసరికి భాస్కరం లేచి సంధ్య సాయంతో హాల్లోకి వెడుతున్నాడు.

'భాస్కరం ఈ పూట యిక్కడ వుండిపోకూడదూ?— ఎలా డ్రైవ్‌చేస్తావు?'— సంధ్య ప్రతిమలాడుతోంది.

'ఇంకా యిక్కడా?' భాస్కరం సంధ్యచేతిని విదిలించిపారేసి తూలుతూ కారుదగ్గరికి వెళ్ళిపొయ్యాడు. మరో ఐదు నిమిషాల్లో కారు వెళ్ళిపోయింది.

'డ్రైవరు యింకా రానట్టున్నాడే!' అన్నాడు మాధవ్.

రిప్పైన తిరిగిచూసిన సంధ్య కోపంతో, రోషంతో మండిపడ్తూ 'మీరు- మీరు యింతవరకూ ఒకందుకే సమర్థులు అనుకున్నాను. ఇప్పుడు తెలిసింది, అవసరం ఆయితే హత్యచేయటానికికూడా వెనకాడరని'— అంది.

'సంధ్యా!' వెనక్కి తగ్గినట్టు చూశాడు.

'భాస్కరం బ్రతికి బయటపడటం యివాళ నా అదృష్టం.' సంధ్య విసురుగా లోపలికి వెళ్ళిపోయింది.

మాధవ్ అక్కడే నిలబడిపోయాడు చాలాసేపు.

ఆ సంఘటన ఫలితం- ఈరోజు సుధ వ్రాసిన ఉత్తరం. ఒకవేళ అన్నట్టుగానే సుధ వచ్చి యిక్కడ యేదయినా గొడవచేస్తే- అతని పెద వులమీద కఠినమైన చిరునవ్వు కదిలింది. రానీ! వస్తే, ఇంతవరకూ తెలి యని సత్యం ఒకటి తెలుసుకుని వెడుతుంది.

'అయ్యగారేరి?- ఎక్కడున్నారు?-' అని బయట విన్పించ టంతో కిటికీ దగ్గరగా చాలాసేపటినుంచీ అలాగే నిలబడిపోయి ఆలోచిస్తూ వున్న మాధవ్ వులిక్కిపడ్డాడు.

'గదిలో వున్నారు. ఎందుకు?—' ఆయా జవాబిస్తూ ప్రశ్నకూడా వేసింది.

'కావాలి పనుంది.' ఆదుర్దాగా అన్నాడు గోవిందు. మాధవ్ అప్ప టికే గది గుమ్మంలోకివస్తూ 'ఏమిటి గోవిందూ!' అని అడిగాడు.

గోవిందు బట్టలన్నీ దుమ్ముకొట్టుకుని వున్నాయి. ముఖంనిండా చెమటలు కారుతున్నాయి. మనిషి పరుగెత్తుకు వచ్చినట్టు ఆయాసపడుతూ రొప్పుతున్నాడు.

ఆతను మాధవ్‌ని చూడగానే 'మీరు— మీరు— వెంటనే రావాలి. తూర్పువీధిలో సాలెవాళ్ళు— కమ్మరివాళ్ళు కొట్టుకుంటున్నారు, పెద్ద దొమ్మీ జరిగేట్టు వుంది' అన్నాడు.

'ఎందుకు?— పద— పద—' మాధవ్ చెప్పులన్నా వేసుకోకుండా గోవిందుతో త్వరత్వరగా బయటికి వెళ్ళిపోయాడు.

* * * *

'సంజోయ్! సంజా! వాసు మామయ్య దగ్గరనుంచి ఉత్తరం వచ్చింది.' బాబు గుమ్మంలో నిలబడి గదిలోకి తొంగిచూస్తూ బిగ్గరగా అన్నాడు.

'ఎక్కడా! ఏదీ? ఇలా తీసుకురా!' మంచంమీద పడుకుని పాత పుస్తకం యేదో తిరగేస్తున్న సంధ్య పుస్తకం చప్పున ప్రక్కకు విసిరేసి కూర్చుంది.

'ఇదిగో!'

'ఇక్కడకు తీసుకురా!' అసహనంతో పిలిచింది.

'ఉహుఁ' బాబు అడ్డంగా తలతిప్పి ఉత్తరం వెనక్కి దాచుకున్నాడు.

సంధ్య లేచి వచ్చింది. బాబు దూరంగా పరుగెత్తాడు.

'మా బాబువికదూ! మంచివాడమ్మా!' బ్రతిమలాడింది.

'ఉహూ నన్నంటుకుంటే ఇస్తా!' సంధ్యని కవ్వించటం, దేనికో దానికోసం పరుగెత్తించటం వాడికి సరదా. అదో పెద్ద ఆట.

సంధ్య చేసేదిలేక బాబువైపు వచ్చింది. బాబు కొద్దిసేపు అందకుండా అటూ ఇటూ పరుగెత్తాడు. చివరికెలాగో వాడిని అందుకుని పొదివి పట్టుకుని ఉత్తరం లాక్కుంది. కవరు చించేవుంది. అంటే మాధవ్ చదివి పంపించాడన్నమాట. మొదట తనకివ్వకుండా అతను చదివినందుకు కోపం వచ్చింది. కవరులోంచి ఆత్రంగా ఉత్తరం తీసిచూస్తూనే ఆగిపోయింది. దస్తూరి వాసుదికాదు. ఇంకెవరిదో! గుండ్రంగా పెద్దగా వుంది. సంధ్య దృష్టి సంబోధన చూసి ఆగిపోయింది. అది సుధ మాధవ్‌కి వ్రాసింది. తను చదవకూడదు అని మనసు హెచ్చరించేలోపలే కళ్ళు రెండూ అక్షరాల బారులవెంట పరుగెత్తాయి.

మొదలుపెట్టిన ఉత్తరం పూరిగా చదవకుండా ఉండలేకపోయింది. సాంతం ముగించేసరికి ముఖంలో కత్తివాటుకు నెత్తురు చుక్కలేనంత తెల్లగా పాలిపోయింది. ఒక్కొక్క వాక్యం ఒక్కొక్క శూలం.

ఒక్కొక్కరకమైన అవమానంతో! ఏం చెయ్యాలి తను! తెలిసి తెలిసి యింత హీనమైన పరిస్థితుల్లో యీ యింట్లో యెందుకుండాలి?

'సుధ్యే యింట్లో వంటరిగా వున్నావని తెలిస్తే మా ఆవిడ ఒక్క క్షణంకూడా నిద్రపోదు. పచ్చి మంచినీళ్ళుకూడా ముట్టదు. అనవసరంగా ఆ బావా మరదళ్ళ మధ్య నువ్వెందుకు అడ్డు?' భాస్కరం హెచ్చరిక గుర్తుకు వచ్చింది. మొన్న ఇక్కడ మాధవ్‌చేత అవమానం పొందిన భాస్కరం లేని రంగులు పూసి వికృతమైన అర్థం కల్పించి భార్యకు చెప్పి వుంటాడు. ఒకవేళ అన్నట్టుగానే సుధ వస్తే? రానీ! ఏమంటుందో తను స్వయంగా చూస్తుంది. సంధ్య మనసు చేదుపదార్థం తిన్న వెగటుతో విల విల లాడసాగింది. బాబు యెప్పుడో అక్కడనుంచి వెళ్ళిపోయాడు. చాలా సేపయింతర్వాత లాంతరు వెలిగించి తెచ్చి హాల్లో మధ్యగావున్న యినపతీగకి వ్రేళ్ళాడదీయబోతున్న ఆయా చేతిలో వుత్తరంతో రెప్ప వేయకుండా శూన్యంలోకి చూస్తున్న సంధ్యనిచూసి తెల్లబోతూ,

'సంధ్యా!' అని పిలిచింది. సంధ్య కళ్ళు యాంత్రికంగా ఆయా వైపు తిరిగాయి.

'ఇదేమిటి అలా ఉన్నావేం? ఎక్కడినుంచి ఆ ఉత్తరం?—' ఆత్రంగా అడిగింది.

'ఇది— ఇది— మనకికాదు' ఆయా మాటల్తో యీ లోకంలోకి వచ్చిన సంధ్య లేచి నిలబడుతూ అంది.

'అందులో యేమైనా విశేషం వుందా?—' అనుమానంగా చూసింది ఆయా.

'ఊహుఁ! బాబు యేడి? ఏం చేస్తున్నాడు?'

'ఇప్పుడే అన్నంతిని లేచాడు.' ఆయా లోపలికి వెళ్ళింది.

సంధ్య వంటయింటివైపు వచ్చింది. బాబు అన్నం తినడం పూర్తి చేసి అక్కడే ఆయా వేసిన అన్నం తింటున్న నల్లపిల్లి తోక పట్టుకుని లాగుతున్నాడు. అది మ్యావ్ మ్యావ్ అని అరుస్తోంది.

'బాబూ! ఈ వుత్తరం యెక్కడినుంచి తెచ్చావో అక్కడ పెట్టేరా!—' అంది.

'నేను పెట్టను! నువ్వే పెట్టు!' మొండిగా అన్నాడు.

'మంచివాడివికదూ!—' సంధ్య కంఠం ఆ పలికే తీరు విని బాబు తలెత్తిచూశాడు. తర్వాత యేమనుకున్నాడోయేమో పిల్లితోక వదిలేసి చేయిజాపి వుత్తరం తీసుకున్నాడు. ఏ సమయంలో సంధ్యని ఆడించాలో, ఏ సమయంలో చెప్పినట్టు వినాలో వాడికి బాగా తెలుసు.

'తీసినచోటే పెట్టాలి, మర్చిపోకూడదు.' సంధ్య వెనకనుంచి హెచ్చరించింది. వాడు అలాగేనని తలూపి తండ్రి గదివైపు పరుగెత్తాడు.

* * * *

ఒంటినిండా దుమ్ముతో, చెదిరిపోయిన జుట్టుతో, బట్టలమీద అక్కడక్కడా రక్తపు మరకలతో, నుదుటిమీద గాయంతో మాధవ్ నీరసంగా విసుగ్గా యింటికి తిరిగివచ్చాడు.

హాల్లోనే యెదురై ఆదుర్దాగా ప్రశ్నిస్తున్న ఆయాకి తగాదా ఆగిపోయిందని, తనకి తగిలిన దెబ్బ పెద్దదేమీకాదని ధైర్యం చెప్పి కొద్దిగా వేడినీళ్ళు, శుభ్రంగా వుతికివున్న టవలుతెచ్చిపెట్టమని తన గదిలోకి వెళ్ళాడు.

అతను గదిలో అడుగుపెట్టేసరికి బాబుగది మధ్యగా నిలబడి నోట్లో వేలుంచుకుని ప్రశ్నార్థకంగా చూస్తూ గదంతా దేనికోసమో కలయజూస్తున్నాడు.

'ఏమిటి బాబూ, ఏం కావాలి నీకు?-' కొడుకువైపు సరిగ్గా చూడకుండానే మంచంవైపు వెళతూ అన్నాడు.

తండ్రి మాట వినగానే గిరుక్కున వెనక్కు తిరిగిన బాబు 'మరే-మరే, ఈ వుత్తరం తీసినచోట పెట్టమని సంధ్య చెప్పింది. మరేమో! నాకేమో, యెక్కడినుంచి తీశానో నాకు తెలియటంలేదు.'

మంచంవైపు వెళ్ళి దానిమీద కూర్చోబోతున్న మాధవ్ చివ్వున వెనక్కి తిరిగిచూసి 'ఏమిటా వుత్తరం?' అన్నాడు.

'ఇదే! వాసు మామయ్య రాసింది!' అమాయికంగా తండ్రి దగ్గరగా వచ్చి వుత్తరం చూపిస్తూ అన్నాడు.

'ఇదెక్కడిది? ఎవరు యిచ్చారు నీకు—' కోపంగా అడిగాడు.

ఎన్నడూలేంది తండ్రి కళ్ళెర్ర చేయటంచూసి బిత్తరపోయిన బాబు 'నేను యిచ్చాను. మరే వాసుమామయ్య రాసాడుగా- అందుకని.'

'సంధ్య కిచ్చావా యిది?—'

బాబు అవును అన్నట్టు తలూపాడు.

మాధవ్ నీళ్ళు కారిపోతూ మంచంమీద కూలబడ్డాడు. సంధ్య ఈ వుత్తరం చదివిందా! అతనికి విపరీతమైన నీరసంతోపాటు వుత్తరం అక్కడలా వదిలేసి వెళ్ళిన నిర్లక్ష్యానికి తనమీద తనకు అంతులేని ఆగ్రహంకూడా కలిగింది.

'మరే— మరే—' బాబు యేదో చెప్పబోయాడు!

'నన్ను విసిగించకు—అవతలకి వెళ్ళు.' మాధవ్ మళ్ళీ కసరటంతో బాబు వాడిపోయిన ముఖంతో తల ప్రక్కకువాల్చుకుని అక్కడనుంచి వెళ్ళిపోయాడు.

పది పదిహేను నిమిషాల తర్వాత ఆయా వేడినీళ్ళు— టవలుతెచ్చి యిచ్చింది.

'ఎందుకట తగాదా? యేమైంది?' అంది వివరాలు అడుగుతూ.

'ఏంలేదు, యేదో పిల్లలు ఆటమధ్య మొదలై ఆడవాళ్ళు ఒకళ్ళని ఒకళ్ళు తిట్టుకుని కుటుంబాల గురించి యెత్తిపొడుపుగా మాట్లాడుకోవడం వరకూ వెళ్ళింది. అంతలో మగవాళ్ళకి రోషం వచ్చేసి నువ్వెంతంటే నువ్వెంత అనుకున్నారు.' ముక్తసరిగా జవాబు చెప్పాడు మాధవ్. అతని మనసంతా సంధ్యచుట్టూ తిరుగుతోంది.

'సంధ్య ఏది? ఏం చేస్తోంది?' భోజనానికి కూర్చోబోయేముందు పట్టలేక అడిగేశాడు. అతనింటికి వచ్చినప్పటినుంచి యెక్కడా అలికిడి కూడా విన్పించలేదు.

'తలనొప్పిగా వుందిట పడుకుంది' అంది ఆయా. సంధ్య తలనొప్పికి కారణం ఆయాకి తెలియకపోవచ్చు. అతను గ్రహించకుండా యెలా వుంటాడు?

రాత్రి పొద్దుపోయింతర్వాత పడుకోబోయేముందు ఆయా తెచ్చి

యిచ్చిన వేడిపాలు తాగి గ్లాసు తిరిగి యిచ్చేస్తూ 'సంధ్య ఫోంచేసిందా?' అని అడగలేక అడిగాడు.

'లేదు తలనొప్పి తగ్గలేదుట.' ఎన్నడూలేంది మాధవ్ అర గంటలో రెండుసార్లు సంధ్యని గురించి అడగటంచూసి ఆయా లోలోపల ఆశ్చర్యపోతూ అంది.

'పిలవమంటారా, ఏమైనా పనుందా?—' గుమ్మందాటి వెళ్ళబోయే ముందు వెనక్కితిరిగి చూస్తూ అడిగింది.

'వద్దు, వద్దు ఊరికే అడిగాను.' పడుకుంటూ అన్నాడు. అంత పంతం యింకేం అంటాడు? పైకి నిదానంగా యథాలాపంగా అన్నట్టు వద్దన్నా అతనికి ఆ క్షణంలో వెళ్ళి సంధ్యని బలవంతంగా మంచంమీద నుంచి లేపి భుజాలుపట్టి కుదిపి అసలు విషయం అంతా చెప్పేసి పూర్తిగా అర్థం చేసుకునేలాగా తనచేతుల మధ్యనుంచి వదలకూడదని బలంగా అనిపించింది. కాని అతనికి తెలియని అజ్ఞాతశక్తి ఏదో బందీసుడినిచేసి నిర్లిప్తంగా ఉండేలా చేసింది.

'ఇదిగో! ఏం కావాలి? అని అడిగితే చెప్పటంలేదు. ఇందాకటి నుంచి నిద్రపోకుండా తనలో తను ఒకటే యేడుపు' ఆయా బాబుని యెత్తుకొచ్చి మంచందగ్గర దింపుతూ అంది.

'ఎందుకు ఏడుస్తుంట? ఏం బాబూ-' మాధవ్ ఆత్రంగా కొడుకుని రెండుచేతులూజాచి యెత్తి గుండెలమీదకి లాక్కున్నాడు. బాబు సమాధానంగా తండ్రి గుండెలకి కరుచుకుపోయి మరింతబావురు మన్నాడు.

'ఎందుకు? ఎవరన్నా యేమైనా అన్నారా?' మాధవ్ ఆదుర్దాగా ఆయావైపు చూశాడు.

'ఇప్పటివరకూ బాగానే వున్నాడు మరి!' భయం భయంగా అంది ఆయా.

'ఎందుకో నాకు చెప్పు నా బాబువికదూ?' గుండెలకి హత్తు కుంటూ అనునయంగా అంటున్న మాధవ్‌కి హఠాత్తుగా యింత క్రితం తను కసరటం, బాబుముఖం దించుకుని వెళ్ళిపోవటం గుర్తుకొచ్చింది.

వసిహృదయం రోషపడి వుంటుంది. ఎంత సున్నితం! బాబు బాహ్య రూపంలో తన పోలికలు చాలావున్నా స్వభావంలో మాత్రం సంధ్య పోలికలు యెన్నో కన్పిస్తాయి. మాధవ్‌కి ఆ క్షణంలో మరో గదిలో భోజనంవద్దని అలిగిపడుకున్న సంధ్యనికూడా యిలాగే దగ్గరకి లాక్కుని గుండెలమీద తల ఆనించుకుని ఓదార్చి సేద దీర్చాలనిపించింది.

# 39

మనిషి మానసికంగా ఓ విధమైన పరిపూర్ణతని సంపాయించుకున్నప్పుడు జీవితాన్ని గురించిన ఆలోచనలతో ఆవేశం తగ్గిపోతుంది. రోజులు యాంత్రికంగా వెళ్ళిపోతాయి. కాలం గడిచినకొద్దీ ఆశయాలమీద, ఉద్రేకం మీద అంతర్గతం సంపాయించుకున్న అనుభవం, వేదాంతపుతెరని దింపేస్తుంది. చేసే ప్రతిపనిపట్లా ఓ విధమైన ఉదాసీనత- ప్రవర్తనలో ఓ రకమైన నిశ్చలత్వం వచ్చేస్తాయి. సుఖదుఃఖాలకి అతీతంగా నిలబడిన మనసు వేటికీ చలించదు.

ప్రస్తుతం మాధవ్‌కూడా అదేస్థితిలో వున్నాడు. రోజులు గడిచిన కొద్దీ సంధ్యని చేరుకోగలను అనే ఆశ హారతికర్పూరంలా హరించుకుపోతోంది. బాబుద్వారా సంధ్యని పొందాలని అనుకున్న మాధవ్ ఆ ప్రయత్నం ఫలించకపోగా బాబునికూడా పోగొట్టుకుంటున్నానేమో అనే భయంతో కుమిలిపోసాగాడు! అతను ఆశించింది నిజమే. బాబు సంధ్య ఆప్తులయ్యారు. ఇప్పుడు వరుసగా నాలుగైదురోజులు తండ్రి కన్పించకపోయినా బాబు బెంగపడడు. వాడు సంధ్య దగ్గర బాగా అలవాటుకావాలని యే వంకతో దూరం దూరంగా వుండేవాడో ఆ వంకే బాబుని శాశ్వతంగా దూరంచేస్తోంది. తను ఆశించింది లభించిందనే తృప్తి అతనికి యేమీ లేకపోగా పైనించి విపరీతమైన అశాంతితో మనసు విలవిలలాడసాగింది. సంధ్య తన చుట్టూ గీసుకున్న గిరినుంచి ఒక్కడుగు ముందుకు వేయకుండానే బాబుని అందులోకి లాక్కుంది. బయట నిలబడిపోయిన మాధవ్ తనకి ఆ పరిధిలో ప్రవేశించే అర్హతలేనందా యెప్పటిలాగా బయట

వంటరిగా నిలబడిపోయాడు. సంధ్య మనసులో అతనిపట్లవున్న ద్వేషం దోసగింజంతకూడ తగ్గలేదు. ఓ విధంగా విజయం పొందిన మాధవ్ యింకో రకంగా చిత్తుగా ఓడిపోయాడు.

రాత్రింబవళ్ళు బంతుల్లా దొర్లిపోతున్నాయి. రోజులు చక్రంలో ఆకుల్లా గిర్రునతిరిగి వస్తున్నాయి. సంవత్సరాలు యిట్టే గడిచిపోతాయి. విపరీతమైన వేగంతో పరిభ్రమిస్తున్న యీ కాలచక్రంవైపు చిన్న పిల్లవాడిలా విహ్వలంగా నిశ్చేష్టుడై చూస్తూ నిలబడిపోవడం తప్ప అతనేం చేయలేకపోతున్నాడు. శారీరకంగా దార్ఢ్యం తగ్గకపోయినా అతనికి మానసికంగా వార్ధక్యం వచ్చేసినట్టు అన్పించసాగింది.

సంధ్య కాలుపెట్టిన వేళావిశేషమో, లేక బాబు పేరు బలమో తెలియదు కాని మాధవ్ వ్యాపారంలో ఒకచేతితోవేస్తే పది చేతులతో అందుకోవాల్సినంత లాభం తెచ్చి అందిస్తోంది. అతను యేదిపట్టినా బంగారం అవుతోంది. కాని యేం లాభం? మనిషికి మనశ్శాంతి కొనియివ్వలేని ఆ డబ్బును అతనేం చేసుకుంటాడు? అందుకే బాబు పేరుమీద బ్యాంక్‌లో భద్రపరుస్తున్నాడు.

ఆ రోజు మాధవ్ రాబోతున్న దసరాకి బాబుతోపాటు యింట్లో అందరికీ బట్టలు తెచ్చియిచ్చాడు! నాలుగురోజులక్రితం అతని కళ్ళముందు జరిగినసంఘటన శూలంలా అతని హృదయాన్ని తూట్లు తూట్లుగా పొడుస్తోంది.

ఆ రోజు అతను భోజనం ముగించుకుని గదిలోకూర్చుని పేపరు చూసుకుంటున్నాడు. బాబు అక్కడే కూర్చుని ఆడుకుంటున్నాడు. సంధ్య యేదో పనిమీద ఆ గదిలోకివచ్చి అక్కడ మాధవ్‌ని చూసినవెంటనేవెనక్కి తిరిగివెళ్ళబోయింది ఇంతలో బాబుపరుగెత్తుకెళ్ళి 'అమ్మా!' అంటూ కొంగు పట్టుకున్నాడు. సంధ్య వదిలించుకు వెళ్ళబోయింది. బాబు వదల్లేదు. పైనుంచి నవ్వుతూ మరింత గట్టిగా పట్టుకుని తనవైపు లాగాడు. అసలే పాతచీర. అప్పటికే కాస్త చిరిగివుంది కాబోలు! బాబు పట్టుకులాగగానే

ప్రక్కన గుండెల మధ్యకి చిరిగి వూడివచ్చింది. క్షణంసేపు కొయ్యబారి పోయిన సంధ్య వెంటనే రెండుచేతులు వక్షానికి అడ్డుపెట్టుకుంది. తన చేతుల్లోకి వూడివచ్చిన చీరనిచూసి బాబు పకపకా నవ్వాడు. మాధవ్ తెల్లబోయి చూస్తున్నాడు. సంధ్య వెంటనే వంగి బలంగా వాడి వీపుమీద ఒక్కటి చరిచి గిరుక్కున తిరిగి మెరుపులా వెళ్ళిపోయింది.

మాధవ్ లేచివచ్చి యేడుస్తున్న బాబుని దగ్గరకు తీసుకుని సముదాయించాడు.

"ఆ సాయంత్రం భోజనంచేసి చేయికడుక్కుని యివతలకి వస్తుంటే వంటయింటి గుమ్మం పక్కన నిలబడిన సంధ్య తలవంచుకుని కాలిబొటన వేలు నేలమీద వ్రాస్తూ "క్షమించండి" అంది.

"ఎందుకు?" ఆశ్చర్యపోతూ అడిగాడు.

"చీర చిరిగిపోయిందనే కోపంతో బాబును కొట్టాను. అది నా తప్పే!"

"నీ కా హక్కు వుంది." ఇంకోమాటకి అవకాశం ఇవ్వకుండా అక్కడినుండి వచ్చేశాడు. మర్నాడు అదే చీర కుట్టుకుని సంధ్య కట్టుకోవటం చూసిన అతని మనసు క్రుంగిపోయింది.

అందుకే యీ రోజు ఆయాతోపాటు ధైర్యంచేసి సంధ్యకికూడా చీరలుతెచ్చాడు. ఎక్కువ ఖరీదు పెట్టికొంటే విసిరి ముఖంమీద కొడ్తుందని భయం. అందుకే మామూలు చీరెలు తెచ్చాడు.

"ఏమిటవి?-" అంది సంధ్య చీరలున్న పెట్టె తెచ్చి యిచ్చేస్తూ. అందులో వున్నవి చీరలని యిద్దరికీ తెలుసు.

"నీకే!" గోడవైపు తిరుగుతూ అన్నాడు. సంధ్య ముఖంలో కన్పించబోయే భావం అతనికి తెలుసు. అదిచూసి భరించగలిగే శక్తి రోజురోజుకి సన్నగిల్లుతోంది. ఈ మధ్య మరీ దిగజారిపోతున్నాడు.

"నా కెందుకు?" నొసలు చిట్లించింది సంధ్య.

"దసరాకి యింట్లో అందరికీ బట్టలుతెస్తూ నీకూతెచ్చాను. అందులో ప్రత్యేకత యేమీలేదు." కనీసం అలా అంటేనైనా తీసుకుంటుందేమోనని ఆశ.

"ఓహో!"

సంధ్య నిర్లక్ష్యంగా అన్న 'ఓహో' అతనిగుండెల్ని నిర్దాక్షిణ్యంగా చీలుస్తుంది. అది భరించగల శక్తి అతనిలో యింకిపోతోందని సంధ్యకెలా తెలుస్తుంది! ఇంకా ఎన్నిరోజులు తన కీ నరకం? అణువణువునా ఈ చిత్రహింస యింకా యెన్ని యుగాలు! మాధవ్ బిగబట్టి నిలబడ్డాడు.

"మీరు ప్రత్యేకత చూపించారా, లేదా అని నేను అడగటానికి రాలేదు. ఇవి నా కనవసరం అని చెప్పి వెళ్ళటానికి వచ్చాను." ప్యాకెట్ మంచంమీద పడేసి వెళ్ళిపోబోయింది.

వెంటనే యిటు తిరిగిన మాధవ్ చేయిపట్టి ఆపాడు. సంధ్య ఫులిక్కిపడటం అతను గమనించకపోలేదు. "సంధ్యా! ఒక్కటి అడుగుతాను జవాబు చెప్పు" అన్నాడు.

సంధ్య మాట్లాడలేదు. వెనక్కు తిరగలేదు. నిటారుగా అలాగే నిలబడిపోయింది.

"నామీద అసహ్యంవుంటే ప్రతీకారం యెందుకు తీర్చుకోవు? కనీసం నోరుతెరిచి నా ముఖంమీద యెందుకు చెప్పవు? అడుగడుగునా నీ నిర్లక్ష్యంతో యిలా కాస్త కాస్త యెందుకు చంపుతావు నన్ను?"

సంధ్య మాట్లాడలేదు.

"చెప్పు, సంధ్యా! చెప్పు!" చెయ్యి మరింత బిగించి పట్టుకుంటూ అడిగాడు.

అప్పటికీ సంధ్య నోట్లోంచి మాటరాలేదు.

"నేను నీకు అన్యాయం చేసినమాట నిజమే! నేను కాదనటంలేదు. అది గుర్తించి నీ జీవితం చక్కదిద్దాలని యెంత ప్రయత్నం చేస్తున్నానో నువ్వు గ్రహించవెందుకు?"

"...... ....."

"మాట్లాడవేం? నాకా అవకాశం యెందుకివ్వవు?"

"నాకిష్టం లేదు. ఎవరేం చేసినా నేను పోగొట్టుకున్నది తిరిగి పొందలేను. కాబట్టి నా కవసరంలేదు."

ఇద్దరిమధ్య నిశ్శబ్దం ఏర్పడింది. చెయ్యి వదిలేస్తున్నాడు అనుకుంది. అతని చేతివేళ్ళు వదులు అయినట్టే అయి వెంటనే మరింత బలంగా

బిగుసుకున్నాయి. రెండోచేయి భుజంమీదవేసి బలంగా గిరుక్కున తన వైపుకు తిప్పుకున్నాడు. అనుకోకుండా చేసిన యీ పనితో సంధ్య అతని గుండెల దగ్గరగా ముఖాముఖి వచ్చింది.

క్షణంసేపు యిద్దరూ ఒకళ్ళ కళ్ళల్లోకి ఇంకోళ్ళు తీవ్రంగాచూస్తూ నిలబడిపోయారు.

"సంధ్యా! ఇప్పుడే చెప్పుతున్నా! ఎంతకాలం ఓపికపట్టాలో అంత కంటే ఎక్కువే ఓపిక పట్టాను. ఇక నా చేతకాదు. నువ్వు నన్ను స్వక మంగా నీ జీవితంలో ప్రవేశించ నివ్వకపోతే బలవంతంగా ఆ పని చెయ్యాల్సి వస్తుంది. నన్ను రెచ్చగొట్టకు. అది నీకు మంచిది కాదు."

సంధ్య కళ్ళలో నిప్పులు కురుస్తున్నాయి.

"ఇప్పుడు మీరలా చెయ్యండి యేముంది? చదువు నెపంతో వాసుని దూరంచేశారు. మంచితనం యెరగా చూపించి ఆయాని లొంగ దీసుకున్నారు. నోరు తెలియని పసిపిల్లాడితో అమ్మా అని పిలిపించటంలో మీ ఉద్దేశం ఏమిటి? మీ మనసులో వున్న నీచభావం నేను గ్రహించలేదనా? నా కింక మీరు చేసే చెడు యేముంది? సింహంతో మేకపిల్ల కలియబడ లేదని తెలుసుకోలేని మూర్ఖురాలిని కాదు. దిగజారిన నా పరిస్థితులు ఆధా రంగా తీసుకుని, అవసరంలో ఆదుకున్నాను అనే నెపంతో నానుంచి మీరు ఏంకోరినా కోరవచ్చు. మీ పశుబలంతో నా శరీరాన్ని మళ్ళీ లొంగ తీసుకుంటే తీసుకోవచ్చు. కాని-కాని-ఎప్పటికీ నా కంఠంలో ప్రాపిరి ఉండగా నన్ను-నన్ను నా మనసుని గెలుచుకోలేరు.

"సంధ్యా!" మాధవ్ వెన్నుపోటుతిన్న మనిషిలా చెయ్యి వది లేశాడు. సంధ్య వెంటనే గిరుక్కున వెనక్కు తిరిగి వెళ్ళిపోయింది. ఆ వెళ్ళటంలో ఖంగారుగాని, భయంగాని లేదు. సగర్వంగా, మహారాణిలా, ఠీవిగా తలెత్తి మెల్లిగా వెళ్ళిపోయింది.

మాధవ్ నీరసంగా మంచంమీద కూలబడిపోయాడు. ముఖంనిండా చిరుచెమటలు అలుముకున్నాయి. ఆ నిమిషంలో చూడలేదు కాని చూస్తే సంధ్యమనసుకూడా నీరు కారిపోయేంత దీనంగా ఉంది అతని ముఖం. భగవాన్! ఏం చెయ్యాలి! ఇద్దరిమధ్య ఉన్న యీ అఘాతం పూడే ఉపా యమే లేదా? భయంకరమైన బ్రహ్మరాక్షసి మెల్లిమెల్లిగా నోరు తెరిచి

పెద్దది చేసినట్లు నానాటికి పెరుగుతోంది. కాని తరగటం లేదే! దీన్ని దాటటం యెలా? ఒకవేళ యెలాగో జీవితాన్ని పణంగానైనాపెట్టి అతి ప్రయాసతో అవతలికి చేరితే సంధ్య నిర్దాక్షిణ్యంగా మళ్ళీ అందులోకి తోసేస్తుందేకాని ఆప్యాయతతో దగ్గరికి తీసుకోదు. అది యీ రోజుతో స్పష్టంగా తెలిసిపోయింది. ఆడవాళ్ళు సుకుమారులు, సున్నిత స్వభావులు అంటారే! సంధ్య మనసులో నాజూకుతనం అనేది లేదా? పాషాణంగా కఠినంగా వున్న యీ సంధ్యలో ప్రాణంపోసి సజీవంగా చేసేదెలా? యెలా? అది అతనికి సాధ్యం కాదన్న మాటేనా? సంధ్యని చేరుకోవాలనే తన ప్రయత్నంలో అపజయమే వ్రాసిపెట్టివుందా! భగవాన్! నేనేం చెయ్యను?

మాధవ్ మనసులో ఎక్కడో హృదయాంతరాళంలో బైలుదేరిన ఈ జ్వాల మెల్లగా ప్రాకి అంతయి యింతయి అన్నట్టు హృదయం అంతటా ఆక్రమించుకోసాగింది. భగవంతుడు తను చేసిన ఆ అపరాధానికి శిక్షించ లేదని, పైనుంచి సకల సంపదలు యిచ్చి ఆశీర్వదించాడని అపోహపడ్డాడు. ఎంత భ్రమ! వడ్డీతోసహా తీరుస్తున్నాడు. కేవలం సంధ్యని చేరుకొని యీ నరకం అనుభవించడానికే రాంగోపాలరావుగారి ఆస్తి తనకు సంక్రమించినట్టుంది. ఇంత డబ్బుంది. జీవితం సకల విధాల అనుభవించ టానికి యిన్ని అవకాశాలున్నాయి. కాని తనేమైనా సుఖం అనేది యెరుగు న్నాడా! అతని మనసు వేయి రంపాలతో చీల్చి ఛిన్నాభిన్నమైన ఆ ముక్కల్ని అశాంతి అనే అగ్నిలో కాలుస్తున్నట్టు అన్పించసాగింది.

# 40

పై సంఘటన జరిగిన తర్వాత మాధవ్ సంధ్యకి చాలా దూరంగా ఉండటం ప్రారంభించాడు. అతను పైకి యెంత మామూలులా వున్నట్టు నటిస్తున్నా లోపల్లోపల బ్రద్దలవుతున్న అగ్ని పర్వతాలు-హాటి దావాన లం మెల్లగా అతని ఆరోగ్యాన్ని హరించించి. మనిషి రంగు తగ్గిపోయాడ కళ్ళక్రింద నల్లటి చారలు యేర్పడినాయి. శరీరం చిక్కిపోయింది. ఆ

యీ మార్పు కనిపెట్టలేకపోలేదు. కాని, కారణం వూహించలేకపోతోంది. ఎన్ని విధాల అతనిద్వారా అసలు సంగతి రాబట్టాలని ప్రయత్నించినా లాభం లేకపోయింది. సంధ్యకూడా మామూలుగానే వుంది. ఆ రోజూ ఆ సంఘటన తర్వాత అతని ప్రవర్తనలో యెలాటి మార్పూ రాకపోవటం చూసి మనసులో ఆశ్చర్యపోయింది.

దశరా శెలవులకి వాసు ఇంటికి వచ్చాడు. వాసు వున్న ఆ నాలుగు రోజులు సరదాగా యిట్టే గడిచిపోయినాయి. బాబు అంటే వాసుకి ఇప్పుడు బోలెడంత ప్రాణం అది గాకుండా బాబు మాధవ్ దగ్గరకంటె సంధ్య దగ్గరే యెక్కువ కాలం గడపటం అతని దృష్టిని దాటిపోలేదు. అందుకు మనసేమీ ఈర్ష్యతో ముడుచుకు పోలేదు సరికదా, పైనుంచి ఆనందంగా కూడా అన్పించింది. ఆ వున్న కొద్దిరోజులు వాసు మాధవ్ వెంటే నీడలా వున్నాడు.

రేపు ఉదయం వెళ్ళిపోతాడనగా ఆ రాత్రి వాసు అక్కగారి దగ్గరకు వచ్చి కూర్చున్నప్పుడు "అక్కా! ఆయనెందుకు అంత చిక్కిపోయారు?" అన్నాడు.

"ఏమో! నాకేం తెలుస్తుంది?" నిర్లక్ష్యంగా అంది సంధ్య. వారం రోజుల క్రితం జ్యోతి పెళ్ళి శుభలేఖ వచ్చింది. మాధవ్ పెళ్ళికి వెళ్ళలేదు. బహుశా ఆ కోపమో, నిరాశో కారణం కావచ్చు.

"నాకేం తెలుస్తుంది?"

"నీకు కాకపోతే యింకెవరికి తెలుస్తుంది? ఆయా, నువ్వూ ఇంట్లో ఉండి ఏం చేస్తున్నారు?" వాసు కోపంగా చూశాడు.

సంధ్య మాట్లాడలేదు.

"ఎందుకోగాని ఆయన మునుపటిలా లేనేలేరు. ఒంట్లో బాగాలేదా అంటే బాగానే ఉంది అంటారు. బాగానే ఉంటే అంత చిక్కిపోవటం దేనికి? మరి! అంత నిశ్శబ్దంగా, పరధ్యాసగా ఉండటం నేనింతవరకూ చూడలేదు. లోపల్లోపల యేదో అశాంతితో బాధపడుతున్నారు. మనకి పైకి చెప్పటం లేదుగాని-" వాసు దిగులుగా తనలోతను అనుకుంటున్నట్టు అన్నాడు.

సంధ్య వింటూ కూర్చుంది. వాసు మళ్ళీ మొదలుపెట్టాడు.

"మీ రసలు ఆయనతో చనువుగా మాట్లాడనే మాట్లాడరు. నువ్వు మరీను " నిష్ఠూరంగా అన్నాడు.

"నన్నేం చెయ్యమంటావు?"

"ఏం చెయ్యమంటా వేమిటి? చల్లగా ఒక చిరునవ్వు నవ్వవు. స్నేహంగా ఓ చిన్నమాట మాట్లాడవు. ఆయనలా అవటానికి సగం కారణం నువ్వే అయివుంటావు."

"నోర్ముయ్!"

"ఇన్నాళ్ళూ మూసుకునే ఉన్నానుగా. ఆయన మనకెంత చేశారు? ఎన్ని విధాలుగా ఆదుకున్నారు! నీకు కాస్తకూడా కృతజ్ఞత లేదు."

"వాసూ!"

"వాసూ అని నువ్వలా బిగ్గరగా అరిస్తే నేనేం భయపడను. ఆయనలా యెందుకున్నారూ అంటే తెలియదట. ఆ మాట అనటానికి నీకు సిగ్గెలా అన్పించటం లేదు? ఆయన ఇల్లు మన స్వంత ఇల్లులా వాడుకుంటున్నాం. ఆయన డబ్బు స్వంత డబ్బులా ఖర్చు పెడుతున్నాం. ఆయన మనసులో బాధ ఏమిటో తెలుసుకోవటానికి మాత్రం పరాయివాళ్ళం. ఆయన ఒంట్లో కనీసం బాగుందో లేదో తెలుసుకోవాలనే మర్యాదకూడా మనకి లేదు."

"వాసూ! నువ్వు దయవుంచి యిక్కడినుండి వెళ్తావా?--" పాలిపోయిన ముఖంతో బిగబట్టి అడిగింది సంధ్య.

"కానీ-నీకు-నీ కిది మంచిది కాదు అక్కా! క్రిందటి జన్మలో యెవరినో ఇలాగే విపరీతంగా బాధపెట్టి వుంటావు అందుకే ఈజన్మలో-" వాసు హఠాత్తుగా ఆగిపోయాడు.

అప్పటికే సంధ్య కళ్ళు పెద్దవిచేసుకొని చూస్తోంది. వాసు వెంటనే తగ్గిపోయి "అక్కా! పొరపాటయింది క్షమించు, క్షమించవూ" అంటూ దగ్గరగా రాబోయాడు.

"నువ్వు ముందు యిక్కడనుంచి బైటకి వెళ్ళు. పో! ఊ—" సంధ్య వేలు పెట్టి గుమ్మంవైపు చూపించింది.

"అక్కా! నాది పొరపాటయిందని చెబుతున్నానుగా! ఏదో వాగేశాను. నేను వట్టి మొద్దుని, గాడిదని, చవటని—" దగ్గరగా రాబోయాడు.

"ఛీ, నా దగ్గరకు రాకు." సంధ్య గర్జిస్తూ వాసుని విసురుగా తోసేసి హఠాత్తుగా మంచంమీద పడి వెక్కి వెక్కి ఏడవసాగింది.

మంచంమీద సంధ్య ప్రక్కగా కూర్చుని యిది అంతా చూసిన బాబు ఒక్క వురుకులో మంచం మీద నుంచి దిగి గదిలోంచి తుర్రున పరుగెత్తాడు.

# 41

"నాన్నా! నాన్నా! సంధ్య యేడుస్తోంది."

"ఎందుకు?" గదిలో కూర్చుని యేవో కాగితాలు చూసుకుంటున్న మాధవ్ వాటిల్లోంచి తలెత్తి ఆదుర్దాగా అడిగాడు.

"మరే—మరే—వాసేమో-మరే సంధ్యనేమో-మరే-"

"నువ్వెళ్ళి చప్పున వాసుని రమ్మంటున్నానని పిలుచుకురా-"

తండ్రి నోట్లోంచి మాట వచ్చీ రాకముందే బాబు మళ్ళీ పరుగెత్తాడు! సంధ్య ఏడుస్తోందా? యెందుకు? యేమైంది? దగ్గరగా వెళ్ళి వెంటనే విషయం ఏమిటో తెలుసుకోవాలని ఆత్రుత పడుతున్న మనసును కళ్ళెం వేసి పట్టి ఆపాడు. ఏం ప్రయోజనం! వెడితే మరింత అసహ్యించు కోవట మేగా?

వాసు వచ్చాడు.

"ఏమిటి వాసూ!" కాగితాలు ప్రక్కన పెడుతూ అడిగాడు.

వాసు ముఖం పాలిపోయింది. మాధవ్ దగ్గరగా వచ్చి చెయ్యి "పట్టుకుంటూ" అక్క ఏడుస్తోంది. నేనెంత చెప్పినా వినటం లేదు. మీరు వెళ్ళి కొంచెం మాట్లాడండి!" అన్నాడు దీనంగా.

"ఎందుకు? ఏమైంది? ఏమన్నావు నువ్వు?" నిస్సహాయంగా అడిగాడు మాధవ్.

వాసు యేమన్నానని చెప్తాడు! అందుకే ఊరుకున్నాడు.

"చెప్పు వాసూ! ఏమన్నావు?" లాలనగా అడిగాడు. తర్వాత మెల్లిగా బుజ్జగిస్తూ ఒకటికి రెండుసార్లు అడిగి చెప్పమని బలవంతం చేస్తే వాసు జరిగిన సంభాషణ అంతా చెప్పాడు.

"ఎంత పొరపాటు చేశావు వాసూ! సంధ్యమనసు చాలా సున్నితం అన్న సంగతి ఎలా మరచిపోయావు?" దగ్గరకు లాక్కుంటూ అన్నాడు. వాసు మనసులో సంఘర్షణ అతను అర్థం చేసుకోలేకపోలేదు.

"మర్చిపోలేదు. కాని మీరు? మీరింత మంచివారు. ఇంత సహాయం చేశారు. అది అక్క యెందుకు గుర్తించదు?" బాధగా వాసు ఏడుపు ఆపుకుంటూ అన్నాడు.

"అది నా దురదృష్టం. కాని-నీకు సహాయం చేస్తున్నది- సంధ్య గుర్తించాలని, సంధ్యచేత నేను గౌరవించబడాలని కాదు వాసూ!"

"నాకు తెలుసు. అందుకే నాకింత బాధ. అది గుర్తుకు వస్తేనే అక్కమీద కోపం వస్తుంది. నిజానికి మీ అండ లేకపోతే మేము యేమయి పోయేవాళ్ళం! తలచుకుంటేనే భయం వేస్తుంది. అక్కని నేను మాత్రం కాని మాటలు యేమన్నానో మీరే చెప్పండి. మన కింత సహాయం చేసిన మనిషితో కాస్త చనువుగా వుండాలని గుర్తుచేయటం తప్పా!"

"వాసూ!" మాధవ్ ఆప్యాయంగా వాసు వీపుమీద నిమురుతూ వుండిపోయాడు. వాసు చూపించే ఆత్మీయతలో సంధ్య కనీసం వెయ్యో వంతయినా చూపిస్తే తనకి యెంత తృప్తి! లేదు-లేదు. సంధ్య ఆప్యాయతకి తను అర్హుడు కాదు. అది మర్చిపోతున్నాడు తను.

కొద్దిసేపయిన తర్వాత మాధవ్ బాబుని ఎత్తుకొని వాసుతో సంధ్య గదిలోకి వచ్చాడు. సంధ్య యింకా అలాగే దిండులో ముఖం దాచుకొని వెక్కి వెక్కి ఏడుస్తోంది.

"సంధ్యా!" మాధవ్ పిలిచాడు. బాబు తండ్రి చేతిల్లోంచి క్రిందకు జారి సంధ్య దగ్గరకు పరుగెత్తాడు.

"సంధ్యా! క్షమించు!" వాసు తరపున తను కోరుకుంటున్నట్టు అడిగాడు.

"మీరే-మీరే-వాడిని రెచ్చగొట్టి-" సంధ్య మాట పూర్తి చేయనే లేదు.

"అబద్ధం అన్నీ నేనే అన్నాను." వాసు కోపంగా అరిచాడు.

"హుష్-" మాధవ్ వాసు చేయిపట్టి వెనక్కు లాగాడు.

"నేనేదయినా అనదల్చుకుంటే సూటిగా నిన్నే అడుగుతాను.

ఇన్నాళ్ళ పరిచయంలో ఈ కాస్తయినా నువ్వు తప్పకుండా అర్థం చేసుకొని వుంటావు. నా మీద నీ కెంత అసహ్యం వుందో నాకు తెలుసు. అది యెప్పుడూ మర్చిపోను. నన్నెంత ద్వేషించాలనిపిస్తే అంతా ద్వేషించు. అందులోనైనా నాకు మనశ్శాంతి దొరికితే నేను భరిస్తాను. అంతేగాని వాసు మాటలు పట్టించుకోకు."

తలాతోకాలేని యీ సంభాషణ వాసుకి అంతుపట్టలేదు. ఇంతలో ఆయా అక్కడికి రావటంతో మాధవ్ గదిలోంచి వెళ్ళిపోయాడు. విషయం ఏమిటో స్పష్టంగా తెలియకపోయినా సంధ్య మాధవ్‌ల మధ్య యీ వివాదానికి యేదో కారణం వుందని అన్పించింది వాసుకి. కాని యెంత ఆలోచించినా అతనికి అదేమిటో అంతు పట్టటం లేదు.

# 42

వాసు స్కూలుకు వెళ్ళిపోయాడు. మాధవ్ యీ మధ్య పూర్తిగా యింటిపట్టున వుండటం మానేశాడు. సంధ్యకోసం కట్టిస్తున్న యిల్లుకూడ పూర్తి కావస్తోంది. ఒకసారి యీ యింట్లోంచి కాలు బైట పెట్టటం అంటూ జరిగితే అది శాశ్వతంగా తన జీవితంనుంచే నిష్క్రమించటం అని అతనికి తెలుసు. కొత్త యింట్లోకి వెళ్ళగానే ఆ యింటి తలుపులు తన ముఖంమీద టపీమని మూసెయ్యటానికి సంధ్య ఏ మాత్రం సంకోచించదు. ఓటమి ఒప్పుకోవటానికి యిష్టపడని అంతరాత్మ యెదురు తిరుగుతోంది. బలవంతంగానైనా సరే సంధ్యని పొందితీరాలని పట్టుబడుతోంది. లేకపోతే యిన్నాళ్ళ ఈ నిరీక్షణకి, ప్రాణం అంతా చిక్కపట్టుకొని భరించిన ఈ సహనానికి అర్థమే లేదంటోంది. చరమజీవితం అంతా అశాంతితో, వెలితిగా బ్రతకటం కోసమేనా గతాన్నంతా గరళంలా మింగుతూ వచ్చింది అంటూ నిలదీసి ప్రశ్నిస్తోంది. చాలా రోజులనుంచి అతను మనస్సుని అదుపాజ్ఞలలో వుంచుతూ వచ్చాడు. ఈనాడు ఆ మనసే ఎదురుతిరిగి అతన్ని శాసించడం మొదలుపెట్టింది. నువ్వు చూపిన అనురాగం అర్థం చేసుకుని అర్ధాంగి అవటానికి యిష్టపడకపోతే అధికారంచూపి బలవంతంగా బానిసగానైనా సరే ఆకట్టుకోమని హెచ్చరించసాగింది. అను

క్షణం దగ్గరగావుండే సంధ్యని పొందలేకపోయిన అతని అహం ఏ అత్యాచారానికి రెచ్చగొడుతుందో అని భయపడి దూరదూరంగా వుండసాగాడు. ఎప్పుడో ఏ పది ఇరవై రోజులకో ఓ పూట వచ్చి ఉండి బాబుని చూసి ఇంట్లోకి కావల్సిన అవసరాలు తీర్చి వెళ్ళిపోతున్నాడు.

దాదాపు ఇరవై రోజుల తర్వాత హైదరాబాదునుంచి ఆరోజే ఇంటికి వచ్చిన మాధవ్ సాయంత్రం అవుతుండగానే నది ఒడ్డున షికారు తిరిగి రావటానికి వెళ్ళిపోయాడు.

అతను తిరిగి వచ్చేసరికి ఇంట్లోంచి కేకలు విన్పిస్తున్నాయి. ఎప్పుడూ లేంది సంధ్య గొంతు బిగ్గరగా వినిపిస్తోంది. మాధవ్ అప్రయత్నంగా వంట యింటివైపు నడిచాడు. అతని చెవులు శ్రద్ధగా ఆలకిస్తున్నాయి.

"వీపు బద్దలు కొట్టాలి. జున్ను ఒక్కసారిగా అంతా తినేస్తే జబ్బు చేస్తుందని చెప్పలేదూ!" చెయ్యి ఎత్తుతూ అంటోంది సంధ్య.

"కొత్తావంటే చూస్కోమరి! నాన్నతో చెప్తా!" బాబు తర్జని చూపిస్తూ బెదిరించాడు. వాడి మూతినిండా బుగ్గల వరకూ జున్ను అంటి వుంది. స్టూలుమీద నిలబడివున్నాడు. దానిమీదికి ఎక్కి అల్మైరా తలుపులు తెరచినట్టున్నాడు.

క్షణంసేపు వాడివైపు తీవ్రంగా కోపంనటిస్తూ చూసిన సంధ్య వాడిముఖమూ, ఆ నిలబడినతీరూ చూసి ఆపుకోలేక ఫక్కుమని నవ్వేసింది. నవ్వేస్తూనే రెండు చేతులుజాపి వాడిని దగ్గరకు లాక్కుని నుదుటిమీద గట్టిగా ముద్దు పెట్టుకుంది. బాబుకూడ నవ్వుకున్నాడు.

"ఛీ, పో! నీ ఎంగిలంతా నా కంటించకు" మళ్ళీ కోపం గుర్తుచేసుకుంటూ దూరంగా తోసింది. బాబు వదల్లేదు. సంధ్య మెడచుట్టూ చేతులు పెనవేసి బుగ్గమీద ముద్దిచ్చాడు. వాడిని మోచేతి దూరంలో నిలబెట్టి క్షణంసేపు తదేకంగా చూసిన సంధ్య వెంటనే దగ్గరకు లాక్కుని గుండెలకి హత్తుకుంది. బాబు కిలకిలా నవ్వుతున్నాడు. మాధవ్ చప్పున వెనక్కు తిరిగి వచ్చేశాడు. వాళ్ళిద్దరూ కలిసి ఆనందంగా ఏకమైవున్న ఆ చిత్రం అతని హృదయంమీద ఎన్నటికీ చెరగనంత గాఢంగా హత్తుకుపోయింది. కొన్నిరోజులనుంచి అతన్ని రాత్రింబవళ్ళు వేధిస్తున్న సమస్యకి సమాధానం

లభించింది. బాబు సంధ్యకి ప్రాణంతో సమానం అయిపోయాడనటానికి ఏ మాత్రం సందేహంలేదు. తండ్రిని గుర్తు చేయకుండా వాడు వాడుగానే సంధ్య మనసులో స్థానం ఏర్పరచుకోగలిగాడు. వాడిని అలా అనామకుడిగా వదలివేయటమే మంచిది. మళ్ళీ నీ కొడుకే అనిచెప్పి పరిస్థితులు ఎలా వుంటయో చూసే ఓపికగాని, వాటి ఎగుడుదిగుళ్ళని భరించేశక్తిగాని అతనికి లేదు. తండ్రి లేకపోతే బాబు సంధ్యకి మరింత చేరువవుతాడు అనటం అతిశయోక్తికాదు.

నిశ్శబ్దంగా యింట్లోంచి వెళ్ళిపోయిన మాధవ్ తిరిగి తిరిగి రాత్రి చాలా పొద్దుపోయిం తర్వాతగాని యింటికి చేరుకోలేదు.

ఆయాకి రెండురోజులనుంచి ఒంట్లో బాగాలేదు. అలాటి సమయాల్లో సాధారణంగా యింటిపనంతా సంధ్యమీదనే పడుతుంది.. ఆ రాత్రి తన మంచంమీద నిద్రపోయిన బాబుని మాధవ్ గదిలో పడుకోబెట్టటానికి తీసుకువెళ్ళింది సంధ్య. ఊళ్ళో వున్నప్పుడు బాబు తండ్రి దగ్గరే పడుకోవటం అలవాటు.

నిద్రపోతున్న బాబుని భుజంమీద వేసుకుని తీసుకెళ్ళేసరికి మాధవ్ టేబుల్ముందు కూర్చుని వ్రాసుకుంటున్నాడు. బాబుని పడుకోబెట్టి వచ్చినంత నిశ్శబ్దంగా వెళ్ళిపోబోయింది.

"సంధ్యా!" ఉన్నట్టుండి వెనుకనుంచి వినిపించింది.

చెయ్యిపట్టి లాగినట్టే ఆగిపోయింది సంధ్య.

"నేను రేపు ఊరు వెళ్తున్నా."

వింటూ నిలబడిపోయింది.

"డబ్బదీ బీరువాలో పెట్టాను–" అతను వాక్యం పూర్తి చేయలేదు.

"ఆయాని పంపిస్తా" అంటూ గుమ్మం దాటబోయింది.

"ఆగు. ఈసారి బాబు బాధ్యత నీకే అప్పగించదల్చుకున్నాను." అతని స్వరం చాలా నిర్వికారంగా నిశ్చలంగా వుంది.

"బహుశా నేను చాలా రోజులవరకూ తిరిగిరాను. ఏదయినా కావాలంటే గోవిందుచేత కంపెనీకి కబురుచెయ్యి."

సంధ్య గుమ్మంలో అలాగే నిలబడి వింటోంది.

గదిలో నిశ్శబ్దం ఏర్పడింది.

క్షణాలు గడిచినాయి! నిశ్శబ్దాన్ని చీల్చుకుంటూ వచ్చింది అతని స్వరం. "సంధ్యా నేను చాలాదూరం వెడుతున్నాను. బాబు జాగ్రత్త."

సంధ్య తిరిగిచూడకుండా ఉండలేకపోయింది. ఏమిటి అతని ఉద్దేశ్యం? ఎందుకీ అప్పగింతలు.

భుజంమీదుగా కొద్దిగా తలతిప్పి చూసిన సంధ్యకి మాధవ్ లాంతరు వత్తితగ్గిస్తూ ఎక్కిస్తూ దానివైపే రెప్పవాల్చకుండా చూస్తూ కన్పించాడు.

ఆశ నిరాశల్లా వస్తూపోతున్న ఆ వెలుగునీడల మధ్య అతని ముఖంలో ప్రశాంతతతోపాటు ఏహో కఠినత్వంకూడా కన్పిస్తోంది.

సంధ్యకి ఏదైనా చెప్పాలనిపించింది. కాని ఏం చెప్పాలో తోచక నోరు పెగలలేదు.

"అంతే! ఇంకేంలేదు." అని అతను మళ్ళీ రాసుకోవటంలో మునిగిపోయాడు.

ఇక నువ్వు వెళ్ళవచ్చు అన్నట్లుంది అతని స్వరం. తర్వాత ఆ గదిలో యింకా ఎలా నిలబడటం. సంధ్య అందుకే మెల్లిగా బైటకి వచ్చింది కాని కాలు ముందుకు సాగలేదు. ఈరోజు అతనికి ఏమైంది? ఎందుకలా మాట్లాడుతున్నాడు? తొణుకు బెణుకులేని ఆ కంఠస్వరం. రాయిలా కఠినంగావున్న ఆ ముఖం గుర్తుకురాగానే సంధ్య మనసంతా ఎలాగో అయింది. సాధారణంగా అతనలా ఉండడు. బిజినెసులో ఏమైనా నష్టం వచ్చిందా! లేక పాతస్నేహాలేమైనా వుకితాళ్ళలా మెడకి ఎగుసుకుపోతుంటే ఎలా వదిలించుకోవాలో తెలియక తికమక పడుతున్నాడా? ఏమిటి అసలు కారణం? ప్రస్తుతం అతను ఎలాటివాడయినా కానీ, విశిష్టమైన అతని వ్యక్తిత్వం అంటే ఆమెకి గౌరవం వుంది. అతనిలో ఆ స్త్రీలోలత్వమే లేకపోతే పురుషజాతికే మణిపూస లాటివాడు. అయినా మనిషిఅన్న తర్వాత ఏదోరకమైన బలహీనత లేకుండా ఎలా వుండటం? అతని ప్రవర్తనకి స్వయంగా అతనే కారణం కాకపోవచ్చు. అది వంశ పారంపర్యంగా లభించిన వారసత్వమో! ఒక్కొక్కసారి అలా కూడా అవుతుంది!

ఇన్ని రోజుల యీసాన్నిహిత్యంలో మానసికంగా అతనిపట్ల ఎంత ద్వేషంవున్నా ఒక్కనాడు కూడా ఇతని ముఖంమీద తేలికగా మాట్లాడలేకపోయింది. అప్పుడప్పుడు ఏమిటి తనలో బలహీనతకి కారణం అని

తర్కించుకునేది కూడా. ఎంత వెతికినా సమాధానం దొరికేదికాదు. చివరికి కొంతమంది మనుష్యులంతే -వాళ్ళెంత దుర్మార్గులైనా ముఖంమీద పట్టుకుని హీనంగా దూషించలేం-వాళ్ళ ముఖవర్చస్సు అలాటిది అని సరిపెట్టుకునేది. అతను ఎలాటివాడయినా కాని సుఖంగానే వుండాలి. అతని మూలంగా తన జీవితం ఛిన్నాభిన్నమై ధూళిలో కలిసిపోయినమాట నిజమే. అయినా సరే అతను హాయిగా, నిశ్చింతగా ఉండాలనే తను కోరుకునేది. జరిగిందేదో కేవలం తన దురదృష్టంవల్లే జరిగింది- అని ఎందుకు అనుకోకూడదు? ఈ జీవితం అంటే ఏమిటి? మన పాపపుణ్యాలు బేరీజువేసి భగవంతుడు మన చేతికిచ్చి పంపే చద్దిమూట. ఒక్కొక్క మూటలో పంచభక్ష్యపరమాన్నాలుంటాయి. మరి కొంతమంది మూటలలో చాలీచాలని మెతుకులే వుంటాయి. ఇంకా కొందరి మూటల్లో పుచ్చి పురుగులు కారుతున్న కుళ్ళిపోయిన పళ్ళే వుంటాయి. ఎవరిగీత వాళ్ళది. నా కన్యాయం జరిగింది అని గుండెలు బాదుకుంటే ఏం లాభం? ఈ జీవితంలో ఛేదని ఏడిచే కాలంలో వెయ్యోవంతయినా సరే మంచి మాటలకి, మంచి పనులకి వినియోగిస్తే కనీసం వచ్చే జన్మకయినా మంచిది దొరుకుతుంది. దొరుకుతుందనే ఆశ కలుగుతుంది. మాధవ్‌ని తాను ఎందుకు ద్వేషించాలి!

మొట్టమొదటిసారిగా తనకు అలాటి ఆలోచన రాగానే సంధ్యకెలాగో అన్పించింది. చాలా సేపటినుంచి అతని గది బైట నిలబడిపోయాను అనే సంగతికూడ గుర్తుకు రావడంతో సిగ్గుపడి గబగబా అక్కడినుంచి వెళ్ళిపోయింది.

మంచంమీద కూర్చుని పడుకోటానికి దిండ్లు సరిచేసుకుంటుండగా గదిలో చిన్న స్టూలుమీద పెట్టిన మరచెంబుమీద కళ్ళు పడగానే అతని గదిలో మంచినీళ్ళు పెట్టలేదని గుర్తుకువచ్చింది. బాబు అర్ధరాత్రివేళ లేచి యిబ్బందిపడాలి. అసలె ఎలాగో వున్నాడు.

సంధ్య మంచినీళ్ళు తెచ్చేసరికి గది తలుపులు బార్లా తెరిచేవున్నాయి. లోపల లాంతరు వెలుగుతూనే వుంది. మాధవ్ మాత్రం టేబిల్‌మీదికి ఒరిగిపోయి దానిమీద రెండుచేతులు జాచుకుని మోచేతి దగ్గర ముఖం దాచుకొని వున్నాడు. అనుకోకుండా అతన్ని ఆ విధంగా చూడటంతో వులిక్కిపడిన సంధ్య తెల్లబోయి గుమ్మంలో అలాగే బొమ్మలా

నిలబడిపోయింది. ఇదేమిటి? ఏమైంది యితనికి. ఎందుకలా వున్నాడు- అన్న ప్రశ్నలు వెంటనే వచ్చినాయి. ఇదివరకు అవివేకతనంతో మంచంలో వున్నప్పుడు వాసుకూడా యిక యీ బ్రతుకు యింతే అని గుర్తుకువచ్చి నప్పుడు అచ్చు ఇలాగే నిరాశ నిస్పృహలతో నిర్జీవంగా ఓ ప్రక్కకి ఒరిగిపోయేవాడు. భగవంతుడి దయవల్ల మాధవ్ పుణ్యమా అని వాసు మళ్ళీ మామూలు మనిషి అయ్యాడు. అంటే మాధవ్‌కూడా అప్పటి ఆ వాసులాగే భరించలేని ఆవేదనతో ఆలోచనలని తప్పించుకోలేక నరకం చూస్తూన్నాడా! ఏమిటి అతనికున్న సమస్య? అసలీమధ్య తరచుగా యిలాగే కన్పిస్తున్నాడు. కారణం ఏమిటి? చేతినిండా పుష్కలంగా డబ్బుంది. సంఘంలో బోలెడంత పలుకుబడివుంది. ఎంతోమంది స్నేహితు లున్నారు. జీవితాన్ని అన్నివిధాల అనుభవయోగ్యం చేసుకోవటానికి ఇంత కంటె అవకాశాలు యింకేం కావాలి? వీటన్నిటిని తోసిరాఁలేనంతటి బలీయ మైన బాధ ఏమిటి? ఎవరికోసం? సంధ్యదృష్టి చెదిరిన అతని జుట్టుమీద పడింది. మొదటిసారిగా అతన్ని తాకి ఆ జుట్టుని సరిచెయ్యాలని, హృదయ పూర్వకంగా రెండు చల్లని మాటలు చెప్పి సేదతీర్చాలని అన్పించింది. మోచేతులవరకూ ముడుచుకున్న షర్టుస్లీవ్స్ అలాగే ఉన్నాయి. భోం చేసిన తర్వాత వాటిని సరిచేసుకోవాలనే గుర్తుకాని ఓపికకాని లేనట్టు న్నాయి.

సంధ్య మెల్లిగా చప్పుడు కాకుండా లోపలికి వచ్చి మంచినీళ్ళ చెంబు టేబిల్‌మీద పెట్టింది. దీపపు వెలుగులో దగ్గరగా కన్పిస్తున్న అతని ముఖంలో అలసట, ఆవేదన స్పష్టంగా ప్రస్ఫుటమౌతున్నాయి.

మంచినీళ్ళు పెట్టిన శబ్దం వినగానే మాధవ్ వులిక్కిపడి తలెత్తి చూశాడు. ఇద్దరికళ్ళూ కలుసుకున్నాయి. ఆ క్షణంలో అతని ముఖంలో కన్పిస్తున్న భావనచూసి సంధ్య గుండెలు అవ్యక్తమైన వ్యథలో క్రుంగి పోయింది. అశాంతిని, వంటరితనాన్ని తప్పించుకోలేక జీవితం అంటే విరక్తిపుట్టి ఆత్మహత్యకు సిద్ధం కాబోతున్న మనిషిలా వున్నాడు.

సంధ్య పెదవులు అస్పష్టంగా కదిలాయి. కాని శబ్దం పైకిరాలేదు. మాధవ్ మొదట సంధ్యని అంత దగ్గరగా చూడగానే తెల్లబోయాడు. చాల సేపటినుంచి పరధ్యానంగా ఎక్కడో వున్నట్టున్న అతనికి క్షణంసేపు

తనుచూస్తున్నది కలో నిజమో అర్థంకావేదు. అప్రయత్నంగా అతనిచేయి ముందుకు కదిలి సంధ్య చేతిని పట్టుకోపోయి తిరిగి యథాస్థానంలోకి వచ్చేసింది.

"నువ్వా?" అంటూ లేచి సరిగ్గా కూర్చున్నాడు.

సంధ్యకి మొదటి సారిగా అతనంటే వున్న ఏవగింపు రూపులేకుండా ఛాయ మిగలకుండా అతివిచిత్రంగా మాయమైంది. అతనిచేతిని తనే అందుకుని రెండు చేతుల్తో పట్టుకొని "ఏమిటి మిమ్మల్ని క్రుంగదీస్తున్న ఆ బాధ? నాకు చెప్పండి. నన్ను కూడా పంచుకోనివ్వండి" అని అడగాలని బలంగా అన్పించింది. మరో నిమిషం అయితే అడిగేసేదికూడా. కాని మాధవ్ సంధ్య పెదవి కదిపే అవకాశమే యివ్వకుండా కుర్చీలోంచి దూరంగా వెళ్ళిపోతూ "సంధ్యా! ఈ రోజు బాబు నా దగ్గర వద్దు. నీ లోకి తీసుకెళ్ళి పడుకోబెట్టుకో!" అన్నాడు-అదే కంఠం, అదే నిర్లి

సంధ్య అనదల్చుకున్న మాటలు నాలుక చివరే ఆగిపోయాయి.

మౌనంగావెళ్ళి బాబుని తీసుకోబోయింది.

"నువ్వాగు. నేనే తీసుకువస్తా. నా చేతుల్తో నన్నే తీసుకొచ్చి పడుకోబెట్టనీ!" మాధవ్ వారిస్తూ మంచం దగ్గరకి వచ్చాడు.

అతని ప్రవర్తన ఏమాత్రం అర్థంగాని దానిలా అతనిముఖంలోకి వింతగా చూసింది. మాధవ్ ఆ చూపులు పట్టించుకోనట్టే ఎటూ చూడకుండా బాబుని లేవనెత్తి భుజంమీద వేసుకున్నాడు.

సంధ్య గదిలోకి తీసుకువచ్చి పడుకోబెట్టి వెళ్ళబోయే ముందు ఒక్కనిమిషం ఆగి వాడిని పరీక్షగా చూశాడు. ఆ చూపుల్లో ప్రియాతి ప్రియమైన దాన్నేదో ఆఖరిసారి మరొక్కసారి కళ్ళారా చూసుకుంటున్న అనుభూతివుంది. ఒకసారి బాబువైపు మరోసారి సంధ్యవైపు మార్చిమార్చి చూసిన అతను 'వస్తా' అంటూ వెళ్ళిపోయాడు. మధ్యలో గుమ్మం దగ్గర అరసెకను ఆగి "నేను తెల్లవారుఝామున వెళ్ళిపోతాను. నువ్వు నిద్రలో వుంటావు. అందుకని యిప్పుడే చెప్తున్నా" అన్నాడు. సంధ్య ఏవో చెప్పాలని పెదవులు తెరచేలోపల అతను తలుపులు చేరవేసి వెళ్ళిపోనే పోయాడు.

148

# 43

తెల్లవారుఝామునలేచి మాధవ్ వంటయింటివైపు వచ్చేసరికి సంధ్య అప్పటికే లేచి అక్కడ పనిచేస్తోంది.

"నువ్వా?" ఆయా అనుకుని చొరవగా లోపలికి రాబోతున్న మాధవ్ గుమ్మంబైటే నిలిచిపోతూ విస్మయంగా చూశాడు.

"ఆయా లేవబోతుంటే నేనే వద్దన్నాను." మరుగుతున్న నీళ్ళు దించి ఫిల్టర్‌లో పోస్తూ సంధ్య అన్నది. పయట నడుంచుట్టూ త్రిప్పి దోపుకుంది. పొడుగాటి జడ నడుస్తున్నపుడు కలిగేకదలికవల్ల అటు యిటు ఊగుతోంది. రాత్రి నిద్రవల్ల చెదరిన వెంట్రుకల్లో ఒకటి రెండు చెంపల మీదుగా పడుతున్నాయి. వెనకనుంచి సంధ్యని తిలకిస్తున్న మాధవ్ లోపలికి రావాలో, లేక వెనక్కి పోవాలో నిర్ణయించుకోలేక తటపటాయిస్తూ గడపదగ్గరే ఆగిపోయాడు.

"మీరు గడ్డం చేసుకోటం పూర్తి కానిస్తే--స్నానానికి నీళ్ళు కాగినాయి." పాలగిన్నె పొయ్యిమీద పెడుతూ అంది సంధ్య.

అతడు ఎపుడు ఊరువెళ్ళాలన్నా ప్రయాణంచేసేముందు స్నానం చేసి బైలుదేరటం అలవాటు. గమ్యం చేరుకున్న అరగంట, గంటలో మళ్ళీ చేస్తాడు. ఈ అలవాటు ఎప్పుడయిందో అతనికే గుర్తులేదు.

మాధవ్ గడ్డం చేసుకుంటుండగా సంధ్య స్నానానికి నీళ్ళు సిద్ధం చేసింది. అతను స్నానం ముగించి బట్టలు వేసుకోవటం పూర్తి చేసుకుని వంటయింటివైపు వచ్చేసరికి కాఫీ కప్పు తెచ్చి అందించింది. కాఫీ కప్పు అందుకునేప్పుడు వేళ్ళుతగలకుండా జాగ్రత్తపడ్డాడు! కాని ఆమె ముఖంలోకి మాత్రం చూడకుండా వుండలేకపోయాడు. తలెత్తి తనవైపుసూటిగా చూస్తున్న ఆ కళ్ళలో ప్రశాంతత తప్ప అతనికి ఏమీ కన్పించలేదు.

మాధవ్ కాఫీ కప్పు తీసుకుని పెరటివైపు గుమ్మందగ్గరగా వచ్చి నిలబడ్డాడు. పల్లెటూరి వాతావరణంలో తెల్లవారుఝాములో నిశ్శబ్దం, అందం వీటిని స్వయంగా అనుభవించాల్సిందే తప్ప చెప్తే తెలియదు. దొడ్లో గుబురుగా పెరిగిన చెట్టుకి విరగబూసిన నందివర్ధన పూలు వెన్నెలతో పోటీపడతా మంటున్నాయి.

"ఇంకో కప్పుకావాలా?-" వెనుకనుంచి సంధ్య.

మాధవ్ కావాలన్నట్టు తలూపాడు.

సంధ్య మరో కప్పుతో కాఫీ తెచ్చి యిచ్చి, ఖాళీ అయిన కప్పు తీసుకుంది.

"నువ్వు తాగావా?" అప్రయత్నంగా అడిగాడు.

సంధ్య లేదన్నట్టు తలూపి ఇంకో కప్పుతో తెచ్చుకుని వచ్చి మాధవ్ కెదురుగుండా నిలబడింది. కాఫీ కప్పులమీద నుంచి ఇద్దరి కళ్ళూ కలుసుకున్నాయి. ఒకళ్ళని ఒకళ్ళు చూసుకుంటూ అలాగే నిలబడిపోయారు. దూరంగా అపుడే మేల్కొంటున్న కోళ్ళ కొక్కొరోకో అన్న కూతలు, చెట్లమీద నిద్రలేస్తున్న పిట్టల కలకలం తప్ప యింకే శబ్దమూ లేదు. సంధ్య ముఖం ప్రశాంతంగా, నిర్మలంగా దొడ్లో రాత్రి మంచుకి తడిసిన నందివర్ధనపు పువ్వులా వుంది. తనవైపు రెప్పవాల్చకుండా చూస్తున్న ఆ కళ్ళలో లీలగా ఆపేక్షకూడా తొంగి చూస్తోంది. రాత్రంతా నిద్రపోయి ఎరుగని తనకళ్ళు భ్రమపడుతున్నాయేమో అనుకున్నాడు మాధవ్. తను ఎలాగూ తిరిగి రావటంలేదు: వెళ్ళిపోయేముందు అతినిర్మలంగా, అతి ప్రశాంతంగావున్న ఈసమయంలో సంధ్యని ఒక్కసారి దగ్గరకు తీసుకుంటే—ఎలాటి ఉద్రేకం లేకుండా స్థిరమైన మనస్సుతో ఒక్కసారి ఆ భుజాలచుట్టూ చేతులు వేసి దగ్గరకు లాక్కుని హృదయానికి హత్తుకుంటే! 'నువ్వు నా దానివి కాకపోయినా, కాలేకపోయినా నేను ఎప్పటికీ నీ వాడనే: ఇంతకి వేయిరెట్లు బాధపెట్టినా సరే జన్మజన్మాలకి యుగయుగాలకి నాకు నువ్వేకావాలి;' అనిచెప్తే—ఎప్పటిలా సంధ్య నిర్లక్ష్యంగా కఠినంగావుంటే బహుశా అతను సందేహించేవాడు కాదేమో! కానీ సంధ్య కళ్ళల్లో కన్పిస్తున్న ఈ నూతనమైన ప్రశాంతత అతన్ని బెదిరించి దూరంగా నిలబెట్టింది. అలా మామూలుగా, ఏ చిరాకూ లేకుండా వున్న సంధ్యని చూడటం అతని కిది మొదటిసారి. ఎంత బాగుంది! ఎంత అమాయకురాలిలా సౌజన్యమూర్తిలావుంది. తమాషా! ఎప్పుడూ ఆకళ్ళ మీద ఆవరించుకుని ఉండే విషాదచ్ఛాయకూడా ఇప్పుడు లేదు.

"రాత్రి మీరు ఎందుకలా వున్నారు?-" ఉన్నట్టుండి అడిగింది సంధ్య.

మాధవ్ వులిక్కిపడ్డాడు. "ఎలా వున్నాను?" అన్నాడు.

"ఎలాగో వున్నారు." కాఫీ కప్పులోకి చూస్తూ అంది.

మాధవ్ ముఖం తిప్పుకుని బైట వెన్నెల్లోకి చూస్తుండి పోయాడు. అతనికి వెంటనే సంధ్య రెండుభుజాలు పట్టుకుని గట్టిగావూపి 'నేనెలా వుంటే నీకెందుకు? నీకేమైనా అన్పిస్తుందా? చెప్పు' అని అడగాలని పించింది. హఠాత్తుగా సంధ్య చూపుతున్న ఈ చనువు అతని కెలాగో వుంది. బహుశా రాత్రి తనని అలా చూడటంవల్ల జాలిపడుతుందేమో! అది కేవలం జాలే అయితే అంతకంటె భరించరాని అసహ్యం ఇంకోటి లేదు. జాలికంటె సంధ్య చూపే ద్వేషమే తనకి బాగుంటుంది- ఆ ద్వేషంలో ఇద్దరిమధ్య ఓ బంధంవుంది కాబట్టి.

మాధవ్ తను అడిగిన ప్రశ్నకి జవాబు ఇవ్వకపోగా గిరుక్కున ముఖం త్రిప్పుకోవటం చూడగానే సంధ్య మనసు చిన్నబోయింది. ఔను! తను అడిగినదానికి వెంటనే సమాధానం చెప్పాలని ఎక్కడుంది? వెంటనే కాదు, అసలు సమాధానమే చెప్పనవసరం లెదు. అతనిబాధలు పంచుకో టానికి, అడక్కపోయినా ఆదరం చూపించటానికి ఎవరు తను? బంధువా? స్నేహితురాలా, ఆప్తురాలా ఎవరని? ఆయింట్లో తనస్థానం గుర్తుకురాగానే హద్దుమీరి ప్రవర్తించానేమోనని అభిమానపడి సిగ్గుతో తలదించుకుంది.

దాదాపు అరగంట పోయిన తర్వాత అతను ఆయాని కూడ లేపి వెడుతున్నాని చెప్పి బైటకి వచ్చాడు. గోవిందు అప్పటికే సామానంతా కారులో పెట్టి అంతా సిద్ధం చేసేశాడు. ఆయా లేచి రాబోతుంటే మాధవ్ ఆప్యాయంగా భుజంమీద తట్టి వద్దని వారించాడు. ఆరోగ్యం జాగ్రత్త అనిహెచ్చరించాడు. అతనికంఠం గాంభీర్యంగావున్నా కనుకొలకులు తడి అవటం ఎవరూ గ్రహించలేదు. అదే గదిలో మరోవైపు వున్న మంచం మీద బాబు ఓప్రక్కకి వత్తిగిలి పడుకుని గాఢనిద్రలో వున్నాడు. క్షణంలో సగంసేపు వాడిమీద నిల్చింది అతని దృష్టి. మరుక్షణమే తల తిప్పుకుని బైటకి వచ్చాడు. తనవెనకే వస్తున్న సంధ్యని వద్దని చెప్పాలని ఎంతగా అన్పించినా చెప్పలేక పోయాడు.

వరండా దిగువవున్న మెట్లమీద మళ్ళీ యిద్దరు సంధ్య పై మెట్టుమీద వుంది. క్రిందమెట్టుమీదవున్న మాధవ్ అగి వైపు చూశాడు. మళ్ళీ ఒకే నిమిషం కాలం నిల్చిపోయింది. పై నుంచి పడుతున్న వెన్నెల్లో సంధ్య కాటుక కళ్ళు మెత్తగా నవ్వాయి. అతనిగుండె లయతప్పింది. ఏదో చెప్పటానికి తెరచుకోబోయిన పెదవులు అంతలో ఆగిపోయినాయి. వెంటనే గిరుక్కున తిరిగి చకచకా మెట్లుదిగి వెళ్ళి కారు కూర్చున్నాడు. సంధ్య ఇంకా అక్కడే బొమ్మలా నిలబడి చూస్తోంది అతనికి తెలుసు. అయినా ఎలాటి స్పందన కలగలేదు. ఇదే చిరునవ్వు, ఈకాస్త చనువే కొన్ని నెలల క్రితం సంధ్య ముఖంలో కన్పించినట్టయితే సంధ్యని బలవంతంగానైనా సరే తన దానినిగా చేసుకుని తీరేవాడు. ఇప్పుడు వేరు. చాలా సేపటినుంచి మంచుముద్ద మధ్య నొక్కిపట్టిన శరీరంలా అతని మనసుకూడా మొద్దుబారి పోయింది. ఏ అనుభూతీ లేదు. బాధగాని, ఆవేదనగాని అసలే లేదు. ఎంతో ప్రయత్నం మీద, ఎంతో సాధనవల్ల అతనీ జడత్వానికి రాగలిగాడు. కారు కాంపౌండుగేటుదాటింది. తూర్పున చీకట్లు చెల్లాచెదురవుతున్నాయి. ప్రపంచం అంతా ఎర్రటి కాంతితో అదోరకంగా వుంది. కారు వీధిమలుపు కూడా తిరిగింది. మాధవ్ వెనక్కు జేరగిలబడి కాళ్ళమీద చేతులానించుకున్నాడు! చాలారోజుల నుంచి యావచ్ఛక్తిని వినియోగించి చిక్కపట్టుకున్న బాధ ఒక కన్నీటి బొట్టుగా మారి, బలవంతాన మూయటానికి ప్రయత్నిస్తున్న బరువైన రెప్పలకి తిరగబడి బైటకి జారింది.

## 44

మాధవ్ వెళ్ళి దాదాపు రెండునెలలు అవుతోంది. ఎక్కడున్నాడో ఏమి చేస్తున్నాడోకూడా జవాబులేదు. ఆయా ఒకటే ఖంగారు పడుతోంది. గోవిందుచేత కంపెనీకి కబురుచేస్తే బిజినెస్ టూరుమీద కలకత్తా దగ్గర ఏదో వూళ్ళో వున్నారని చెప్పారు. అతను ఎక్కడున్నా ఏంచేస్తున్నా బాబు క్షేమం అడుగుతూ వుత్తరం ఇన్నాళ్ళూ వ్రాయకపోవటం సంధ్యకి కూడా ఆశ్చర్యంగానే వుంది. ఆఖరిరోజున అతని ప్రవర్తన, ఆ మాటలు

...లాగో అన్పిస్తోంది. ఇల్లు కట్టడం పూ ర్తయిపోయింది. కాని ...వ రాందే అతనికి చెప్పందే యెలా వెళ్ళటం అంటోంది ఆయా.

మాధవ్ వుత్తరంకోసం ప్రతిరోజూ మధ్యాహ్నం ఎదురుచూడటం సంధ్య దినచర్యలో ఒక ముఖ్యభాగమైపోయింది. ఆరోజు మాధవ్ పేరు మీద యింకెవరో వ్రాసిన వుత్తరం వచ్చింది. అతని వుత్తరం కోసం ఎదురుచూస్తున్న సంధ్య చిరాకులో అది ప్రక్కన పడేసింది.

సాధారణంగా ఎప్పుడో తప్ప అతనికి యిక్కడికి ఈ ఇంటికి వుత్తరాలు రావు.

"తెరచి చూడు. ఎవరు వ్రాశారో, ఏమైనా ముఖ్యమైన ఫనేమో" అంది ఆయా. సంధ్య వుత్తరం తిప్పి తిప్పి చూసింది. ఫ్రమ్ అడ్రస్ లేదు. దస్తూరి అందంగా సన్నగా కోమలంగా వుంది.

"తీసి చూడు. తప్పేముంది?" ఆయా రెండోసారి హెచ్చరించింది.

సంధ్య అయిష్టంగానే తెరిచింది.

అందులో ఇంగ్లీషులో యిలా వుంది :

"మిష్టర్ మాధవ్!"

నేను యీ కొత్త హాస్పిటల్‌కి మారిన తర్వాత బొత్తిగా నీ సంగతులు ఏమీ తెలియటంలేదు. మీ హాస్పిటల్ ఎలా నడుస్తోంది? చినబాబు ఎలా వున్నాడు? వాడినిచూసి చాలారోజులైంది. ప్రస్తుతం నా ఆరోగ్యం అంతగా బాగుండటంలేదు. డాక్టర్లు ఎక్కడైనా ప్రశాంతంగా వున్నచోట నిర్మలంగా కనీసం రెండు మూడు వారాలయినా గడిపి విశ్రాంతి తీసుకోమని మరీమరీ హెచ్చరిస్తున్నారు. నాకు తెలిసినంతవరకూ అలా శాంతిని ప్రసాదించే స్థలాలుగాని, మనుష్యులుకాని లేరు. నువ్వుండేచోటు పల్లెటూరు అని, మీ యిల్లు చాలా విశాలమైనదని చాలా సౌకర్యంగా వుంటుందని నీ మాటలద్వారా చాలాసార్లు విన్నట్టే నాకు గుర్తు. నీకు అభ్యంతరం ఏమీ లేకపోతే నేను వచ్చి వారం పదిరోజులపాటు వుంటాను. బాబుతో కొద్దికాలం సరదాగా గడిపినట్టూ వుంటుంది. నాకు విశ్రాంతీ లభిస్తుంది.

నా కే సంగతి వెంటనే తెలియజేయి. నా రాక
గాఢంగా నమ్ముతూ,

ఉత్తరాన్ని రెండుమూడుసార్లు చదివి నాసలు చిట్లపడిపోయింది సంధ్య.

"ఎవరి దగ్గరనుంచి!" ఆయా ఆదుర్దాగా అడిగింది.

సంధ్య చెప్పింది.

"అయితే వెంటనే రమ్మనమని రాయి. ఆయన లేకపోతేనేం? పాపం! ఆవిడ అంత యిదిగా రాస్తుంటే? అసలాయన వెళ్ళి చాలారోజులయింది. కాబట్టి యీ పూటో రేపో రావచ్చుగూడా. ఒకవేళ ఆయన రాదే అనుకుందాం. రాకపోయినా ఫర్వాలేదు. ఈ లంకంత కొంపలో కాస్త సందడయినా వుంటుంది."

అంటూ ఆరోజే సంధ్య జవాబు వ్రాసేవరకూ ఆయా వదిలిపెట్టలేదు.

"మాధవ్ వూళ్ళోలేరు. అయినా ఫర్వాలేదు. మీరాకకి, ఏం అభ్యంతరంలేదు. తప్పకుండా రండి. రెండు వారాలుకాదు, నాలుగు వారాలు రెస్టు తీసుకున్నా మాకు యిబ్బందిలేదు. నేను బాబుకి ఆయాగా వుంటున్నాను. ఈ ఇంట్లో ప్రస్తుతం నేను అమ్మ తప్ప యింకెవరూలేరు. బాబు అల్లరి మీరు స్వయంగా కళ్ళతో చూడవలసిందే. మీరు ఫలానా రోజు వస్తానని టెల్గ్రాం ఇస్తే స్టేషన్‌కి కారు పంపిస్తాను, కారు నంబరు మీకు తెలిసే వుంటుంది." అని తప్పకుండా రమ్మనమంటూ మరీ మరీ ఆహ్వానిస్తూ జవాబు వ్రాసింది సంధ్య. ఆవిడ రాకవల్ల ఇంటికి కాస్త సందడి వస్తుందని ఆయా ఆలోచిస్తుంటే మెల్లిగా ఆవిడద్వారా బాబు పుట్టుపూర్వోత్తరాలు తెలుసుకోవచ్చునని సంధ్య ఆశించింది.

వచ్చేది. సంధ్య బాబుకు బట్టలవీ వేసి, సిద్ధం
కూర్చుని రాబోయే అతిథికోసం యెదురు చూస్తు
అయింది. పొద్దు పూర్తిగా వాలిపోవడంతో యిల్లంతా
ఆవరించుకున్నాయి.

...ఇంకా రాలేదెందుకో?" అంది ఆయా.

"రావద్దూ? మరీ అంత తొందర అయితే ఎలా?" పరధ్యానంగా ఆలోచిస్తూనే అంది సంధ్య. అంటుండగానే వాకిట్లో కారు హారన్ విన్పించింది.

"అదుగో! వచ్చేసినట్టున్నారు." ఆయా తొంగిచూస్తూ అంది.

సంధ్యకూడా బాబునెత్తుకొని బైట వరండాలోకి వచ్చింది. నల్లటి కారులోంచి దబ్బపండులాంటి ఛాయలో, పాదాలవరకూ జీరాడుతున్న తెల్లటి యూనిఫారమ్‌తో మెళ్ళో వ్రేలాడుతున్న పెద్దక్రాసుతో సిస్టరు దిగింది. సంధ్య చెప్పగానే బాబు చెయ్యి వూపాడు. ఆవిడకూడా ఎడం చెయ్యి వూపుతూ నవ్వుతూ మెట్లెక్కి వస్తోంది. సంధ్య చిరునవ్వుతో బాబుని ఎదురు తీసుకెళ్ళింది.

"అయ్యో ఖర్మ!" వున్నట్టుండి ఆయా ఖంగారుగా కాస్త పైకే అనేసుకుంది.

సంధ్య చేతుల్లోంచి బాబుని అందుకున్న సిస్టర్ సంధ్యవైపుచూస్తూ "నిన్నెక్కడో చూశాను!" అంది.

సిస్టర్ని అప్పటికే పరీక్షగా చూసి గుర్తుపట్టిన సంధ్యముఖం వెంటనే పాలిపోయింది.

సిస్టర్‌కు కూడా గుర్తు వచ్చేసింది. నమ్మలేనట్టుగా "అరే! నువ్విక్కడున్నావా?" అంది ఆశ్చర్యంగా.

సంధ్య మాట్లాడలేదు. ఆవిడవైపు అలాగే చూస్తోంది. సిస్టర్ ముఖంమీద పాత జ్ఞాపకాలు ఎన్నెన్నో నాట్యం చేయసాగాయి. ఎంతో ఆత్రంగా ఎదురుచూస్తున్న సాయంత్రం హఠాత్తుగా భయంకరమైన స్మృతులతో వడిలి వాడిపోయింది.

"నువ్విక్కడే వున్నావా! మాధవ్ చెప్పలేదు నాకు?" ఆవిడ బాబు నెత్తుకొని మెట్లెక్కి లోపలికివస్తూ అంది. యాంత్రికంగా ఆవిడ వెంటే లోపలికి వచ్చింది సంధ్య.

"అదేమిటమ్మా! నాకు మాట మాత్రంగానైనా తెలియనీయకుండా దాచుకున్నారు." నిష్ఠూరంగా అంది సిస్టర్. ఆ వెంటనే మళ్ళీ అర్థమైనట్టుగా "ఓహో! తెలిసిందిలే హఠాత్తుగా నన్ను ఆశ్చర్యంలో ముంచెత్తాలని భార్యాభర్తలిద్దరూ పథకం వేసుకున్నారన్నమాట అంతేనా?" అంది నవ్వుతూ.

"సిస్టర్! మీరు - మీరనేదేమిటో నాకుతెలియదు." విషాదం నిండిన కళ్ళతో చూసింది సంధ్య.

"తెలియదా? ఏం తమాషా! బాబుని చూపించి నీ కొడుకు అని చెప్పినప్పుడన్నా వాడిని ఎవరు పెంచి పెద్దచేశారో మాధవ్ నీకు చెప్పనే లేదా?"

"సిస్టర్!"

"ఇంత చక్కటి రత్నాన్ని- మీరింకా అప్పుడలా వదిలేస్తే ధూళిలో కలిసిపోకుండా ఎంత జాగ్రత్తగా పెంచి పెద్దజేశానో నేను? నువ్వు కన్పిస్తే నాకు వెంటనే తెలియజేయమని మరీమరీ అతనికి చెప్పానే! ఒక్క చిన్న-"

"సిస్టర్!"

"ఇంతకీ మీ యిద్దరూ ఎలా కలుసుకున్నారు? ఎప్పుడు కలుసుకున్నారు?" అని, సంధ్యవైపు చూడకుండానే బాబుని పలకరించి ముద్దు పెట్టుకుంది. వాడి బుగ్గగిల్లుతూ, "చూశావా బాబూ! మీ అమ్మా నాన్న చేసిన పని? నా అంతట నేను రాకపోతే నా కీ సంగతి తెలిసేదే కాదేమో కదూ! నా బంగారుబాబు స్వంత తల్లి తండ్రిదగ్గరే వాళ్ళ కంటివెలుగుగా పెరుగుతున్నాడంటే—"

"సిస్టర్-" అసహనంగా అరిచింది సంధ్య. "మీరనేదేమిటో నాకు తెలియదు. బాబు మాధవ్ కొడుకు కావచ్చు. వాడి కన్నతల్లిని నేను కాను— కాను." సంధ్య ఆవేశంగా అంటున్న ఆ ధోరణి చూసి సిస్టర్ తెల్లబోయింది. బాబుని ఒళ్ళోంచి దించుతూ "ఏమిటి నువ్వనేది?" అంది.

"వాడు మాధవ్ కొడుకు. నా తిండీ బట్టా జరుగుబాటు కోసం వాడికి చాకిరీచేసే నౌకరుని మాత్రమే! మీరు ఎందుకో ఎలాగో పొరపాటు పడ్తున్నారు. నేను వాడికి ఆయాను. అంతకంటె మా ఇద్దరిమధ్యా ఎలాంటి బంధంగాని, మమతగాని లేవు."

సిస్టర్ ఏమిటేమిటీ అన్నంత ఆశ్చర్యంగా చూసింది.

తన ఆవేశానికి తనే క్షణం సేపు సిగ్గుపడిన సంధ్య కళ్ళు దించుకుని మెల్లగా "మీ హాస్పిటల్‌కి వచ్చేముందుగా ప్రారంభమైన నా దురదృష్టం రోజురోజుకీ పెరిగింది! మా పరిస్థితులు చాలా తారుమారయినాయి. నే నిప్పుడు ఇక్కడ జీతంకోసం పనిచేస్తున్నాను."

"అంటే- వీడు నీ కొడుకని నీకింతవరకూ తెలియనే తెలియదా?"

"సిస్టర్!" సంధ్య కొరడాదెబ్బ తిన్నదానిలా చివ్వున ముఖం ఎత్తింది.

సిస్టర్ సంధ్య కళ్ళల్లోకి లోతుగాచూసి దేనికోసమో వెతుకుతున్నట్టుగా "మాధవ్ చెప్పనేలేదా? కన్నతల్లిని కొడుక్కి ఆయాగా వుంచే కఠినుడా అతను! అతన్ని చూస్తే నాకసలు అలాటి అనుమానమే రాలేదు" అంది.

సంధ్య ముఖం జేవురించింది. "ఇప్పటికి కనీసం నాలుగుసార్లన్నా చెప్పాను—వాడికి—నాకు—"వాక్యం పూర్తికానేలేదు. సిస్టర్ అంది...

"సంధ్యా! బాబుకి మాధవ్ తండ్రి అవునో కాదో నాకు తెలియదు. కాని. వాడు నీ కొడుకే—" అంటుండగానే ఆవిడ కేదో అనుమానం వచ్చినట్టుంది.

"అసలు ఆ టైమ్‌లో నీకు పుట్టిన శిశువు బ్రతికున్నట్టు నీకు తెలుసా?" అంది.

"సిస్టర్, ప్లీజ్!" సంధ్య ఒంట్లోవున్న రక్తం అంతా ఒక్కసారి ముఖంలోకి పొంగింది.

"మీ పని మనిషికి తెలుసే!" సిస్టర్ ఆయాకోసం చూసింది.

"ఆయాకి తెలుసా!" సంధ్య ప్రాణం అంతా చిక్కబట్టుకుంటూ ఆయాకోసం వెతికింది. కాని ఆయా ఆ చుట్టూ ప్రక్కల ఎక్కడా వున్న సవ్వడిలేదు. సిస్టర్ని చూడగానే లోపలికి పారిపోయినట్టుంది.

"ఇలా కూర్చో, మొదట నాకిది చెప్పు. మాధవ్ నువ్వు పెళ్ళి చేసుకోలేదా?" లేదన్నట్లు కంపరంగా చూస్తూ తల తిప్పింది.

"బాబెవరో నీ కిన్నాళ్ళనుంచి అతను చెప్పనేలేదా?"

లేదన్నట్టు చూసింది.

"నువ్వీ యింట్లో నిజంగానే ఆయాగా వుంటున్నావా? నాకు ఆయా నంటూ ఉత్తరం వ్రాసింది నువ్వేనా?"

"అవును."

సిస్టర్ రెండు నిమిషాలు రెప్పవాల్చకుండా సంధ్యవైపు చూసింది. గదిలో గంభీరమైన నిశ్శబ్దం ఏర్పడింది.

పాలిపోయి నిర్జీవంగా అయిపోయిన సంధ్యముఖం చూడగానే సిస్టర్ హృదయం దయతో సానుభూతితో కరిగిపోయింది. కంఠం తగ్గించి మెల్లగా అతిమృదువుగా "వాట్ ఏ పిటీ మై ఛైల్డ్! నేనిక్కడికి వచ్చే ముందు యిన్నాళ్ళ తర్వాత నిన్ను చూస్తాననిగాని, ఇదంతా మళ్ళీ గుర్తుకు తెచ్చి బాధ కలిగిస్తాననిగాని కల్లోకూడా అనుకోలేదు. ఎంత చిత్రం! అసలు జీవితంలో భయంకరమైన అనుభవాలు రానేకూడదు. ఒకవేళ వచ్చినా వాటి ప్రసక్తి అంతటితో అంతమైపోవాలి. మళ్ళీ మళ్ళీ తలచుకునే స్థితి వస్తే మనిషి మానసికంగా ఎంత ఆవేదనకి గురికావల్సి వస్తుందో నాకు తెలుసు బాబు యింత ఆరోగ్యంగా, ముద్దుముచ్చటలో పెరగకపోయినా, నువ్విక్కడ లేకపోయినా ఇదంతా నీకు తెలిసే అవకాశం వచ్చేది కాదేమో!" సిస్టర్ చెప్పటం ప్రారంభించింది.

"అప్పుడు నీకు పుట్టిన శిశువు బ్రతుకుతాడని మే మెవరం అనుకోలేదు. కొనవూపిరి ఎక్కడో రెపరెపలాడుతోంది. బ్రతికే ఆశలేదు. కాబట్టి అసలే అనారోగ్యం వున్న నీకు యీ విషయం చెప్పవద్దని మీ నాన్న కోరారు. నేను ఒప్పుకున్నాను. ప్రసవించిన మరుసటి రోజునే మీవాళ్ళు నిన్ను యింటికి తీసుకెళ్ళారు. పూర్తిగా ప్రాణం పోసిపిల్లాడిని చూస్తూ చూస్తూ ఎలా వదిలేస్తాం? ఆక్సిజను అదీ యిచ్చి రెండు రోజులు మేం చేయగలిగినదంతా మా ధర్మం నెరవేరుస్తున్నట్టు చేశాం. మూడురోజులు గడిచేసరికి బిడ్డ వూపిరి తీసుకోవటం నార్మల్‌కి వచ్చింది. మరి రెండు రోజులు పోయేసరికి అందరి పిల్లలలాగే పాలుతాగడం ప్రారంభించాడు.

నేను ఎంతో ఆనందంగా మీ నాన్నకి ఫోన్ చేశాను. ఆయన మొదట నన్ను చాలా సేపటివరకూ గుర్తుపట్టనట్టే మాట్లాడారు. ఓపిగ్గా ఫలానా అని చెప్పుకున్నాను.

"బిడ్డ మామూలుగానే వున్నాడు. వచ్చి తీసుకువెళ్తారా?" అని అడిగాను.

"తీసుకెళ్ళను" అన్నారాయన ఖచ్చితంగా.

"తీసుకెళ్ళరా! మే మేం చెయ్యాలి?" తెల్లబోయి అడిగాన్నేను.

"ఏం చేద్దామని ప్రతికించారు! అసలు ఆ పిల్లవాడు నా కూతురు కన్నవాడే అని నమ్మకం ఏమిటి?"

"సార్!"

"మాకు సంబంధంలేని పిల్లాడిని మే మెందుకు తీసుకొంటాం? ఏం చెయ్యమంటారూ అని సలహా అడుగుతున్నారా? తీసుకెళ్ళి మూసీనదిలో గిరాటు పెట్టండి." కర్కశంగా అని ఫోన్ పెట్టేశారాయన. నేను అవమానంతో అసహనంతో దహించుకుపోయాను. ఎంత కష్టమైనా సరే పిల్లాడిని తీసుకెళ్ళి నీ మనవడే అని ఋజువు చేయాలనే పిచ్చిపట్టుదల వచ్చేసింది. కానీ ఆధారం ఏమిటి? ఏం చూపిస్తాను?. రికార్డ్సులో సంధ్యకి బదులు మారుపేరు చూపారు! దిక్కులేని అనాథ అని అక్కడ పేర్కొన్నారు ఆవేశం తగ్గించుకుని ఆరాత్రంతా నిదానంగా ఆలోచించాను. జాతి మతభేదంగాని గొప్పబీద తారతమ్యంగాని, నీతిఅవినీతి ప్రసక్తిగాని చూడకుండా యీ లోకంలోకి రావాలని తహతహలాడే ప్రాణులకి జీవితం ప్రసాదించటమే కర్తవ్యంగాగల పవిత్రమైనవృత్తి మాది. నేను చిన్నప్పటినుంచీ నేర్చుకున్న సత్యాలు అనుభవంతోపొందిన మానవత్వం గుర్తుకువచ్చాయి. ఆపిల్లాడిని ఎవరికైనా మంచిదంపతులకు చూసి పెంచుకోటానికి ఇవ్వాలని నిశ్చయించుకున్నాను. నెల తిరుగకముందే ఒత్తుచేశాడు. రెండోనెల వెళ్ళేసరికి మమ్మల్ని చూసి బోసినవ్వులు నవ్వుతూ మా అందరిహృదయాలు ఆకట్టుకోసాగాడు. మూడునెలలు నిండేసరికి ముఖంలో రూపురేఖలు స్పష్టంగా కన్పించసాగాయి. మరోనాలుగు నెలలు గడిచింతర్వాత ఒక పనిమీద నేను మెడ్రాసు వెళ్ళవలసి వచ్చింది. వెంట బాబుని కూడా తీసుకువెళ్ళాను. అక్కడ నాకు బాగా పరిచితమైన ఒక కుటుంబం వుంది.

దంపతులిద్దరికి పిల్లలులేరు. ఒకప్పుడు బలవంతంగా గర్భస్రావం చేయాల్సి రావటంతో ఆవిడకి శాశ్వతంగా మాతృత్వం పొందే అర్హత పోయింది. "మంచి పిల్లాడిని చూడు. మేం పెంచుకుంటాం." అని భార్యాభర్తలిద్దరూ నాతో స్వయంగా చాలాసార్లు చెప్పారు. బాబుని వాళ్ళకిద్దామని తీసు నేను వెళ్ళేసరికి వాళ్ళు యిల్లు ఖాళీచేసి మరోచోటికి మారా కష్టంమీద ఆ అడ్రస్ వెతుక్కుంటూ వెళ్ళాను. ఆయన యిం ఆవిడ నన్ను చూడగానే ఆనందంగా ఆప్యాయంగా ఆహ్వానించింది. వెంటనున్న బాబునిచూసి ఎవరని అడిగింది. నేను వచ్చిన పని చెప్పాను. నేను చెప్పుతుండగానే, 'మమ్మీ' అంటూ రబ్బరు బంతిలావున్న ఓ పిల్ల గెంతుతూ లోపలికివచ్చింది. ఆవిడ ఆ అమ్మాయిని దగ్గరకు తీసుకుంటూ 'ఏడాదినుండి పెంచుకుంటున్నాం. మా స్నేహితురాలి కూతురు' అంది. నేను నీళ్ళు కారిపోయాను. నేను వచ్చేటప్పుడు బాబుని వెంటే తీసుకెళ్ళ టానికి సిద్ధమవుతుండగా 'సిస్టర్, పిల్లాడు ముద్దుగా వున్నాడు. పోనీ వుండనీకూడదు? వాడినికూడా పెంచుకుంటాను. ఒక కూతురు, ఒక కొడుకు అవుతారు' అంది. కాని నేనే యిష్టపడలేదు.

"కన్నతల్లి ప్రేమ పుష్పక విమానం లాంటిది. అందులో ఎంత మంది ఎక్కినా మరొకరికి చోటు వుంటుంది. పెంచిన ప్రేమ అలా కాదు శారదా! ఒరలాంటిది. ఒక ఒరలో రెండు కత్తులు ఎప్పుడూ యిమడవు అన్న సంగతి మన అందరికీ తెలుసు" అన్నాను.

బాబు నావెంటే వచ్చేశాడు. ఈ కొద్ది నెలలలోనే వాడు నాకు బాగా అలవాటయి పోయాడు. నన్ను గుర్తుపట్టటం నేర్చుకున్నాడు. ఎవరి చేతుల్లో వున్నా నన్ను చూడగానే ఎగిరి నా చేతుల్లోకి దూకేవాడు. బాబుని నేనే పెంచుకోవాలనే నిశ్చయించుకున్నాను. జాగ్రత్తగా మంచి క్రమశిక్షణతో పెంచి పెద్దచేసి, క్రైస్తవ మతబోధకుడిగా తీర్చిదిద్దుతానని అందరికీ చెప్పేదాన్ని. తర్వాత కొద్ది రోజులకే రజాకారు మూమెంట్ జరిగింది. ఆ భయంకరమైన వాతావరణం మారి ప్రశాంతత నెలకొన్న తర్వాత ఈ మధ్య కొన్ని మార్పులు వచ్చాయి. బాబు పూర్తిగా నా వాడు అయి పోయాడనే అనుకున్నాను. తీరా ఓ రోజు హఠాత్తుగా ఆ జ్యోత్స్న పిల్ల వచ్చి-"

"జ్యోతి?-"

అవును. ఆ రెండు జడల యెఱ్ఱటిపిల్ల లేదూ, ప్రసాద్

...్య యాంత్రికంగా తలూపింది.

... అమ్మాయి మాధవ్‌ని వెంటపెట్టుకుని వచ్చి ఆ సమయంలో ...కపోవడంవల్ల ఇలా జరిగిపోయిందని; దీనికంతటికీ అతను చాలా ...ంతున్నాడని చెప్పింది. బాబు యిక్కడ పెరుగుతున్నట్టు ఆమెకీ ...ందని, ఒక్కసారి చూడాలని కోరుతున్నాడని అంది. మొదట నేను ...ఏ సంగతీ చెప్పలేదు. లక్ష ప్రశ్నలు వేశాను. అన్నిటికీ అతికినట్లు జవాబు చెప్పారిద్దరూ. బాబుని చూపించేవరకూ ఆ అమ్మాయి నన్ను వద ...లేదు. బాబుకి మాధవ్ తండ్రి అనటానికి నా కేమంత సందేహం అన్పించ ...దు. బాబు పోలికలు అతనిలో అంత స్పష్టంగా చూసీచూడగానే తెలుసు ...యి. బాబును తీసుకువచ్చి చూపించాను. బాబుని చూడగానే కళ్ళలో ...కమన్న కాంతి, వాడిని స్పర్శిస్తున్నప్పుడు అతని ఒళ్ళు గగుర్పొడ వడం నేను గమనించలేకపోలేదు. నీ గురించి అడిగితే వివరాలు తెలియ వన్నారు. రజాకార్ మూమెంట్ జరిగిన తర్వాత మీ కుటుంబం కన్పించ లేదంది జ్యోతి మీ నాన్నగారిని కాల్చేసినట్టు నేను అంతక్రితమే ...విన్నాను.

కొద్దిసేపు బాబుతో గడిపి యిద్దరూ వెళ్ళిపోయారు. కాని, గంట ...అవకముందే మాధవ్ మళ్ళీ తిరిగి వచ్చాడు. బాబుని తీసుకెడ్తాను యివ్వ ...మన్నాడు నేను ఒప్పుకోలేదు. వాడిమీద నేను పెంచుకున్న ఆశల సంగతి చెప్తూ ఖచ్చితంగా తిరస్కరించాను. చాలాసేపటి వరకూ మాధవ్ ఏం మాట్లాడలేదు. చివరికి లేచి వెళ్ళబోతూ "బాబుని దగ్గరకు తీసుకుని తండ్రిగా యిప్పటికైనా నా కర్తవ్యం నిర్వర్తించుకుని సంధ్యకి జరిగిన అన్యాయం సరిచేసుకోవాలనుకున్నాను. మీరు ఇవ్వనంటే నే నేం చెయ్య లేను. కాని ఈ క్షణంనుండి నా ఆస్తికి వాడే వారసుడు. వాడి చదువు సంధ్యలు, తిండి బట్టా అన్నీ నేనే భరిస్తాను" అన్నాడు. అలా అంటున్న అతని ముఖంలోకి పరీక్షగా చూస్తే నా కెలాగో అన్పించింది. ఎంతయినా వాళ్ళిద్దరూ తండ్రి కొడుకులు. వాళ్ళని దూరంచేస్తే హక్కు నాకు

లేవేమో? మాధవ్! ముందు అప్పుడప్పుడూ వచ్చి బాబుని అలవా కుంటూ వుండు, తర్వాత చూస్తాను అన్నాను. ఈ లోపల అతని ఎలాటిదో, బాబుకి తండ్రిగా వుండే అర్హత అతనికి వ్యక్తిగతంగా వుం లేదో నేనుకూడా పరీక్ష చేయవచ్చు అనుకున్నాను. మాధవ్ ఒప్పు కున్నాడు. అప్పుడప్పుడూ వచ్చేవాడు. బాబుని కార్లో కూర్చో పెట్టుకుని వూరంతా తిప్పి, బొమ్మలు బిస్కెట్లు అవీ కొనిచ్చి తిరిగి నా దగ్గరకు తీసుకొచ్చి దింపి వెళ్ళేవాడు. బాబు నేను అనుకున్నదానికంటే త్వరగానే అతని దగ్గర అలవాటయిపోయాడు. మాధవ్ ప్రవర్తన కూడా నచ్చింది. అప్పుడప్పుడు నా దగ్గరికి తీసుకొచ్చి చూపించే పద్ధతి మీద ఓవరికి మాధవ్‌కి యిచ్చేశాను. యెప్పుడో ఒకసారి మాటల మధ్య నీ ప్రసక్తి వస్తే నీ ఆచూకీ తెలియలేదనీ, నిన్ను భార్యగా పొందలేకపోతే జీవితంలో పెళ్ళి అనేది లేదని చెప్పాడు." సిస్టర్ చెప్పటం ముగిస్తూ చివరికి "నువ దగ్గరుండి కూడా అతను నీ గురించి చెప్పలేకపోవటానికి కారణం ఏమిటో అదే నా కర్థం కావటం లేదు" అంది.

సంధ్య సిస్టర్ మాటలు చివరి చివరికి వినటమే మానేసింది. కళ్ళ ముందు ఎన్నెన్నో దృశ్యాలు కదులుతున్నాయి. బాబుకి అమ్మా అని పిలవమని అతను నేర్పటం, వాడిని కొట్టే హక్కు నీకుంది అనటం, ఇంకా ఇంకా ఎన్నెన్నో! మాధవ్ అప్పుడే యెందుకు చెప్పలేదు? నమ్మనని భయపడ్డాడా? సిస్టర్ని తీసుకువచ్చి ఎందుకు ఋజువు చేయలేదు? అంతా బూటకం అని తీసిపారేస్తుందని అనుకున్నాడా? అదీ నిజమే! ఇప్పుడు అనుకోకుండా సిస్టర్ చెప్పబట్టి గాని, లేకపోతే తను నమ్మేదా? ఏమో! అంతా పెద్ద వలయం. ఇందులో చిక్కడిపోయి తను గిరగిర తిరుగుతూ ఏది నిజమో, ఏది అబద్ధమో గ్రహించే శక్తిని మనసు ఎప్పుడో పోగొట్టు కుంది.

"షా కనిపిస్తోందా?-" సిస్టర్ బాబుని దింపి లేచి వచ్చి సంధ్య చేతిని తీసుకుని నాడిచూస్తూ అంది.

సంధ్య ఆవిడనేది యేమిటో అర్థంగానిదానిలా తలెత్తి అయో మయంగా చూసింది. సిస్టర్ దయగా నవ్వింది.

"సిస్టర్!" సంధ్య ఆవిడ నడుముచుట్టూ పెనవేసి డ్రెస్‌లో ముఖం ఎంది.

"ధైర్యం తెచ్చుకో! నాకేం తెలుసునమ్మా! నిన్నక్కడ చూసి గుర్తుపట్టగానే మీ యిద్దరూ మేరేజ్ చేసుకున్నారేమో అనుకున్నాను." సంధ్య తల నిమురుతూ అంది.

సంధ్య ఒక్కసారి చిన్నపిల్లలా ఆవిడను కరుచుకుపోయి వెక్కి వెక్కి ఏడవసాగింది. ఎన్నో సంవత్సరాల నుంచి మూగగా అనుభవిస్తున్న బాధ, ఈ మధ్య మరీమరీ పడుతున్న ఆవేదన ఒక్కసారి కరిగి కన్నీళ్ళయి ప్రవహించ సాగింది.

# 46

చాలా సేపు అయిన తర్వాత సంధ్య వంటయింటివైపు వచ్చింది. ఆయా సంధ్య రాకని గుర్తించనిదానిలా అటు యిటు తిరుగుతూ పనులు చక్కబెట్టుకుంటోంది. ఊపిరి సలపనట్టు చేస్తున్న ఆ వాలకం చూస్తుంటే అది కావాలని పెట్టుకున్న పని అని సంధ్య గ్రహించింది.

పది నిమిషాలు గడిచాయి.

చివరికి తనే పిల్చింది.

"ఆయా!"

కడిగిన బియ్యం తీసుకెళ్ళి మరుగుతున్న నీటిలో వేస్తున్న ఆయా పలకలేదు. కనీసం వెనక్కి తిరిగి చూడనైనా లేదు.

"ఆయా?" మరికాస్త బిగ్గరగా పిల్చింది.

నిదానంగా బియ్యం వేయటం పూర్తిచేసి, గరిట కలియతిప్పి, మూతపెట్టి కొంగుతో చేతులు తుడుచుకుంటూ వెనక్కి తిరిగి "ఏమిటి?" అంది. ఆవిడ ఎంత సహజంగా వుందామని ప్రయత్నిస్తున్నా మనసులో రేగిన కల్లోలం ముడతలుపడిన ముఖంలో తొంగిచూస్తూనే వుంది. బల వంతాన తీరని వ్యధని దిగమింగటానికి ప్రయత్నిస్తున్నట్టుగా వున్న చిన్న చిన్న కళ్ళు కుదించుకుపోయి మరీ చింతాకులంత అయినాయి.

"ఆయా! ఇది-ఇది--నిజమేనా?-"

"ఏదీ?-"

సంధ్య ముఖం ఎర్రబడింది. అయినా నిగ్రహించుకుంటూ 'బాబు' అని పూర్తి చేయలేకపోయింది.

"వాడి సంగతి ఎందుకు చెప్పలేదు? అని నన్ను ఇప్పుడు నిలదీస్తున్నావు. అంతేనా? ఇన్ని సంవత్సరాల తర్వాత నీ ముందు నిలబడి జవాబు చెప్పాల్సి వస్తుందని నాకు జోస్యం తెలియలేదు. మీ నాన్నగారు చెప్పవద్దన్నారు. చెప్పలేదు. ఆయన ఒకసారి ఆజ్ఞాపించటం జరిగితే అది కల్లో కూడా వుల్లంఘించకూడదు అన్న సంగతి నీక్కూడా తెలుసు."

"కానీ-ఆయా-" సంధ్య వాదనకి దిగబోతుంటే ఆయా మధ్యలోనే వారించేసింది. "అయినా నా కెలా తెలుస్తుంది? పుల్లలావున్న కాళ్ళు చేతులతో చూసేవాళ్ళ ఒళ్ళు జలదరించేలా రక్తపు గుడ్డులా వున్న ఆ మాంసపు ముద్ద యీ బంగారు బాబేనని నేనేం కలగన్నానా? అప్పట్లో ఆ నర్సులు వాళ్ళు ఆప్రాణి ఒకటిరెండు రోజులకంటె ఎక్కువ బ్రతకదని ఖచ్చితంగా చెప్పారు. అయినా అప్పుడు మా దృష్టి అంతా నీ ఆరోగ్యం మీదనే వుంది" అనేసి మళ్ళీ తన పని చూసుకోసాగింది. ఆయా ఎప్పుడూ యింత నిక్కచ్చిగా, విసురుగా మాట్లాడడం చూడని సంధ్య తెల్లబోయి చూడసాగింది.

మళ్ళీ నిశ్శబ్దం ఏర్పడింది.

చివరికి సంధ్య మళ్ళీ తనే ఆడగలేక అడిగింది- "ఆయా! పోనీ మాధవ్ నీ కెప్పుడైనా——"

"చెప్పలేదు. కనీసం బాబు ఎవరో అనుమానం కలిగేలా కూడా ప్రవర్తించలేదు. అతని సంగతి వదిలెయ్. మగవాడు. ఏం? నువ్వు మాత్రం? మాధవ్ ఎవరో చూచాయగానైనా ఎప్పుడైనా మాటల మధ్య సూచనగానైనా తెలియజేశావా? చిన్నప్పటినుంచి కన్నతల్లికంటె ఎక్కువగా పెంచి పెద్దచేశానే? నా ఆలోచన్లు, నా జీవితం, నీ చుట్టూ అల్లుకుని బ్రతుకుతున్నానే! ఈ ప్రపంచంలో అన్నిటికంటె నీ క్షేమం, నీ సుఖం ఒక్కరోజు-ఒక్కసారయినా నీ బాధ ఏమిటో నాకు చెప్పావా? ఎన్ని రాత్రిళ్ళు అర్ధరాత్రివేళ ప్రక్కనున్న నాకు ఎక్కడ మెలుకువ వస్తుందో

న్లాపడుకుని, దిండులో ముఖం దించుకుని ప్రక్కలదిరిపోయేట్టు నువ్వు వెక్కి ఏడవటం నేను చూడలేదు? ఎన్నిసార్లు నన్ను మభ్యపరచ సకి ఏదో పుస్తకం చదివే నెపంతో మారుమూలపోయి కూర్చుని, శూన్యంగా చూస్తూ అశాంతిగా, నిర్జీవంగా కూర్చుని గంటలు గడపటం నేను గ్రహించలేదు? అయినా నేనేం చేయగలను? చూస్తూ వూరుకోలేక నిన్ను పెద్దరికంతో ఆజ్ఞాపించలేక నేనెంత క్షోభకి గురిఅయ్యానో, అవుతున్నానో నీకెలా తెలుస్తుంది? నేనసలు నీ కంటికి సాటిమనిషిగా కన్పిస్తేగా? మాటామంచీ లేకుండా పనీపాటా చేసుకుపోయే ఒక మరగా తప్పితే—"

"ఆయా!" బొమ్మలా నిలబడి కళ్ళప్పగించి చూస్తున్న సంధ్య హఠాత్తుగా అరిచింది.

సంధ్యవైపు వీపు పెట్టి నిలబడిన ఆయా ఆ కేకని లక్ష్యపెట్టలేదు. చీరచెంగుతో కళ్ళు గట్టిగా ఒత్తుకుంటూ "నువ్వు వర్షంలో తడిసినప్పుడు వచ్చిన జ్వరంలో నీ మాటల ధోరణి నేను, వాసు యెక్కడ వింటామో నని మమ్మల్ని దూరంగాపెట్టి అహర్నిశలూ ఆయనే ఉండాలని ప్రయత్నించడం ఆయన నీడనిచూసినా నువ్వు అసహ్యించుకుని ద్వేషించటం ఇదంతా చూస్తే నాకప్పుడే అనుమానం వచ్చింది. నా చూపుల్లో సందేహం ఆయన పసిగట్టాడు. అయినా ఒక్కమాట మాట్లాడలేదు. నన్ను మాట్లాడ నివ్వలేదు."

సంధ్య ఊపిరి బిగపట్టి వింటోంది.

"బాబు యెవరో అప్పుడు నాకు తెలియకపోయినా, అతని తల్లికి మాధవ్ జీవితంలో అంతగా స్థానంలేదని, అతని ధ్యాసంతా నీమీదనే వుందని, నువ్వే అందరికంటే ఆయనకి యెక్కువ అని గ్రహించడం ప్రారంభించిన తర్వాత అతన్ని అలా కర్కశంగా తిరస్కరించవద్దని నిన్ను యెన్నోసార్లు హెచ్చరించాలనిపించింది. కాని నాలిక చివరిదాకా వచ్చిన మాటలు పెదవులు దాటే ధైర్యం లేకపోయింది. ఎందుకని? నువ్వెంత చనువు యిచ్చినా, యెంత ఆప్యాయంగా చూసినా అప్పుడప్పుడు యజమానిని అనే స్వభావం మాటల్లోనో, చేతల్లోనో ప్రదర్శిస్తూవుంటావు. అందుకే సాహసించలేకపోయాను."

మధ్య ఆ
చెబుతుంటే నీ
ఆశ్చర్యం యింకా ఎన్నేన
నమ్మలేకపోతున్నాను. అప్పుడే ఆ
నాకు ఆరాటంగానేవుంది. మీ దాదాని హాస్పిటల్‌కివెళ్ళి కనుక్కో
వాలనుకుంటూనేవున్నా. కాని వ్యవధానం ఏది? అప్పుడే ఆ కాలు
దాడులు." మండుతున్న పొయ్యిమీద దృష్టిని నిలిపి నిలబడిన ఆయా
అప్పటికే బాగా తగ్గి గాద్గదికమై మాటలు పెగలలేదు. చటుక్కున వెనక్కి
తిరిగి సంధ్యవైపు చూస్తూ రెండుచేతులు జోడించి ఏడుస్తూ "సంధ్యా!
నీకు పుణ్యంవుంటుంది. నీ కాళ్ళు పట్టుకుంటాను. అవన్నీ మళ్ళీ నాకు
గుర్తుచేసి నన్ను చంపకు. నేను భరించలేను. నాకు శక్తిలేదు" అంది.

సంధ్య నిద్రలో లేచి నడుస్తున్నదానిలా తడబడుతున్న అడుగులతో మెల్లగా ఆయాదగ్గరగా వచ్చింది. ఆయా జీర్ణించివున్న చేతుల్ని రెండుచేతుల్లో పట్టుకుంటూ "నన్ను-నన్ను క్షమించు" అంది. "వద్దులే. అంతలేసి మాటలనకు." సంధ్యచేతుల్ని విడిపించుకుని కళ్ళుతుడుచుకుంటూ అంది.

పాలిపోయినముఖంతో ఆయా చేతిని గట్టిగా తన రెండు చేతుల మధ్య పట్టుకుని అంది సంధ్య- "నేను పాషాణంలా ఎందుకు మారి పోయానో నీకు తప్ప యింకెవరికీ తెలియదు. ఆయా! నేను నిజంగా స్వార్ధపరురాలనే! ఆ బాధలో, ఆ వ్యధలో నా కోసం బాధపడుతున్న ఒక జీవి మూగగా నావెంట వుందని గ్రహించలేని గుడ్డిదాన్ని అయ్యాను. అది నా పొరపాటే. నా మూర్ఖత్వాన్ని మన్నించు. నా ఆవేదన ఏదీ నీకు చెప్పక పోవటానికి కారణం నువ్వు పరాయివ్యక్తివి పనిమనిషివని• అన్న నీచ

V–12

కలిగించే

అంతకంటె యింకేం

...స ... ధ్యని దగ్గరకులాక్కుని అక్కున

కుంది. సంధ్యకి ఏడుపు ముంచుకువచ్చేసింది.

"నువ్వు నన్ను తల్లిగా చూస్తున్నావు. నిజమే కానీ కన్నబిడ్డగా నీ ...నా కర్తవ్యం నేను నెరవేర్చుకుంటున్నానా? లేదు. అదే నా బాధ. ...నా యీ అశక్తతకి, దురదృష్టానికి బాధపడని క్షణంగాని, సిగ్గుపడని నిమిషంగాని లేదు. అంతేతప్ప-"అప్పటికే ఆయా సంధ్యతలని గుండెలకి నొక్కుకోవడంవల్ల సంధ్య పూర్తిచేయలేకపోయింది.

"సంధ్యా! నా తల్లీ. నేనే పొరబడ్డాను. ఈ ముసలిదాని మాటలు పట్టించుకోకు. దీన్ని గురించి నువ్వింకేమీ మాట్లాడవద్దు. నువ్విది మనసులో వుంచుకున్నావంటే నామీద ఒట్టే. ఈ రోజుతో, ఈ క్షణంతో జరిగిందంతా మర్చిపోదాం. మర్చిపోతేతప్ప బ్రతకలేనంత భయంకరమైన బాధలకి గురిఅయ్యాం. వాటిమూలంగానే ఎవరికివాళ్ళే వంటరిగోడలు చుట్టూ కట్టుకుని సమాధుల్లో శవాల్లా యిన్నాళ్ళూ గడిపాం అవన్నీ ఈ రోజుతో సరి. లేకపోతే రేపటిరోజుని, రాబోయే భవిష్యత్‌నికూడా యిలాగే శూన్యం చేసుకోగల ప్రమాదం వుంది."

• "ఔను, ఔను. నేనుకూడా భరించలేను." వెక్కిళ్ళమధ్య అస్పష్టంగా అంది సంధ్య. మూసుకున్న కళ్ళముందు ఆయా గుండెలమీదుగా ఎన్నెన్నో దృశ్యాలు గబగబా తిరుగుతున్నాయి.

ఆ అర్ధరాత్రి నిశ్శబ్దం ఉన్నట్టుండి కేకలు, పరుగులు, తలుపులు విరగదన్నిన చప్పుడు ఇంట్లో తుపాకులు ధరించిన సిపాయిలబూట్లశబ్దం, తండ్రి లేచి తుపాకి పుచ్చుకుని యెదురు వెళ్ళడం. "ఒక్కడుగు

ముందుకు వెళ్లారా చస్తారు." ఆయన వుర్దూలో గర్జించటం, ఆ గర్జన సాంతం ముగియకముందే తుపాకులు మోగినశబ్దం, వున్నట్టుండి కెవ్వు మన్న కేక, ఆ కేకవేసింది ఎవరో తెలుసుకోలేకుండా చేసే పొగ తేలిపోయేసరికి ఛాతీమీద దెబ్బ తగిలినచోట రెండు చేతుల్తో పట్టుకుని బంతిలా దొర్లిపోతున్న తండ్రి, తనలా చూస్తుండగానే ఆయన కను గుడ్లు రెండు మూడుసార్లు తిరిగి మరుక్షణంలోనే నిర్జీవం అయిపోవటం- కెవ్వుమని అరవబోతే ఆయా చప్పున నోరుమూసి ప్రక్కకు లాగటం- తను నోరు గట్టిగా రెండు చేతుల్తోమూసుకుని బిగ్గరగా వచ్చిన ఏడుపుని నిగ్రహించుకోటానికి ప్రయత్నిస్తూండగా ఇంతలో గదిలోకి దాదా పరుగెత్తుకువచ్చి ఆయాతో "పిల్లల్ని తీసుకుని తోటలోకి పారిపో! ఉత్తరంవైపు పొండి, నేను వాళ్ళు అటు రాకుండా చూస్తాను" అని మెరుపులా మళ్ళీ బైటకి పరుగెత్తటం-ఆయా, తను, వాసు ప్రాణాలు అరచేతుల్లో పెట్టుకుని చీకట్లో తోటలో చెట్లకి అడ్డంపడి పరుగెత్తటం- చివరకి వుత్తరంగా వున్న ప్రహరీగోడని చేరుకుని ఎలాగో కష్టపడి దాని మీద ఎక్కి అవతలికి జారుతుంటే, చలాగ్గా దూకాలని ప్రయత్నించిన వాసు ఆ భయంలో ఆ కంగారులో కాలు పట్టుదప్పి దభీలుమని నేలమీద కుప్పలా కూలబడి పోవటం- ఆ వెంటనే లేవబోయి 'అమ్మో' అని క్రిందికి ఒరిగిపోవటం, ఆయా తను వాడి నోరు మూసి యిద్దరూ చెరో రెక్క పట్టుకుని వాడు బాధతో విలవిలలాడ్తూ నన్ను పట్టుకోవద్దు నా ప్రాణం పోతోంది అని గిలగిలా తన్నుకుంటున్నా లక్ష్యపెట్టకుండా చీకటిగా వున్న ప్రదేశంలో యిప్పుడో, మరికాసేపటిలోనో మీదపడి కబ ళించబోయే మృత్యువు కోసం ఎదురుచూస్తూ భయంతో గోడకి బల్లుల్లా అంటుకుపోయి చెమటలు కక్కుతూ నిలబడటానికి ఇంతలో అంత దుర దృష్టంలోనూ అదృష్టదేవత ఆప్యాయంగా చిరునవ్వు నవ్వింది అన్నట్టు ఆయాకి తెలిసిన సిపాయే ఒకడు అటువైపు రావటం- అతను గుర్తుపట్టి యెలాగో అతిప్రయాసమీద ప్రాణాలకి తెగించి తమకి సాయంచేసి సురక్షితమైన ప్రదేశానికి చేర్చటం- ఆ తెల్లవారు ఝామున అతనే మళ్ళీ వచ్చి దాదాకూడా చనిపోయాడని చెప్పటం- ఆయా ఒక్కసారి బావురు మంటుంటే తను దగ్గరకు తీసుకుని ఆవిడని సముదాయించటం-యింకా

ఎన్నెన్నో-సంధ్య అంత ఏడుపులోనూ తల గట్టిగా అటు ఇటు తిప్పుతూ "వద్దు వద్దు. నేను భరించలేను. నాక్కూడా పిచ్చెక్కేట్టుగా వుంది" అంది.

చాలా రోజుల తర్వాత అలా పసిపిల్లలా వచ్చి తన ని పెనవేసుకున్న సంధ్యని చూడగానే క్రమేపీ ఆయా హృదయంలో అశాంతి తొలగి కళ్ళలో ఆనందాశ్రువులు నిండుకొనసాగినవి.

ఆ రాత్రి సంధ్య బాబుని తాకాలన్నా, వాడివైపు చూడాలన్నా భయపడింది. ఎంత వద్దనుకున్నా మళ్ళీ దృష్టి వెళ్ళి వాడిమీదనే నిలుస్తోంది. మాటి మాటికి ఇది నిజమా, నిజమా? అన్పించసాగింది. వాడి ముఖం మీద కళ్ళు నిలవగానే ఏదోవింతగా, ఆసక్తిగా, భయం భయంగా వుండే అనుభూతి కలుగుతోంది. అసలు యీ సృష్టిలో మనిషిపుట్టుకే మహాచిత్రం. అందులో బాబు జన్మవృత్తాంతం మరీ విచిత్రంగా వుంది. బాబు తనవాడని తెలిసిన తర్వాత మాధవ్ ఎందుకో వేరుగా అన్పించటం లేదు. అతను మళ్ళా తన జీవితంలోకి రాకపోతే బాబుని యిలా కళ్ళారా చూసుకునే భాగ్యం తనకి కలిగేదా! అస లిన్నాళ్ళు బాబు యెవరో తనకెందుకు తెలియ జేయలేదు? లేక అతను తెలియజేసే అవకాశమే తనివ్వలేదా! అప్పుడప్పుడు అతను బాబు నెత్తుకొని గుండెలకి హత్తుకుంటే ఆ దృశ్యం చూడగానే తనలో ఈర్ష్య భగ్గుమని ఆకాశంయెత్తున ఎలాలేచేది? బాబు తల్లిని అతను అధికంగా ప్రేమించేవాడని, ఆ అనురాగానికి చిహ్నం కాబట్టే వాడంత అపురూపం అని ఏవేవో అనుకున్నది. ఆ ఆలోచనలే ఒకవేళ నిజం అయితే ఆ వ్యక్తి ఎవరు?

ఇది గుర్తుకు రాగానే సంధ్య ఎలాగో అయిపోతోంది. మనసులో అంత అభిమానం వుంచుకున్నమాట ఒక్కనాడు కూడా, ఒక్కసారి కూడా బైట పడలేదేం? అప్పుడప్పుడు అతను చూపిన చనువుచూసి అది అధికారం అని భయపడి అసహ్యించుకుంది. అసహ్యం బైట పెట్టటంలో ఏమాత్రం జంకు చూపించలేదు. అతనికి అంత ఓర్పు ఎలావచ్చింది? ఎందుకు వచ్చింది? ఇంత బాధని మూగగా అనుభవించాల్సిన అవసరం ఏముంది? నిజాన్ని నిర్మొహమాటంగా చెప్పేసి బాబు కాదు అని తేల్చుకోవచ్చుగా! లేక బాబునికూడా ద్వేషిస్తానని భయపడ్డాడా! బాబు ఎవరో తెలియకముందు కొద్దిగా ద్వేషించినమాట నిజమే. అది పూర్తిగా బాబు

మీద కూడ కాదు. వాడంటే అతనికి అంత అపురూపం, వాడికేదయినా బాధ కలిగితే అతని మనసు ఎలా విలవిలలాడ్తుందో చూడాలనిపించి బాబుకి ఏదయినా ఆపద రావాలని తను కోరుకున్న మాటకూడ నిజమే. ఒకటి రెండుసార్లు తనే బాబుకి అపకారంచేసి దాని ద్వారా మాధవ్ చిత్ర హింసకు గురి అవుతుంటే ప్రతీకారం తీర్చుకోవాలని గట్టిగా అనుకున్న క్షణాలుకూడా వున్నాయి.

కానీ ఎప్పటికప్పుడే బాబు ముఖంలోకి చూడగానే నిష్కల్మష మైన వాడిమాటలు, దేవుడిని గుర్తుకుతెచ్చే ఆ అమాయకత్వం నిండిన పసితనపు చిరునవ్వు-తనెంత దారుణంగా ఆలోచిస్తోందో గుర్తుకుతెచ్చి మరుక్షణంలో సిగ్గుతో చితికిపోయేలా చేసేవి. అప్పుడెప్పుడన్నా తనా ఈర్ష్యకి, అసూయకి లొంగిపోయినట్టయితే ఏమయేది! తర్వాత బాబు తనవాడని తెలిస్తే నిజమైన శిక్ష ఎవరు పొందేవాళ్ళు! సంధ్య శరీరం జలదరించింది. ఇన్నిరోజులు బాబెవరో చెప్పకుండా దాచినందుకు మాధవ్ మీద కోపంవచ్చిందికూడా. తీక్ష్ణమైన సూర్యకాంతి సోకగానే దట్టంగా పట్టిన మంచు కరిగిపోయే ప్రకృతి రూపురేఖలు సుస్పష్టంగా కన్పించినట్టు మాధవ్‌పట్ల ద్వేషం అంతరించగానే అతని వ్యక్తిత్వం, విశాల హృదయం, మంచితనం బాగా అర్థం కాసాగాయి. ఒక్కసారి వెనక్కి తిరిగి చూసు కుంటే అతను చేసిన ప్రతిపని వెనక ఒక అర్థం, పలికిన ప్రతిమాట వెనక కొంతబాధ, బలవంతంగా తెచ్చి పెట్టుకున్న సహనం కనిపిస్తు న్నాయి. బాబెవరో తెలిసిం తర్వాత యెలాంటిభావం లేకుండా నిర్లిప్తంగా ఉండడానికి ఎలాసాధ్యం? మారిన మనిషని అతనికి అర్థం అయేలా చెప్పటానికి మాట లెలా దొరుకుతాయి?

సంధ్య మాధవ్ రాకకోసం వేయికళ్ళతో ఎదురు చూడసాగింది.

# 47

సిస్టరున్న రెండు వారాలు యిట్టేగడిచిపోయినాయి. ఆవిడ బాబుని, సంధ్యని వదిలి వెళ్ళలేక వెళ్ళింది. మాధవ్ రాగానే తనకి తెలియ చేయ మని, అతన్ని తాను చాలా అడగాలని అనుకుంటున్నానని చెప్పింది. ఇక

నుంచి ప్రతివేసవిలో యిక్కడికివచ్చి వారం పదిరోజులు ఉండి వెళ్ళమని ఆయా మరీ మరీ చెప్పింది. మాధవ్ సంధ్య కలసి ఆహ్వానిస్తే తప్ప కుండా అలాగేవస్తానని చిరునవ్వుతో సంధ్యవైపు చూస్తూ జవాబు చెప్పింది ఆవిడ.

సిస్టర్ వెళ్ళిపోయికూడా పదిరోజులు కావస్తోంది. మాధవ్ జాడా జవాబులేదు. ఏదో వంకపెట్టి గోవిందుని కంపెనీకి పంపి అతను యెక్కడున్నాడో యెప్పుడు వస్తాడో తెలుసుకోవాలని యెంత ప్రయత్నించినా లాభం లేకపోయింది. అతను టూర్ మీద వెళ్ళాడనీ, ప్రస్తుతం ఫలానా చోటున వున్నాడని ఖచ్చితంగా చెప్పలేమనీ సమాధానం పంపారు వాళ్ళు. రోజులు గడచినకొద్దీ సంధ్య కెందుకో మనసులో అవ్యక్తమైన దిగులు లాటిది మొదలసాగింది. ఎంత చిక్కబట్టుకుందామన్నా సాధ్యం గావడం :. అడ్రస్ తెలిస్తే 'నాన్నా! ఇంటికిరా-బాబు' అనో, లేక 'మీ కోసం ఎదురుచూస్తున్నాం- సంధ్య, బాబు' అనో వైర్ యిప్పించవచ్చు, కనీసం ఉత్సాహలంపట్టలేక అయినా రావచ్చు.

వెళ్ళేరోజు అతను చెప్పనే చెప్పాడు. 'చాలాదూరం వెడుతున్నాను. బాబు జాగ్రత్త' అని. కానీ అది ఎంతదూరం? ఆ ప్రయాణం ఇంకా యెన్నాళ్ళు?

అతనికోసం అంత ఆత్రంగా యెదురుచూస్తున్నా మనసులో మారుమూలగా యెక్కడో యిన్నాళ్ళు తనుచూపిన నిర్లక్ష్యాన్ని అతను అంత తేలికగా క్షమిస్తాడా? ఏ కారణంచేత అంత కఠినంగా ప్రవర్తించిందీ అతనికి వివరంగా చెప్పెయ్యాలి. కాని ఎలా చెప్పటం? ఏనాడూ అతనిముందు నిలబడి సూటిగా మాట్లాడటం అంటే ఏమిటో తనకి తెలియదు. ఇప్పుడు ఆ శక్తివస్తుందా? ఆ సాయంత్రం సంధ్య గదిలోకూర్చుని బాబు షర్టుగుండీలు కుడుతూ మాధవ్‌ని గురించి ఆలోచిస్తోంది.

అంతలో బైట కారుహారన్ విన్పించింది. సంధ్య వులిక్కిపడింది. కారు లోపలికివచ్చి ఆగినశబ్దంకూడా విన్పించింది. గదిలో కూర్చుని ఆడుకుంటున్న బాబు 'నాన్న వచ్చాడు-నాన్న వచ్చాడు' అంటూ బైటకి పరుగెత్తాడు. సంధ్య తనుకూడా వెంటనే వెళ్ళడానికి లేచి మళ్ళీ అంతలోనే ఆగి కూర్చుని మామూలుగా కుట్టుకోటానికి ప్రయత్నించసాగింది. కానీ

కట్టు కుదరటంలేదు. సూదివెళ్ళి వేలిలోదిగింది. వేళ్ళకొనలకి చిరుచెమటలు అలముకున్నాయి. శరీరంలో రక్తం అంతా ఒక్కసారి ముఖంలోకి పొంగినట్టుగావుంది. మరుక్షణంలో దగ్గరగా విన్పించబోయే సుపరిచితమైన స్వరంకోసం ఆదుర్దాగా ఎదురుచూస్తున్న సమయంలో ఆయా గుమ్మంలోంచి తొంగిచూస్తూ—

"నువ్విక్కడున్నావా? ఎవరో వచ్చారు. నువ్వు కావాలని అడుగుతున్నారు" అంది. సంధ్య తలెత్తిచూసింది! చేతిలో షర్టు జారిపోయింది. "నన్నా!" అంది ఆశ్చర్యంగా! అయితే వచ్చింది మాధవ్ కాదన్నమాట! కాదని ఆయా ముఖం చెబుతూనేవుంది. అబ్బ! నిరాశ యింత పదునుగా వుంటుందనికానీ, అది ఇంత నిర్దాక్షిణ్యంగా చీలుస్తుందనికానీ సంధ్యకిఇంత వరకూ తెలియదు.

"నిన్నే! ఈ యింట్లో సంధ్య అంటే 'ఎవరు' అని అడుగుతున్నారు. ఆయన కంపెనీనుంచి వచ్చాడుట."

సంధ్య గుండెల్లోకి పొంగుతున్న వేడిరక్తం క్రమేపీ చ[illegible] పోయింది. ఆయా చెప్పిందేమిటో అర్థంకానిదానిలా లేచి హాలులో వచ్చింది.

సంధ్య రాగానే అక్కడ నిలబడివున్న ముగ్గురు మగవాళ్ళు ఒకేసారి నమస్కారం చేశారు. సంధ్య ప్రతినమస్కారం చేసింది. వాళ్ళలో పంచె, లాల్చీతో, కళ్ళద్దాలతో పొట్టిగా వున్నాయన ఒకడుగు ముందుకు వేసి "నా పేరు శ్యామసుందరం. నేను మీ కంపెనీకి లీగల్ ఎడ్వయిజర్ని" అన్నాడు.

సంధ్య ఆయన చెప్పేదేమిటో బొత్తిగా అర్థంకాని దానిలా చూస్తోంది.

"వీళ్ళిద్దరూ మీ భాగస్వాములు." మిగతా యిద్దర్నీ పరిచయం చేశాడు.

"కూర్చోండి" అంది.

"మీరుకూడా కూర్చోండి" అన్నాడు లాయరు శ్యా[illegible]

సంధ్య కూర్చోలేదు, కుర్చీ వెనకాలగా ని[illegible]

ముగ్గురూ కూర్చున్నారు. భాగస్వాముల్లో ఒకాయన గుమ్మానికున్న పరదాలు అవీ పరిశీలిస్తున్నాడు.

రెండో ఆయన చూపులు నేలకి కరుచుకున్నాయి.

వీళ్ళకి యిక్కడ ఏంపని? ఎందుకొచ్చినట్టు? మీ కంపెనీ మీ భాగస్వాములు అంటారేమిటి? అప్పుడే అనేక ప్రశ్నలు సాగినాయి.

శ్యామసుందరంగారు కళ్ళజోడు తీసుకుని జేబురుమాలుతో ...కుంటూ "మీకెలా చెప్పాలో తెలియటంలేదు." అన్నాడు.

"ఏమిటది" అంది వెంటనే. సంధ్య అడిగినతీరు చూడగానే ముగ్గురూ ...ాలు చూసుకుని వూరుకున్నారు.

"చెప్పండి" అంది సంధ్య. వాళ్ళ వాలకంచూస్తుంటే యేవో చెప్పాలను...చ్చి చెప్పలేనట్టు అవస్థపడుతున్నట్టుగా వుంది.

"మీరీమధ్య కలకత్తా దగ్గర రైలు ప్రమాదం గురించి పేపర్లో చదివారా?"

...ంధ్య చదవలేదన్నట్టుగా గట్టిగా తలూపింది. అయినా దానికి, ...ాకకీ ఏం సంబంధం? అర్థంకాని అనుమానంతో భయంతో మన...సులో సప్త సముద్రాలు పొంగుతున్నాయి.

"అందులో కొద్దిమంది గాయపడ్డారు." వేరులా సన్నగా వున్నాయన అన్నాడు.

"చాలామంది చనిపోయారు, ఈ మధ్యకాలంలో యెప్పుడూ అంత ప్రమాదం జరగలేదట." నేలమీద గుచ్చి చూస్తున్నాయన తలెత్తుతూ అన్నాడు.

సంధ్యచేతులు ముందున్న కుర్చీని గట్టిగా పట్టుకున్నాయి.

"మాధవ్ అదే ట్రెయిన్‌లో వున్నారు. ఇదిగో చూడండి. అదే ట్రెయిన్‌కి వస్తున్నట్టు స్టేషన్‌కి కారు పంపమని యిచ్చిన టెలిగ్రాం" శ్యామసుందరం జేబులోంచి టెలిగ్రాం తీసియిచ్చాడు. యెంతమ...దిచేతులు ...సుద పడ్డాయో! నలిగి చిరగటానికి సిద్ధంగావుంది.

...ణుకుతున్న చేతుల్తో అందుకుని చూసింది. అక్షరాలు సరిగ్గా నిల...

...గో సముద్రపుహోరు విన్పిస్తోంది. అది అంతకంత... వస్తున్నట్టు అన్పించసాగింది.

"అక్కడికి మేం వెంటనే వెళ్ళి కలకత్తాలో వారున్న హోటల్లో ఎంక్వయిరీ చేశాం. ఆ హోటల్ టాక్సీ అతనే స్వయంగా స్టేషన్‌దగ్గర చి వచ్చానని చెప్పాడు."

"అంటే!" పెదవులు తడారిపోతుండగా అడిగింది సంధ్య.

"యాక్సిడెంటు అయిన వాళ్ళందర్నీ చేర్పించిన హాస్పిటల్ అంతా కూడా వెతికాం. చివరికి ముఖం చితికిపోయి రెండుచేతులు విరిగిపోయిన ఒక శవంజేబులో యివి దొరికాయి." మరో జేబులోంచి పర్సు కలిసివున్న చిన్నడైరీ, తాళంచెవులు తీసి మధ్యనున్న టేబులు మీద పెడుతూ అన్నాడు.

"ఏమిటీ? ఏమిటండీ మీరనేది?" అంతవరకూ లోపలిగుమ్మంలో నిలబడి యిదంతా వింటున్న ఆయా ఆదుర్దాగా యివతలకి వస్తూ అంది.

"మేంకూడా నమ్మలేకపోయాం. కానీ ఇవిచూసిన తర్వాత..." శ్యామసుందరం గుటకమింగి ఉరుకున్నాడు.

ఆయా ఏడుస్తూ "సంధ్యా" అంటూ దగ్గరగా వెళ్ళబోయింది. అప్పటికే తడుముకుంటున్నదానిలా గోడనిపట్టుకుని లోపల గుమ్మంవైపు నడుస్తోంది సంధ్య.

"మీరు ధైర్యం తెచ్చుకోవాలి." వెనకనుంచి శ్యామసుందరం అంటున్నాడు. ఎంతో ప్రయత్నంమీద గుమ్మం దాటగలిగిన సంధ్య ఆ పైన శక్తి లేనట్టు అక్కడే కుప్పలా కూలిపోయింది.

# 48

ఎంత దురదృష్టం! అన్నిరోజులు అనుక్షణం కళ్ళముందు తిరిగిన మనిషిని కళ్ళెత్తి అయినా చూడలేదు. అతను లేదని తెలిసింతర్వాత మనసంతా అతని రూపమే నిండిపోయింది. శరీరంలో అణువణువు అతనే కావాలంటోంది. జీవితంలో అడుగడుక్కీ దుర్విధి ఎందుకిలా వంచిస్తోంది? ఏంపాపం చేసింది తను! కాస్త జీవనజ్యోతిని వెలిగించుకోవాలని ఆశించటం ఆలస్యం, ఝంఝామారుతంలాంటి అవాంతరం ఏదో ఒకటి విసురుగా వచ్చి దాన్ని ఆర్పేస్తుంది, మళ్ళీ కళ్ళముందు అంతా చీకటి. ఎప్పటి

కప్పుడే వయసుకిమించిన వైరాగ్యం. ఈసారి తగిలిన ఈ దెబ్బనుంచి కోలుకుంటాననే ఆశ ఏమాత్రం లేదు. ధైర్యం, సహనం పూర్తిగా సడలిపోయినాయి. భూతాన్నిచూసిన చిన్నపిల్లలా జీవితం అంటే బెదురు పుడ్తోంది. ఎంత అభాగ్యురాలు కాకపోతే పూర్తిగా అతన్ని పోగొట్టుకునే ముందు అతన్ని గుర్తించటం జరుగుతుంది? శేషజీవితం అంతా అతన్ని గురించిన జ్ఞాపకాలతో వెర్రిదానిలా బ్రతకమనే భగవంతుడిలా శిక్షించేది. సంధ్య కూర్చున్నా, నిలబడినా, ఇంట్లో ఏమూల తిరిగినా అతని రూపమే కన్పిస్తోంది. అతనిమాటలే విన్పిస్తున్నాయి. ఆఖరిరోజు అతని ప్రవర్తన, బాబుని అప్పగిస్తున్నాననటం, బలవంతంగా తీసుకొచ్చి తనగదిలో అతనే స్వయంగా పడుకోబెట్టడం యిదే పదేపదే కళ్ళముందు కన్పిస్తున్నాయి.

అన్నిటికంటె విచిత్రం! మాధవ్ తన మరణం ముందే తెలుసుకున్నట్లు విల్లు వ్రాసిపెట్టాడు. అందులో అతని ఆస్తికంతా వారసుడైన బాబుకి సంధ్యని గార్డియన్‌గా నియమించాడు. వాసు చదువు నిమిత్తం కొంత వేరుగా కేటాయించాడు. తన అనంతరం వాసు బాబుని స్వంత తమ్మునిలా చూడాలనీ, పెరిగి పెద్దయిన తర్వాత ఏ విషయంలోనూ తనులేని లోటు రానివ్వకుండా కన్నతండ్రిలా చూడాలనీ ప్రత్యేకంగా కోరాడు. సంధ్యని బాబుకి గార్డియన్‌గా నియమించడంకంటె సంధ్యగురించి యింకేమీ లేదు. తన కర్మ కాండల పేరుతో డబ్బు దుబారా చేయకూడదని, రాంగోపాలరావుగారి హాస్పిటల్‌కి తన పేరుమీద కొంతడబ్బు విరాళం మాత్రం యివ్వాలనీ సూచించాడు. తను బ్రతికున్నంతకాలం బాబు సంరక్షణ చూడవలసిందిగా ఆయాని కోరాడు. ప్రతిఫలంగా ఆయాకి తిండీ బట్టా బాబు డబ్బులోంచి ఖర్చుపెట్టటమే కాకుండా ఆయా పేరుమీదుగా విడిగా వేయిరూపాయలు కేటాయించాడు.

వాసు బాబుని కౌగిలించుకుని ఒకటే ఏడుపు. చదువు మానేస్తానని కూర్చున్నాడు. అక్కా, తమ్ముడు ఇద్దరూ వాదించుకున్నారు. చివరికి విసిగిపోయిన సంధ్య "బాబుకేం ఫర్వాలేదు. నేను లేనా? ఆయా లేదా?" అంది కోపంగా.

వాసు మండిపడ్డాడు. "ఉన్నావులే మహా? నువ్వసలు బాబుని ముట్టుకోవటానికికూడా వీల్లేదు. బ్రతికినంత కాలం ఆయన్ని రాక్షసిలా

కాల్చుకు తిన్నావు అంత సాయంచేస్తే ఒక చల్లని మాట మాట్లాడలేదు. కృతఘ్నురాలివి. నీ పెంపకంలో బాబుని వదిలేస్తే ఆయన ఆత్మకి శాంతి కూడా వుండదు."

సంధ్యకి ఏడుపుతోపాటు నవ్వుకూడా వచ్చింది. "అంతేరా వాసూ! నన్ననటానికి నీకు యింకే మాటలు దొరకలేదా?" అంది.

వాసు మాట్లాడలేదు. విసురుగా తలతిప్పుకుని వూరుకున్నాడు.

"నువ్వు చదువుకోవటమే ఆయన ముఖ్య వుద్దేశం" అని సంధ్య మరీ మరీ నొక్కి నచ్చచెప్పటంవల్ల చివరికి వాసు ఎలాగో సగం అయిష్టంగానే స్కూలుకు వెళ్ళటానికి ఒప్పుకున్నాడు. వెళ్ళేముందు బాబు విషయం ఆయాతో వందసార్లు హెచ్చరించి మరీ వెళ్ళాడు.

ధైర్యంగా ఉండటానికిగాను సంధ్య కోరికమీద గోవిందు కుటుంబంతోసహా వచ్చి యింట్లోనే వుంటున్నాడు. సంధ్య తనకోసం కట్టించుకున్న ఇల్లు హాస్పిటల్ పెట్టటానికి గవర్నమెంట్‌కి ఇచ్చేసింది. ఆయా ఒంట్లోకూడా అంత బాగుండటంలేదు. వార్ధక్యంబాగా వచ్చేసింది. మనిషికి రాత్రిపూట చూపు సరిగ్గా తెలియటంలేదు. మాటి మాటికి ఏదో కారణం కల్పించుకుని ఏడుస్తూ 'ఇంకా నేనెందుకు బ్రతికున్నానురా భగవంతుడా! ఇంకా నేనేం చూడాలి? ఈ గుక్కెడు ప్రాణం గుటుక్కుమనటానికి ఇంకా యెంతకాలం? ఏన్నాళ్ళు నాకీ నరకయాతన' అని తరుచుగా అన సాగింది.

సంధ్యకి ఒక్కదానికే ఏడుపు రావటంలేదు. ఆయా, వాసు మాధవ్ కోసం దుఃఖిస్తున్నారంటే వాళ్ళకా అధికారంవుంది. అతనికీ వాళ్ళకీమధ్య ఒక ఆత్మీయత అనే బంధం వుంది. తనకేం వుంది? ఏ అర్హతతో తను అతని లేనిలోటుచూసి బాధపడుతుంది? సంధ్య లోలోపల కుమిలిపో సాగింది.

ఈ మధ్య ఈ గందరగోళంతో, ఈ కంపెనీ వ్యవహారాలతో ఈ లావాదేవీలతో లాయరు శ్యామసుందరం చీటికి మాటికి వస్తూపోతూ ఉండటంవల్ల బాగా చనువయారు. ఆయన సంధ్య అడక్కుండానే చాలా సహాయం చేశారు. ప్రతిఫలం యివ్వబోతేకూడా పుచ్చుకోలేదు.

"ఇది నా ధర్మం. ఆయన నా కెలాటి పరిస్థితుల్లో సహాయంచేశారో మీకు తెలియదు" అన్నాడు.

సంధ్య కుతూహలంగా అప్పుడప్పుడు యథాలాపంగా అడిగినట్లు అడిగి అసలు సంగతి అంతా రాబట్టుకుంది.

మొదటినుంచి ఆయన ప్రాక్టీసు అంతంత మాత్రంగా ఉండేదట! ఎనమండుగురు పెళ్ళిళ్ళు కావల్సిన చెల్లెళ్ళు, ఇద్దరు చదువుకుంటున్న తమ్ముళ్ళు ఇదీ ఆయన సంసారం. పైసా సంపాదనలేదు. ఇంట్లో ఎప్పుడు చూసినా దరిద్రదేవత తాండవం చేస్తూనేవుంది తమ్ముళ్ళు చెల్లెళ్ళు సూటీ పోటీ మాటలు విసురుతుంటే కన్నెపిల్లలు అర్ధాకలితో పస్తులు పడుకుంటుంటే కట్టుకున్న ఇల్లాలు కంటతడి ఎప్పుడూ తుడిచెయ్యలేనేమో అనే భయంతో, అందరిచేత 'అసమర్థుడి'ని అని అన్పించుకోలేక క్రుంగిపోతూ, చివరికి ఓరోజు తెగించి విరక్తితో ఆత్మహత్యకు పాలుపడ్డారు. అదే సమయంలో - ఇంకో పది నిమిషాల్లో జీవితం అంతం చేసుకోబోయే తుదిఘడియల్లో ఒక స్నేహితుడు ఆదరాబాదరా పరుగెత్తుకువచ్చి అర్జెంటుగా రమ్మనమని మాధవ్ దగ్గరకు తీసుకెళ్ళాడు. వ్యాపారరీత్యా చిన్న లిటిగేన్ అది. మాధవ్ కంపెనీ లీగల్ ఎడ్వయిజర్ విశ్రాంతికోసం నంది ల్స్ వెళ్ళి అక్కడున్నాడు. 'అర్జెంట్ మేటర్ సెటిల్ కావాలి' మాధవ్ లు శ్యామసుందరంగారికి యిచ్చాడు. అది మొదలు తర్వాత మాధవ్ ద్వారానే ఒకళ్ళిద్దరు బాగా డబ్బు పలుకుబడి గల వ్యాపారస్థులు క్లయింట్సుగా దొరికారు. దాంతో అతని దశ తిరిగింది. ఒకటి రెండు క్లిష్టమైన కేసుల్లో అతను గెలిచాడు దాంతో బాగాపేరు వచ్చింది. క్లయింట్స్ కూడా పెరిగారు ఈ మధ్యే మాధవ్ కంపెనీ లీగల్ ఎడ్వయిజర్ చనిపోవటంతో ఆపనికూడా అయనకే వచ్చింది. మొత్తానికి మాధవ్ పరిచయం అతని జీవితంలో ఓ పెద్ద మలుపు. ఆమలుపు తిరిగింతర్వాత అతనికి అసలు ఆనాడు ఆత్మహత్య ఎందుకు చేసుకోవాల్సి వచ్చిందో సరిగ్గా అలోచించే తీరుబడి లేకుండా పోయింది. అదీ ఆయన కథ. ఈరకంగా మాధవ్‌ని గురించిన కబుర్లు వినడం ఈమధ్య సంధ్యకి బాగా అలవాటయిపోయింది. అందులోనే శాంతి లభించసాగింది.

ఆరోజు-

బాబు నిద్రపోయాడు. ఆయాకూడా పడుకుంది. శీతాకాలం. బాగా చలివేస్తూండడంవల్ల రాత్రి ఎక్కువపొద్దు పోకపోయినా అప్పుడే వూరంతా మాటు మణిగింది. సంధ్య పుస్తకం ఒకటి ఒళ్ళోపెట్టుకుని రెండుచేతులూ గడ్డంకింద ఆనించుకుని శూన్యంలోకి చూస్తూ కూర్చుంది. కొన్ని రాత్రుల నుంచి కళ్ళు నిద్ర అనేది ఎలావుంటుందీ మర్చిపోయినాయి. గంటల తర బడి అలా శూన్యంలోకిచూస్తూ కూర్చోవాలనిపిస్తుంది. శూన్యం కాక తనకు మిగిలింది ఏమిటీ? ఇలాగే యెన్నోరాత్రులు గడుస్తాయి. ఈ ఇంట్లోనే తన జీవితం తెల్లవారుతుంది అనటానికి సందేహంలేదు. బాబు పెరిగి పెద్దవా డవుతాడు. అప్పటికి ఈలోపునే వాసు పిల్లల తండ్రికూడా అవుతాడు. వాళ్ళమధ్య అశాంతితో అలమటిస్తున్న హృదయానికి బలవంతంగా శాంతంగా ఉండమని నేర్పుతూ, మానసికమైన వ్యథవల్ల అతిత్వరగా వార్ధక్యంపొందిన తను రోజులు లెక్కపెట్టుకుంటూ జీవితం వెళ్ళదీసు కోవాలి. అదే తన భవిష్యత్తు. అంతకంటె ఇంకేం వుంటుంది? అబ్బ! ఎంత భయంకరం. భవిష్యత్ ఏమిటో ముందే తెలిసికోవటంలో ఎంత బాధ!

ఎంత నరకం! బుద్బుద ప్రాయమైన ఈ జీవితంకోసం ఎందుకింత వెతుకులాట! దేనికోసం ఇన్ని రాగద్వేషాలు? ఉన్నన్నాళ్ళూ మనం సుఖించి, మనచుట్టూ వున్నవాళ్ళని సుఖపెడదామని యెందు కనుకోరు? ద్వేషం, మోసం, ప్రతీకారం, వంచన, అనుమానం ఇవి లేందే మనిషిమను గడ పరిపూర్ణత్వం చెందదా!

పరధ్యాసగా ఆలోచిస్తున్న సంధ్య వాకిట్లో కారు చప్పుడు విన్పిం చటంతో వులిక్కిపడింది. చెవులు శ్రద్ధగా ఆలకించాయి. సందేహంలేదు. తను భ్రమపడ్డానేమో అన్నట్టు అదికూడా ఒక వూహ కాదు. నిజంగానే కారుశబ్దం విన్పిస్తోంది. సంధ్య లేచి 'గోవిందూ!' అని పిలుస్తూ వరండా లోకి వచ్చేసరికి కారు యింటిముందు వచ్చి ఆగింది.

లాయరు శ్యామసుందరంగారికారు అది. ఇంత అర్ధరాత్రివేళ ఆయ నకు ఇక్కడేం పని? చెడుని శంకించబోతూ సంధ్య 'గోవిందూ!' అని మరోసారి బిగ్గరగా పిలవబోయింది. పెదవులు తెరుచుకున్నాయి. కాని రానేలేదు. కారులోంచి దిగుతున్నది పొట్టిగా, లావుగావుండే శ్యామ

సుందరంకాదు. ఎవరో పొడుగ్గా వున్నారు. అక్కడ చెట్లనీడలు దట్టంగా పడటంవల్ల మనిషి ఆకృతి తెలియటంలేదు. మసకమసకగా వున్న వెన్నెల వెలుగులో కారులోంచి దిగిన వ్యక్తి డ్రైవర్ కేదో చెప్పి తలవంచుకుని మెల్లగా మెట్లెక్కి పైకివస్తున్నాడు. కొద్దిపాటి వెన్నెల వెలుగు అతనిమీద పడగానే క్రమంగా ఆకారం గుర్తుపట్టిన సంధ్యలో వణుకు ప్రారంభమయింది.

పరధ్యానంగా తలవంచుకుని మెట్లెక్కివస్తున్న అతను వున్నట్టుండి కెవ్వుమని కేక వినిపించటంతో వులిక్కిపడి చటుక్కున తలెత్తిచూశాడు. వరండాలో స్తంభం ప్రక్కగా క్రీనీడలో నిలబడిన సంధ్యని చూడగానే వెంటనే ఆగిపోతూ "సంధ్యా!" అన్నాడు అస్పష్టంగా.

"మీరు-మీరు" తను చూస్తున్నది కలో నిజమో తేల్చుకోలేక పెనగులాడుతున్నట్టుగా అంది.

"సంధ్యా! నేను మాధవ్‌ని, భయపడటంలేదుగా నువ్వు?" నవ్వు తెచ్చిపెట్టుకుంటూ అంటున్న అతను మాట పూర్తిచేయనేలేదు. ఈ లోపల సంధ్య సుడిగాలిలా దిగివచ్చి అతన్ని పెనవేసుకుపోతూ "మీరేనా! నిజంగా," అంటూ ఏడవటం మొదలుపెట్టింది.

"సంధ్యా?" ఏదో చెప్పటానికి ప్రయత్నించిన అతని కంఠం పెగిలి రాలేదు. చేతులు అనుకోకుండా సంధ్య భుజాలుపట్టుకుని దగ్గరకు లాక్కున్నాయి.

"నిజంగా మీరేనని చెప్పండి నాకు." సంధ్య ఏడుస్తూ అతన్ని మరింతగా కరుచుకుపోయింది.

"నిజం సంధ్యా! నేనే! నేను చచ్చిపోలేదు." గుండెలకి హత్తుకుంటూ అన్నాడు. ఆక్షణంలో ఆ కలయికలో చూస్తుంటే సంధ్యకోసం తను, తనకోసం సంధ్య యుగయుగాలుగా ఎదురుచూసి చివరికి యిప్పుడు హఠాత్తుగా కలుసుకున్నట్టుగా అనుభూతి కలుగుతోంది.

కారు హారన్, దానివెంటనే సంధ్య కెవ్వుమన్న కేక-నిద్ర పట్టీ పట్టనట్టుగా వున్న ఆయా వినగానే లేచి, "సంధ్యా, గోవిందూ! ఏమిట్రా అది" అని అరుస్తూ పరుగెత్తుకువచ్చింది ఆయా కేకలకు ప్రక్కగదిలో గుర్రుపెట్టి నిద్రపోతున్న గోవిందుకూడా కళ్ళు నులుపుకుంటూ లేచి వచ్చాడు.

ఇద్దరూ బైటకి వచ్చేసరికి వరండా దిగువ మెట్టుమీద నిలబడిన మాధవ్ సంధ్యని రెండు భుజాలు పట్టి గట్టిగా కుదుపుతూ వెర్రివాడిలా "సంధ్యా! సంధ్యా!" అంటున్నాడు. అప్పటికే చైతన్యరహితమైన సంధ్య శరీరం వాడిన కలువకాడలా అతని చేతులమధ్య వ్రేళ్ళాడిపోసాగింది.

# 49

సంధ్యకి మళ్ళీ మెలకువ వచ్చేసరికి ప్రక్కన ఆయా తప్ప యింకెవరూ లేరు.

"ఆయా!—" అంటూ సందేహంగా ఆగిపోయింది. ఇంతక్రితం జరిగింది వాస్తవమేనా అన్న అనుమానం కలిగింది.

ఆయా కళ్ళు దూరంగా కుర్చీలో కూర్చునివున్న మాధవ్‌వైపు చూసాయి.

మాధవ్ లేచి సంధ్య మంచం దగ్గరగా వచ్చాడు.

ఆయా ఏదో పని గుర్తుకు వచ్చినట్లు మెల్లగా అక్కడినుంచి బైటికి వెళ్ళిపోయింది.

మాధవ్ రెప్పవాల్చకుండా సంధ్యవైపే చూస్తున్నాడు. సంధ్య కళ్ళలో నీళ్ళు సుళ్ళు తిరుగుతున్నాయి. ఏదో చెప్పాలని పెనుగులాడుతున్నట్లు కొద్దిగా అదురుతున్న పెదవులు సూచిస్తున్నాయి. చీకట్లో తడుముకుంటున్న దానిలా శూన్యంలోనికి చెయ్యిజాచింది.

మాధవ్ యిదేం గమనించనట్టు అలాగే నిలబడ్డాడు. అతని ముఖంలో ఎలాటి భావంలేదు. దేనికోసమో వెతికినట్టు శూన్యంలో కదలిన సంధ్యచేయి అతని కళ్ళలో కన్పించిన నిరాసక్తమైన భావంచూసి మెల్లి మెల్లిగా క్రిందకువాలి దుప్పటి అంచుని గట్టిగా పట్టుకుంది.

ఉన్నట్టుండి అతను "భయపడకు. పరిస్థితులు బలవంతంగా ఇంటికి వచ్చేలా చేశాయి. రెండురోజులకంటె ఎక్కువ ఉండను. యిది యీ ఇంటికి నా ఆఖరిరాక" అన్నాడు.

నీళ్ళనిండిన సంధ్యకళ్ళు ఆశ్చర్యంతో పెద్దవైనాయి. మరుక్షణంలో ప్రక్కకు తిరిగి దిండులో ముఖం దాచుకొని వెక్కివెక్కి

ఏడవసాగింది. హృదయవిదారకంగా, గుండెలు చీల్చుకొని వస్తున్నట్టున్న ఆ దుఃఖం చూసిన తర్వాతకూడా అతని మనసు కరగలేదు. కొద్దిసేపు అలాగే చూస్తూ నిలబడిపోయి తర్వాత మెల్లగా అక్కడినుండి బైటికి వచ్చేశాడు.

మొట్టమొదట సంధ్య ఒక్కసారిగా వచ్చి అలా పెనవేసుకుపోతే తన రహస్యం బైటపడిపోయిందని, తనెవరో సంధ్య గ్రహించేసిందని అనుకున్నాడు. ఆ ఆశ కల్పించిన ఆనందంతోనే దగ్గరగావచ్చి సంధ్యని నిండుహృదయంతో స్వీకరించినట్టు గట్టిగా హృదయానికి హత్తుకున్నాడు. స్పృహతప్పిన సంధ్యని లోపలికి తీసుకువచ్చి మంచంమీద పడుకోబెట్టగానే ఆత్రంగా తన గదిలోకి పరుగెత్తి పాతకాలపు యినప్పెట్టె లోపల అర లాగి చూశాడు. చూస్తూనే నిర్విణ్ణుడయ్యాడు. తను వెళ్ళేటప్పుడు పెట్టి నట్టుగా ఎక్కడివి అక్కడే వున్నాయి. వాటిని ముట్టుకున్న జాడేలేదు. వెళ్ళేరోజు రాత్రి కూర్చుని తను మొదటినుంచి చివరిదాకా సంధ్య తన జీవితంలో ఎలా ప్రవేశించి ఏ విధంగా ముడిపడి అల్లుకుపోయిందో, చిక్కు పడి పోయిన ఈ రెండు జీవితాలని తనెలా సరిచేయలేక పోయాడో వివ రిస్తూ సుదీర్ఘంగా వ్రాసిపెట్టిన వుత్తరం పెట్టినచోటే పదిలంగా వున్నా నన్నట్టుగా అతన్నిచూసి వికృతంగా నవ్వింది. మాధవ్ మనసులో కలిగిన ఆనందం ఆ క్షణంలోనే ఆవిరి అయిపోయింది. చచ్చిపోయాడనుకున్న మనిషి మళ్ళీ హఠాత్తుగా సజీవంగా కళ్ళముందు కన్పించటంతో తాత్కా లికంగా కలిగిన సంతోషం అది. అంతకంటె యింకేంలేదు. లేనివి వూహించి, కానివి ఆశించి తర్వాత బాధపడటం ఎందుకు? నిజాన్ని నిజంగా ధైర్యంగా స్వీకరించటం మంచిది. అందుకే అతను యింత క్రితం సంధ్య అలా చేయి అందిస్తున్నా అందుకోలేదు.

మాధవ్‌ని చూడగానే ఆయాకి ఎక్కడలేని ఓపికా వచ్చింది. అప్పటికప్పుడు మళ్ళీ వంటచేసి అతని స్నానంకోసం నీళ్ళని సిద్ధంచేసింది. సంధ్య ఎలాగో ఏడుపు నిగ్రహించుకుని పనిలో సాయం రాబోతే వద్దని వారించింది.

భోంచేస్తూ మాధవ్ ఏదేవో చెబుతున్నాడు. వంటయింటి గదికి ఇవతలగా నిలబడిన సంధ్యకి పూర్తిగా అన్నిమాటలూ విన్పించటంలేదు.

ట్రెయిన్ యాక్సిడెంట్-దానికి ముందు ఎవరో తన డైరీ కొట్టేయటం-వెంటనే రైలుప్రమాదం-ఏమిటేమిటో అంత స్పష్టంగా విన్పించటంలేదు. ఆయా గుచ్చి గుచ్చి అడుగుతున్నదానికి అతను పొడిపొడిగా రెండు ముక్కలతో సమాధానాలు యిస్తున్నాడు.

భోజనం అయిపోయింది. లేచి చెయ్యికడుక్కుంటూ అంటున్నాడు "ఆయా! రెండు రోజులు వుంటాను. ఈ రెండురోజుల్లోనే నీ చేతి కమ్మదనం అంతా నాకు రుచి చూపించు. ఈసారి వెడితే యిక తిరిగిరావటం యిప్పుడప్పుడే పడదు."

సంధ్య గుండెల్ని ఎవరో పిడికిలితో బిగించినట్టయింది. ఆయా సమాధానం చెప్పలేదు. అతను టవల్‌తో చేయి తుడుచుకుంటూ యివతలకి వచ్చేసరికి సంధ్య వక్కపొడి తీసుకెళ్ళి యిచ్చింది. క్రీనీడ అతని ముఖం మీద పడటంవల్ల ముఖంలో ఎలాటి భావం వుందో సంధ్యకి తెలియలేదు.

# 50

"బాబుని తీసుకెళ్ళి ఆయన గదిలో నేను పడుకోబెట్టి రానా, నువ్వు తీసుకువెడ్తావా?" మంచంమీద కూర్చుని పడుకోబోతూ అడిగింది ఆయా.

"నువ్వే తీసుకు వెళ్ళు." విసురుగా అంది.

ఆయా సంధ్యవైపు అర్థయుక్తంగా చూసి లేవబోయింది.

"వద్దులే పోన్లే! పడుకోబోతున్నావుగా పడుకో—" సంధ్య వారిస్తూ తనే వెళ్ళి బాబుని తీసుకొని భుజాన వేసుకుంది.

సంధ్య బాబుని తీసుకుని గదిలో అడుగు పెట్టేసరికి మాధవ్ టేబిల్‌ముందు నిలబడి లాంతరుదగ్గర ఏవో కాగితాలు పరీక్షగా చూస్తున్నాడు. సంధ్య లోపలికి రాగానే వెంటనే వాటిని మడిచి కిటికీదగ్గరగా వెళ్ళి నిలబడ్డాడు. ఈ మధ్య వూహలో అతన్ని చూసి చూసి అలసిపోయిన సంధ్యకి యిప్పుడు సజీవంగా కదుల్తున్న ఆ మూర్తిని పదేపదే కళ్ళారా మరీ మరీ చూడాలనిపిస్తోంది. ఎన్నెన్నో అడగాలని ఆత్రంగా కూడా వుంది. కాని అతనిలో కొట్టొచ్చినట్టు కన్పిస్తున్న ఆ ముభావం,

ఆ గాంభీర్యం, జంకుని కలిగించి దూరంగా ఉండమన్నట్టు హెచ్చరిస్తున్నాయి.

బాబుని పడుకోబెట్టి దుప్పటిఅంచులు సరిచేస్తూ కావాలని కొద్దిగా జాప్యంచేసింది అతనేదయినా మాట్లాడ్తాడేమోనని ఆశించింది. కానీ నిరాశే ఎదురైంది. అతనసలు వెనక్కి తిరిగి చూడనైనా చూడలేదు. సంధ్య వునికినే గమనించనట్టు కిటికీ దగ్గరగా నిలబడ్డాడు. చేతిలో అంతవరకూ పట్టుకున్న కాగితాలు చించి, నలిపి వుండలుచేసి కిటికీలోంచి దూరంగా విసిరేశాడు.

"మీకు యింకేమైనా కావాలా?" ప్రాణం చిక్కబట్టుకుని ఆదగలేక అడిగింది.

"ఊహుఁ!" ఖచ్చితంగా వెంటనే వచ్చింది సమాధానం. అతను పరధ్యానంగా ఉండి గుర్తించలేదో, లేక అలసటలో అర్థం చేసుకోలేక పోయాడో! ఏ మాత్రం శ్రద్ధ కనపరచినా సంధ్య అడిగేతీరులో ఆరాటం, దానిలో ప్రత్యేకత తప్పక గ్రహించగలిగేవాడు.

సంధ్య వెళ్ళిపోవటానికి గుమ్మంవైపు తిరిగింది. అతని ధోరణికి నిరాశచెందిన మనసు బలవంతంగా మెదపట్టి గుమ్మంవైపు నడిపించింది. కాని మనసులో అతనిపట్ల వుప్పొంగుతున్న వినూత్నమైన ఈ భావాన్ని నిగ్రహించుకోటానికి శక్తి చాలటంలేదు. అది బయటపడకుండా నిర్లిప్తంగా ప్రవర్తించాలంటే ఎంత ప్రయత్నించినా సాధ్యం కావటంలేదు. అందులో అతను రెండురోజులకంటె యెక్కువ వుండననటం, యిక తిరిగి రానంటం యింకా భయపెడ్తున్నాయి. పోన్లే! రేపు లేదా? ఎల్లుండి రాదా? అసలే ప్రయాణపు అలసటతోవున్న అతన్ని విసిగించటం దేనికి? క్షేమంగా తిరిగి వచ్చాడు. అంతేచాలు. ఇప్పటి కీ తృప్తి చాలు. ఎదురు తిరుగుతున్న మనసుని బలవంతంగా బుజ్జగించి సమాధాన పరచబోయింది.

"సంధ్యా!" ఉన్నట్టుండి వెనుకనుంచి పిలుపు విన్పించింది. కొంగు పట్టి లాగినట్టే ఆగిపోయింది. గుండెలు వేగంగా కొట్టుకున్నాయి ఎంత చూడాలనిపించినా వెనక్కి తిరగలేకపోయింది.

మాధవ్ అంటున్నాడు. "సంధ్యా! అనారోగ్యంతో అలిసిపోయిన మనిషి యింటికి రాగానే యెంత విశ్రాంతి ఇవ్వాలో అంత యిచ్చావు.

ఇది నేను ఆశించలేదు. నా జన్మలో మర్చిపోలేని రోజుల్లోఇది ఒకటి. కనీసం యీ ఒక్కపూటయినా నా మీదున్న ద్వేషం మర్చిపోయి వుదారంగా ప్రవర్తించినందుకు నీకు కృతజ్ఞతలు తెలుపుకోకుండా వుండలేను."

సంధ్య వెనక్కి తిరిగిచూసింది. అతను యిటువైపే తిరిగిఉన్నాడు. ఆ ముఖంలో ఎంత నిర్వికారం? ఎంత నిర్లిప్తత! ఆ మాటల్లో ఎంత మామూలు మర్యాద! ఉదారత్వం తను చూపించిదట. దానికి అతను కృతజ్ఞతలు తెలుపుకోకుండా ఉండలేడుట! ఎవరికి కావాలి? ఎవరు అడిగారు? చల్లనిచేత్తో మృదువుగా స్పృశిస్తాడనుకున్న మనిషి హఠాత్తుగా చేయిచాచి చెంప పగలకొడితే ఎలా వుంటుంది? సంధ్య ముఖంలో సరిగ్గా అలాంటి భావమే ప్రతిబింబించింది.

"థాంక్స్ సంధ్యా!" అన్నాడతను.

సంధ్యలో రోషం దెబ్బతిన్న తాచులా ఒక్కసారి బుస్సుమని లేచింది. చేయిజాచి వేలుపెట్టి చూపిస్తూ "దీనికి దీనికి భగవంతుడుకూడా క్షమించడు." అంది.

సంధ్యలో హఠాత్తుగా వచ్చిన ఈ మార్పునిచూసి తెల్లబోయాడు.

"నేనేం చేశాను-? అన్నాడు అప్రయత్నంగా.

"ఏం చేశాను? ఏం చేశారో తెలియదూ! ఇంకా ఎన్నాళ్ళీ దాగుడు మూతలు?"

"సంధ్యా!—"

"ఒక్కసారి వెనక్కి తిరిగి చూసుకోండి! ఏం చేసింది మీకు తెలియటంలేదు?"

"నువ్వనేదేమిటి—"

"బాబు-వాడి సంగతి నా కెందుకు చెప్పలేదు?"

"బాబు!" మాధవ్ వెనక్కు తగ్గాడు.

"అవును. వాడే, వాడి సంగతే అడుగుతున్నాను. వాడెవరో నా కెందుకు చెప్పలేదు? చెప్పే అవసరం లేదనుకున్నారా? లేక తెలుసుకునే అర్హత నాకు లేదనుకున్నారా?"

నిర్విణ్ణుడై చూశాడు, మాధవ్.

"సిస్టర్ రాకపోతే ఏనాటికైనా మీ పెదవులు కదిలేవా? కదిలేవి కావు. నేనెంత దౌర్భాగ్య స్థితిలో వున్నానో నాకు తెలిసేది కాదు."

"సిస్టర్! ఏ సిస్టర్!" అతని చెయ్యి అప్రయత్నంగా కిటికీ రెక్కని గట్టిగా పట్టుకుంది.

"ఏ సిస్టర్? ఎంతమంది తెలుసు మీకు? బాబుని పెంచి పెద్దజేసిన సిస్టర్. మీరు కృతజ్ఞతతో—"

"సంధ్యా!" మాధవ్ మధ్యలోనే బిగ్గరగా అరిచాడు.

సంధ్య గుండెల్లో పొంగిన దుఃఖం, కోపం, రోషం అన్నీ ఒక్కసారిగా ముఖంమీదికి రావటానికి నేనంటే నేనని పోటీపడ్డాయి.

క్షణంసేపు గదిలో భయంకరమైన నిశ్శబ్దం ఏర్పడింది.

మాధవ్ రెప్పవాల్చకుండా అలాగే చూస్తున్నాడు.

సంధ్యకి ఏడుపు ముంచుకు వచ్చేసింది. నిలబడటానికి శక్తిలేనిదానిలా మంచం పట్టుకుని దానిమీద కూలబడుతూ "చెప్పండి! మాట్లాడరేం? నన్ని దౌర్భాగ్యపు స్థితిలో ఇన్నాళ్ళు ఎందుకు ఉంచారు? కేవలం వినోదంగా తమాషాగా చూడటానికేగా? వాడి తల్లే వాడికి ఆయాగావుందని తెలిసి సిస్టర్ నమ్మలేనట్టు ఆశ్చర్యపోతుంటే—" ఎన్నాళ్ళనుంచో గుండెల్లో నిండుకున్న దుఃఖం ఉధృతంగా ప్రవహించటంతో నిస్సహాయురాలైన సంధ్య ఆపైన మాట్లాడలేక చేతుల్లో ముఖం దాచుకుంది. మాధవ్ శిలావిగ్రహంలా చలనం లేకుండా నిలబడిపోయాడు.

వెక్కిళ్ళమధ్య అస్పష్టంగా మళ్ళీ తనే అంది- "మొదటినుంచీ నన్నిలా ఎందుకు చిత్రవధ చేస్తున్నారు? నేను మీకు ఏం అపకారం చేశానని నామీద ఇలా పగతీర్చుకుంటున్నారు? ఏం పాపం చేశానని నాకీ శిక్ష! నేనసలు ఈ బాధతోనే కుంగిపోతుంటే - ఎప్పుడెప్పుడు మిమ్మల్ని చూస్తానా, ఇదంతా నిజమేనని మీ నోటినుంచికూడా విందామాఅని క్షణాలు లెక్కపెట్టుకుంటూ కూర్చుంటే, అప్పుడే, ఆ శ్యామసుందరంగారు వాళ్ళు వచ్చి—"కంఠం పూర్తిగా బొంగురుపోయి మాట పెగలక పోవటంతో సంధ్యఆగిపోయింది.

తర్వాత ఐదారు నిమిషాల వరకూ గదిలో వింతయిన నిశ్శబ్దం ఆవరించుకుంది. కొద్దిసేపటికి ఆ నిశ్శబ్దాన్ని చీల్చుకుంటూ అలలు అల

లుగా తేలివస్తున్న సంధ్య ఏడుపు దిమ్మెరపోయిన మాధవ్ మనసుని తాకి చైతన్యం తెప్పించింది. అతను నిద్రలో నడుస్తున్న వాడిలా సంధ్య వైపు వచ్చాడు.

"సంధ్యా! ఒక్కమాట. ఒక్క చిన్నమాట అడుగుతాను జవాబు చెప్పు. బాబు ఎవరో తెలిసిన తర్వాత వాడంటే నీకు అసహ్యం కలగడం లేదు కదూ! మనస్ఫూర్తిగా నిస్సంకోచంగా నిజం చెప్పు." అతను అడిగేతీరు, ఆ ముఖ కవళికచూస్తే సంధ్యనోటినుంచి రాబోయే సమాధానం మీదనే అతని భావిజీవితం అంతా ఆధారపడ్డట్టుగా వుంది.

సంధ్య జవాబు చెప్పలేదు. యేడుపు నిగ్రహించుకోటానికి విశ్వ ప్రయత్నం చేయసాగింది.

"చెప్పు?"

"ఏం చెప్పను? ఎలా చెప్పాలి—" వెక్కిళ్ళమధ్య అస్పష్టంగ అంది.

"అసహ్యంలేదు అనటానికి 'లేదు'అని ఒక్కమాట చెప్పు చాలు." చీరకొంగుతో కళ్ళు రెండు గట్టిగా తుడుచుకుంటూ లేదన్నట్టుగా తల అడ్డంగా వూపింది.

ఊపిరి బిగబట్టి ఎదురుచూస్తున్న మాధవ్ ఒక్కసారి గుండెల నిండా గాలి పీల్చుకున్నాడు. తృప్తిగా శ్వాస వదులుతూ "చాలు. యిది చాలు నాకు? ఇంతకంటె యింకేం కోరను. యిన్నాళ్ళ నా నిరీక్షణకి ఈ చిన్న బహుమతి చాలు. యిక నే నేమయిపోయినా, యెక్కడున్నా నాకు చింతలేదు" అన్నాడు.

"నా కోరిక నెరవేరింది. నేను కావాలనుకున్న మీ యిద్దరు ఒకటయ్యారు. మీ యిద్దరిమధ్య అపశ్రుతిలా ఉండకుండా దూరంగా వెళ్ళిపోయేందుకు నా కీ నిశ్చింత ఈ తృప్తి చాలు?" తనలో తాను అనుకుంటున్నట్టు అంటూ వెళ్ళిపోవటానికి వెనక్కు తిరిగాడు.

"మీ ఉద్దేశం నా కర్థమైంది. ఇన్నాళ్ళు నేను చూపిన నిర్లక్ష్యానికి నా మూర్ఖత్వానికి ప్రతీకారం తీర్చుకోవటానికి........................"

"ప్రతీకారమా? నీ మీదనా?" మాధవ్ ఆశ్చర్యంగా మళ్ళీ సంధ్య

వైపు తిరిగాడు. తడితో, రోషంతో మెరుస్తున్న ఆ కళ్ళని చూడగానే అతనికి మళ్ళీ హఠాత్తుగా ఏదో గుర్తుకువచ్చింది.

"ఇంకొకమాటకు సమాధానం చెప్పు. ఇంతక్రితం నేను రాగానే అలా చనువుగా ఎందుకు ప్రవర్తించావు? అది కేవలం నేను బ్రతికిబైట పడ్డాననే నిశ్చింతేనా లేక..." అసంపూర్తిగా ఆగిపోయాడు.

అంతవరకూ ముఖం ఎత్తి రెప్పవాల్చకుండా అతనివైపు చూస్తున్న సంధ్య చెక్కిళ్ళు ఎర్రబడినాయి. సమాధానం చెప్పలేనట్లుగా మెల్లగా తల దించుకుంది.

"ఈ ఒక్కమాటకు జవాబు చెప్పు. ఇంక నిన్ను విసిగించను."

సంధ్య చెప్పలేదు.

"చెప్పు." బ్రతిమాలుతున్నట్లుగా అడిగాడు.

సంధ్య మౌనం వదల్లేదు.

"చెప్పలేవా? లేక చెప్పేందుకు జవాబు అంటూ లేదా?—"

సంధ్య నోటినుంచి దానికూ్కడ సమాధానం రాలేదు.

అతని కళ్ళలో కాంతి క్రమేపి తరిగిపోయింది. ముఖం వంచుకుని కూర్చున్న సంధ్యవైపు పరిశీలనగా చూస్తూ "బహుశా జవాబేమీ లేదనుకుంటా. అంతే అయిఉంటుంది" అన్నాడు.

ఆఖరుసారిగా సంశయ నివృత్తికోసం "ఒక్కసారి తలెత్తి నావైపు చూడు. సంధ్యా నీనోరు చెప్పలేని మాటని నీకళ్ళు చెప్పగలవు."అన్నాడు?

సంధ్య తలెత్తలేదు.

"చూడు. నన్ను నమ్మకంగా తెలుసుకోనీ. నువ్వెప్పుడూ పల్లెత్తుమాట అనకపోయినా నీ కళ్ళద్వారా నీ ఆంతర్యం ఎన్నోసార్లు స్పష్టంగా చదవగలిగాను. అది నన్నెప్పుడూ మోసం చేయలేదు."

సంధ్య తల మరింత క్రిందికి దిగిపోయింది.

"ముఖం ఎత్తు. ఒక్కసారి పైకి చూడు. ఈ ఆఖరి క్షణంలో అపార్థానికి గాని, అనుమానానికిగాని, ఆశకిగాని తావుండకూడదు. ఏదీ నావైపు చూడు. చూడవూ!" సగం అసహనంగా, సగం బ్రతిమిలాడుతున్నట్టుగా తొందరచేశాడు.

సంధ్య చివరకు అయిష్టంగానే, ఓ విధంగా బలవంతంగానే ముఖం

పైకెత్తి దగ్గరగా నిలబడివున్న అతనివైపు చూసింది. మాధవ్ తీక్షణంగా లోతుగా దేనికోసమో వెతుకుతున్నట్టుగా చూశాడు. భయం, ఆనందం, అభిమానం, అనుమానం ఇంకా ఎన్నెన్నో భావాలు కలగాపులగంగా కలిసి పోయినట్టున్న అద్భుతమైన ఆ చూపు అతన్ని మెల్లమెల్లగా పశపరచుకో సాగింది.

"సంధ్యా!" అస్పష్టంగా అతను క్షణంసేపు తడబడ్డాడు. తర్వాత తనకి తను చెప్పుకుంటున్నట్టుగా "ఇదేమిటి? నేను-నేను భ్రమపడటం లేదు గదా!" అన్నాడు.

సంధ్య లేదన్నట్టు చూసింది. అయస్కాంతంలా తనవైపు ఆకర్షించుకుంటున్న ఆ సోగ కళ్ళలోకి చాలాసేపు అలాగే శిల్పాలుడైనట్టు చూస్తూ నిలబడిపోయాడు. తర్వాత నిలబడటానికి శక్తి లేనట్టుగా మెల్ల మెల్లగా సంధ్యముందు రెండు కాళ్ళమీదా కూలబడ్డాడు. తనని నమ్మలేని ఆశ్చర్యం, ఖంగారు అతని ముఖంలో స్పష్టంగా కన్పిస్తున్నాయి. అది గుర్తించిన సంధ్య వెంటనే రెండు చేతులూ జాపి అతని చేతుల్ని తన చేతుల్లోకి తీసుకుంది. ఆ క్షణంలో అతనికి ఆ ధైర్యం ఇవ్వటం ఆ చనువు చూపించటం అత్యవసరం అనిపించింది. ఏకాస్త సిగ్గుపడినా, ఏ మాత్రం సంకోచించినా ఈ అవకాశం వేళ్ళ మధ్య నీరులా జర్రున జారిపోతుంది. అతను శాశ్వతంగా దూరమైపోతాడు. ఆ భయమే సంధ్యలో ఎల్లప్పుడూ ఉండే సిగ్గుని, సంకోచాన్ని కొద్దిసేపు వెనక్కి నెట్టింది.

"సంధ్యా!" అతని పెదవులు అస్పష్టంగా పలికాయి. యింకా ఇదంతా నమ్మలేనట్లు చూస్తున్న అతని కళ్ళలో ఆశ, నిరాశల్లాంటి వెలుగునీడలు పోటీపడ్డాయి. కొద్దిసేపు ఆ రెండింటికి విపరీతమైన పెనుగులాట జరిగింది. చివరికి ఆశ గెలిచింది. వెలుగు నిలిచింది. మాధవ్ వెంటనే సంధ్య నడుం చుట్టూ రెండు చేతులూ పెనవేసి చప్పున ఒళ్ళో ముఖం దాచుకున్నాడు. కొద్దిసేపటి వరకూ అతనేం మాట్లాడలేదు. ఏం చెప్పాలో సంధ్యకి అసలే తోచలేదు. కొన్ని రోజులనుంచి తీరని వ్యధకి గురియైన రెండు పరితప్త హృదయాలు మూగగా పెనవేసుకున్న దివ్యమైనక్షణాలవి.

అతను మనసంతా సుడిగాలిలా రేగిన భావాన్ని జాగ్రత్తగా నిగ్ర

హించుకున్నట్లు పై పెదవిని క్రింది పెదవితో గట్టిగా నొక్కిపట్టాడు. సంధ్య కింతవరకూ అర్ధరాత్రి నిశ్శబ్దం ఇంత అందంగా వుంటుందని కాని, ఆ నిశ్శబ్దంలో మరోమనిషి సాన్నిహిత్యం అంతమధురంగా ఉంటుం దనికాని తెలియదు.

సమయం గడిచింది.

ఒకటి రెండుసార్లు ఏదో చెప్పాలని ప్రయత్నించి విఫలుడయాడు అతను. అతన్ని లేవమని చెప్పాలనుకుంది సంధ్య. కాని, అతను కదిలితే ఈ చక్కటి స్వప్నం ఎక్కడ కరిగిపోతుందోననే భయంతో అంతలోనే సమించుకుంది. ఆ సమయంలో అలా తనఒళ్ళో తలపెట్టుకుని కూర్చున్న అతన్ని చూస్తుంటే స్త్రీ సహజమైన కోరికతోకంటె మాతృత్వపు మమ ంతో హృదయం ద్రవించింది.

చిట్టచివరికి ఎలాగైతేనేం అతను మాట్లాడటం ప్రారంభించాడు.

"సంధ్యా! నామీద అసహ్యంకాని, అనుమానంగాని వుంటే ఇప్పుడే నా మొహంమీదనే బైటపెట్టెయ్యి! ఇక నేను సహించలేను. నీలో కఠినత్వం చూసి చూసి అలసిపోయాను. నా సహనానికి అంతం చూశావు నువ్వు. బాబు ఎవరో నాకెందుకు చెప్పలేదూ అంటూ యింతక్రితం నామీద నిష్ఠూరంవేశావు. వాడినిగురించి నీకు చెప్పాలని నేను ఎన్నిసార్లు ప్రయత్నించానో, ఎంత తహతహ లాడానో నీ కెలా తెలుస్తుంది? ఎప్పటికప్పుడే చెప్పాలని ఆరాటం, మళ్ళీ దానివెంటనే చెప్పగానే వాడిని కూడా నా మూలంగా అసహ్యించుకుని ద్వేషిస్తావేమోననే భయం ఈ రెండూ అడకత్తెరగా మారి నిర్దాక్షిణ్యంగా నన్ను నలక్కొట్టడం ప్రారం భించాయి. ఓ విధంగా వాడిద్వారా నిన్ను పొందాలని నేను ఆశించినమాట నిజమే. కాని నువ్వు వాడినే నానుంచి లాక్కున్నావు. బాబు నా కొడుకై కూడా నామీద ద్వేషం మరిపించి నీ మనసులో స్థానం ఏర్పరచుకున్నాడు. అప్పుడప్పుడూ మీ యిద్దరూ కలిసి ఆనందంగావున్న దృశ్యాలుచూస్తే నాకు యీర్ష్యతో పిచ్చెక్కుతుందేమో అన్పించేది. ఇంతక్రితం, "ఏం అపకారం చేశానని నన్నిలా మొదటినుంచీ చిత్రవధచేస్తున్నారు!" అన్నావు కదూ సంధ్యా! కాదు! అపకారం చేసింది నేను. దాన్ని గుర్తించి సరిచేయాలని ప్రయత్నించి, ఎటువైపునుంచీ మార్గం దొరక్క

అల్లాడిపోతూ చిత్రహింసకి గురయింది నేను. తప్పుచేసింది నేను. అది తెలుసుకుని పశ్చాత్తాప పడిన తర్వాతకూడా పూర్తి శిక్ష అనుభవించింది నేను. నామూలంగా నీకు అన్యాయం జరిగి, నీ జీవితం శిథిలమైందని తెలుసుకున్న రోజున నేనెంత సిగ్గుపడ్డానో, ఆవేదనతో ఎంత కుమిలి పోయానో నీకు తెలియదు. ఆ క్షణంనుంచి దిగజారిన నీ పరిస్థితుల్లోంచి నిన్ను లేవనెత్తి హృదయానికి హత్తుకోవాలని, నా జీవితపు సింహాసనం మీద మహారాణిలా నిన్ను కూర్చోపెట్టాలని ఎంత తాపత్రయపడ్డానో, ఓపికతో ఎంత ప్రయత్నించానో ఆ భగవంతుడికే తెలుసు. నువ్వీ మారుమూల, ఏ వసతీలేని ఈ పల్లెటూళ్ళో, ఈ నిరక్షరకుక్షుల మధ్య కాయకష్టంతో అజ్ఞాతంగా బ్రతుకు వెళ్ళదీసుకోటానికి నేనే బాధ్యుడను అన్న సంగతి అనుక్షణం నన్ను శూలంలా గుచ్చిగుచ్చి పొడుస్తూ ఉండేది. భోజనానికి కూర్చుంటే కళ్ళముందు రుచికరమైన ఆహార పదార్థాలు చూడగానే ఆరోజు నువ్వు కడుపునిండా తిన్నావో లేదో అనే అనుమానం వచ్చేది. రాత్రి అవగానే మెత్తటి పక్కమీద శరీరం వాల్చగానే నీకు పక్కమీద దుప్పటి అయినా వుందో లేదో అనే అనుమానం వచ్చేది. ఆ ఆలోచన రాగానే అప్పటికప్పుడు లేచివచ్చి చూడాలనిపించేది. అలా ఎన్నోవిధాలుగా నువ్వు నన్ను అనుక్షణం వెంటాడుతూనే వుండేదానివి. అన్ని సంపదలమధ్య వుండికూడా ఏమీ అనుభవించలేని మానసిక దారిద్ర్యానికి గురిచేశావు. ఎంతోసేపు నా ఆలోచన్లు నీచుట్టూనే తిరుగుతూవుండేవి. నీ జీవితం ఎలా చక్కబరచాలి? ఏంచేస్తే నీకు ఆనందం లభిస్తుంది? రాత్రింబవళ్ళు యివే ప్రశ్నలు. వాసుకి నేను ఇస్తున్న సాయం నువ్వు గరళంలామింగి వూరుకుంటున్నావని తెలుసుకున్నాను. అది గుర్తుచేస్తే మరీ బాధకలిగేది. నిన్ను సుఖపెట్టాలనే ప్రయత్నంలో విపరీతంగా బాధిస్తున్నాను. తెలిసికూడా నాకు తప్పలేదు. వాసుకు నేను చేస్తోన్న సాయంతో నీకు సంబంధలేదని, నీ ప్రమేయమే లేదని ఎన్నోసార్లు చెప్పాలని ప్రయత్నించాను. కాని నీ కనుబొమ్మల్లో ముడిచూడగానే నా నోట్లో నాలిక చివరే ఆగిపోయేది. నిజంగా వాసే లేక పోతే నేను ఏమయిపోయేవాడిని ? నీ జీవితపుటంచులవరకైనా నన్ను రానిచ్చేదానివా ? రానివ్వవని నాకు ఖచ్చితంగా తెలుసు."

"నన్ను-నన్ను క్షమించండి——" గాద్గదికంగా అంది సంధ్య.

మాధవ్ ఆ మాట విన్పించుకునే ధోరణిలోలేదు. అతను చెబ్తూనే వున్నాడు. "మంచితనంతో నన్ను గుర్తింపబడేలా చేసుకోవాలని నువ్వు వూహిస్తున్న నేను-నేనుకాదని, మరొకరని ఋజువు చేయాలని సహనంతో పట్టుదలగా ప్రయత్నించాను. కాని లాభంలేకపోయింది. నువ్వెప్పటికీ నాకు దక్కవనే అనుకున్నాను. ఓటమిఅంటే ఏమిటో ఎప్పుడూ ఎరగని మనసు నిగ్రహంతో, పశుబలంతోనైనాసరే లొంగదీసుకోమని ఆజ్ఞాపించసాగింది. అనురాగం గుర్తించని మనిషి అయితే అధికారంతో లొంగదీసుకో అని హెచ్చరించడం ప్రారంభించింది. చివరి చివరికి నామీద నాకే నమ్మకం సడలిపోవటంతో భయపడి నీకు దూరంగా వుండాలనే ప్రయత్నంలో బిజినెస్ టూర్ అన్న పేరుతో వూళ్ళు తిరగసాగాను. మన కంపెనీ తరఫునుంచి జర్మనీ వెళ్ళేందుకు అవకాశం వచ్చింది. అక్కడికి వెళ్ళి ఎలాగో అలాగు ఎంత క్లిష్టమైనాసరే ప్రయత్నించి అక్కడే వుండి పోవాలని, యిక తిరిగి రాకూడదని నిశ్చయించుకున్నాను. కాని అనుకున్నంత త్వరగా వీసా రాలేదు. ఈలోపల యీ చుట్టుప్రక్కల వుండడం యిష్టంలేక ఆ టూర్ పెట్టుకున్నాను. కలకత్తాలో వుండగా వీసా దొరికినట్టుగా కంపెనీనుంచి వుత్తరం వచ్చింది. వెంటనే బైలుదేరాను. ప్లాట్ ఫారమ్‌మీద తిరుగుతుండగా పర్సు కలిసివున్నడైరీ ఎవరో కొట్టేశారు. టికెట్‌కూడా అందులోనే వుంది. మరో టికెట్ కొనే వ్యవధానంలేదు. ట్రెయిన్ కదలబోతోంది. అందుకని ట్రయిన్ ఎక్కేశాను. ట్రయిన్ కలకత్తా వదలిన అరగంటకే ప్రమాదం జరిగిపోయింది. నేను నిద్రలో వున్నాను. హఠాత్తుగా ఏదో పెద్దచప్పుడు విన్పించింది. కళ్ళుతెరచి చూశాను. కొద్దిగా మెలకువరాగానే లేవబోయాను. వెంటనే ఏదోపడటంతో కుప్పలా బోర్లా కూలిపోయాను. తర్వాత ఏమైందో నాకు తెలియదు. వెన్నుమీద, మోచేతిదగ్గర బలమైన గాయాలు తగలటంతో నాకు మళ్ళీ స్పృహ వచ్చేసరికి నాలుగైదు రోజులు పట్టింది. స్పృహ వచ్చిన తర్వాతకూడా ఆ మగతా అదీ తగ్గి బాగా తెలివివచ్చేసరికి మరో రెండు రోజులు పట్టినాయి. అదే హాస్పిటల్లో సత్యాగ్రహసమయంలో నాతోపాటు జైల్లో డాక్టర్ చీఫ్‌గా పనిచేస్తున్నాడు. ఆయన నన్ను చూడగానే గుర్తుపట్టి ప్రత్యేక

మైన శ్రద్ధ కనబరిచాడు. ఆయన బాగా జాగ్రత్త తీసుకోకపోతే నేను బతికేవాడినికూడా కాదేమో! ఆయనిచ్చిన ట్రీట్‌మెంటుతోనే నా గాయాలు కూడా త్వరగా నయమయినాయి. 'మీవాళ్ళ అడ్రస్ యివ్వు టెలిగ్రాం యిస్తాను'అని ఆయనంటే నేను శ్యామసుందరంగారి అడ్రస్ ఇచ్చాను. ఆయన దాన్ని చూస్తూ 'అరె! ఈయన రెండురోజుల క్రితమే వచ్చి వెళ్ళాడు. ఆయన లీగల్ ఎడ్వయిజర్‌గా ఉన్న కంపెనీ ఓనర్‌కూడా ఇదే ప్రమాదంలో చిక్కుకుని చనిపోయాడు. ఫలానా అని గుర్తుపట్టడానికి శవాలన్నీ వెతకలేక చచ్చాం' అన్నాడాయన. నేను వులిక్కిపడ్డాను. వెంటనే నవ్వేశానుకూడా. ఇంతలో ఎవరో రావటంతో డాక్టర్ అక్కడినుండి బైటకి వెళ్ళిపోయాడు. నేను మొదట నవ్వేసినా క్రమేపీ ఆలోచనలు పరిపరివిధాల పోయాయి. నేను కోరుకున్నదికూడా ఇదే. కాని మరోరకంగా జరిగింది. మృత్యువు నన్ను అందుకున్నట్టే అందుకుని మళ్ళీ జీవితంలోకి విసిరేసింది. హఠాత్తుగా నా చావు కబురు వినగానే మీరంతా యెలా అనుకుంటారో అనే దృశ్యాలు కంటిముందు తిరిగాయి. చివరికి ఏమైనా సరే, అలాగే మరణించిన వ్యక్తిగా అజ్ఞాతంగానే ఉండదలుచుకున్నాను. డాక్టర్ టెలిగ్రాం ఫారమ్‌తో తిరిగివచ్చాడు. 'నేను పంపిస్తాను' అన్నాను. నేను పంపలేదని, దాన్ని చింపేశానని ఆయనకు తెలియదు. డాక్టర్ నా కుటుంబాన్ని గురించి వివరాలు అడిగాడు. ఎవరూలేరని చెప్పాను. శ్యామసుందరం కూడా పరిచయస్థుడు మాత్రమే. కొద్దిరోజులు ఆతనిదగ్గర విశ్రాంతిగా వుండటానికి అవకాశం వుంటుందేమో తెలుసుకోటానికిమాత్రమే అతనికి టెలిగ్రాం యిచ్చానని చెప్పాను. ఇంతవయసు వచ్చిన తర్వాతకూడా నాకు పెళ్ళికాకపోవటానికి, నా కెలాటి వుద్యోగం లేకపోవటానికి ఆయన ఆశ్చర్యం మాటల్లో కనబరచనే కనబరచాడు. ఆయనకి భార్యపోయింది. పిల్లలంతా పెద్దవాళ్ళయి వేరుపడిపోయారు. ఒక్కడే వుంటున్నాడు. దగ్గర ఒక కాంపౌండరు, ఒక నర్సు తప్ప యింకెవరూలేరు. నేను వుండటానికి ఏమీ అభ్యంతరంలేదని, పైగా చాలా సంతోషిస్తానని చెప్పాడు. కొద్దిరోజులు బాగా ఆరోగ్యం చిక్కి మామూలుమనిషి అయేవరకూ ఆయన దగ్గర ఉండాలని నిశ్చయించుకున్నాను. నేను అనుకున్నదానికంటె త్వరగానే కోలుకున్నాను. గాయాలు మానిపోతున్నాయి! అవి మానిపోతే

నేనెక్కడ వెళ్ళిపోతానో అని బెంగపడుతున్నట్టుగా డాక్టరు చెప్పడం ప్రారంభించాడు. అక్కడే ఏదయినా ఉద్యోగం చూసుకుని తనదగ్గరే ఉండిపొమ్మని బలవంతం చేయసాగాడు. కాని నాకు మాత్రం యిష్టం లేక పోయింది. మెల్లగా ఎలాగో అక్కడినుంచి వెళ్ళిపోవాలనేవుంది. ఆ రోజు గడిస్తే వెళ్ళిపోయేవాడినే. కాని అక్కడ కూడా నాకు అదృష్టం ఎదురు తిరిగింది. ఆ రోజు ఉదయం ఆయనక్లినిక్‌లో పేపరు చూచుకుంటూ కూర్చున్నాడు. ఎవరో పేషెంట్ వచ్చారు. డాక్టరు కూడా అక్కడే ఉన్నాడు. వచ్చిన పేషెంట్‌కు కడుపులో నొప్పిట. విపరీతమైన బాధతో కేకలు పెడుతున్నాడు. అంత నొప్పిలోనూ అంత బాధలోనూ నన్ను చూడగానేవచ్చి అమాంతం కాళ్ళకి చుట్టేసుకున్నాడు. కడుపునొప్పి బాధ వదిలేసి బిగ్గరగా ఏడుస్తూ "మీరిక్కడ ఉండగానే ఆ వెధవలు అంతపుకారు లేపారు." ఏదేదో వాగటం ప్రారంభించాడు. నేను పేపరు ప్రక్కకు తీసి అతన్ని చూడగానే నీళ్ళుకారిపోయాను. నా కాళ్ళు చల్లబడినాయి. అతను మన కంపెనీ సూపరింటెండెంట్. బుద్ధి మంచిదికాదని అతనిమీద చాలా ఆరోపణలున్నాయి. కాని పిల్లలుగలవాడని నేను ఎప్పటికప్పుడు వార్నింగ్ ఇస్తూ అట్టిపెడుతూవచ్చాను. వాడిని ఉద్యోగంలోంచితీసేశారుట. ఉద్యోగంకోసం వెతుక్కుంటూ బావమరది ఇంటికి వచ్చాట్ట. ఇంట్లోభార్యా, బావమరది,అత్త నానామాటలు అంటున్నారట. ఆ బాధతోనే యేదితిన్నా అరక్క నొప్పి వస్తోందిట. ఉద్యోగం తీసేసినందుకు కంపెనీవాళ్ళని, మాటలు అంటున్నందుకు ఇంట్లో వాళ్ళని కలగాపులగంగా కలిపి కసితీరా తిట్టటం ప్రారంభించాడు.

డాక్టర్ కళ్ళజోడులోంచి ఇదంతా చూస్తూ ఒక్కమాటకూడా పొల్లుపోకుండా వింటూనే వున్నాడు.

"ఇతనెవరో నాకు తెలియదు." అని దబాయించ బోయాను కానీ ఆయన నన్ను మాట్లాడవద్దన్నట్టు చేతితో సైగచేసి, సూపరింటెండెంటు నుంచి సవివరంగా అంతా తెలుసుకున్నాడు. అప్పటికప్పుడే స్వయంగా టెలిగ్రాం రాసి కంపెనీకి పంపించాడు. కంపెనీవాళ్ళు వచ్చేవరకూ నన్ను ఖైదీలా బంధించి వుంచాడు. ఆ రాత్రి నా అంతట నేనే అతనికి జరిగిందంతా చెప్పేశాను.

అంతా విన్న తర్వాత కుర్రాడిని గురించి నువ్వు చెప్పకపోవటం బాగాలేదు. కుర్రాడెవరో చెప్పింతర్వాతకూడా ఆ అమ్మాయి పాపం బాగానే ప్రవర్తిస్తే అప్పుడు నువ్విలాటి నిర్ణయం తీసుకున్నా న్యాయంగా వుండేది అన్నాడాయన.

"ఏమన్నారు? ఊపిరి బిగపట్టి వింటున్న సంధ్య ఆదుర్దాగా అడిగింది. మాధవ్ మళ్ళీ చెప్పాడు. సంధ్య కళ్ళలో నీళ్ళు తిరిగాయి.

టెలిగ్రాం చూడగానే పార్ట్నర్స్, శ్యామసుందరంగారు బయలుదేరి వచ్చారు. నన్ను చూడగానే శ్యామసుందరంగారు కన్నీళ్ళతో అమాంతం కౌగిలించుకున్నాడు. డాక్టరుగారికి పదే పదే కృతజ్ఞతలు తెలుపు కున్నాడు. శ్యామసుందరంగారు అప్పటికప్పుడు నీకు టెలిగ్రాం యిస్తా నన్నాడు. నేనే వద్దన్నాను. అక్కడినుంచి సరాసరి హైదరాబాద్ వచ్చేశాం. వాసు మొదట చూడగానే నీలానే మూర్ఛపోయాడు. కంపెనీ నుంచి జర్మనీకి యింకొకరని పంపటానికి ఏర్పాటు చేశారు. అది కాని దయింది. నేను వచ్చాను కాబట్టి నేనే వెళ్తున్నాను. టైమ్‌కూడా ఎక్కువ లేదు. సరిగ్గా నాలుగే రోజులుంది ఎలాగూ దూరంగా వెళ్ళిపోతున్నాను. ఆఖరిసారి బాబునీ నిన్నూ కళ్ళారా చూసి వెడదామని యింటికి వచ్చాను."

మాధవ్ వూపిరి పీల్చుకోటానికి ఆగాడు.

సంధ్య చేతివేళ్ళు అతని జుట్టులోకి పోయి అప్రయత్నంగా నిమర సాగాయి.

"నేను ఈరోజు రాగానే నువ్విలా వచ్చి పెనవేసుకుపోతే నా రహస్యం బయటపడిపోయింది. నేనెవరో నీకు తెలిసిపోయిందనే అను కున్నాను. స్పృహ తప్పిన నిన్ను మంచం మీద పడుకోబెట్టి ఆత్రంగా లోపలికి వచ్చి ఇనప్పెట్టెలో చూస్తే నేను పెట్టి వెళ్ళిన ఉత్తరం తాకిన జాడే కన్పించలేదు. నా సంతోషం ఎగిరిపోయింది. ఉత్సాహం నీళ్ళు కారిపోయింది.

"ఉత్తరమా? ఎక్కడా? నేను చూడనేలేదు—" సంధ్య ఆదుర్దాగా బొంగురుగా అడిగింది.

నేను వెళ్ళేరోజు రాత్రి కూర్చుని ఏ పరిచయం నా జీవితాని అల్లకల్లో

నేను వెళ్ళాం తర్వాత దేనికోదానికి ఇనప్పెట్టె తెరచినపుడు చూస్తావని ఆశించాను!

"నేను చూడనేలేదు. మీరు వెళ్ళిన తర్వాత సిస్టర్ రాకతో నా మనసు వికలమైతే, ఆ రైలు ప్రమాదం వార్త పూర్తిగా మతే పోగొట్టింది.

"ఇంత క్రితం నువ్వలా పడుకొని నీళ్ళు తిరిగిన కళ్ళతో చెయ్యి ... దాన్ని అందుకోకుండా ఉండటానికి నేనెంత మనసు చిక్క... వాల్సి వచ్చిందీ నీకు తెలియదు. నా రాక కేవలం చచ్చిపోయిన ... బతికి రావటంవల్ల కలిగిన ఆనందం, అంతే! అంతకంటె ఇంకేం ...కున్నాను. క్షణం క్రితమే ఆ ఉత్తరాన్ని చించి అవతల పారేశాను. ...న్మలో నీకిది చెప్పే అవకాశంరాదని, అయిపోయిందనే అనుకున్నాను."

"ఏదీ, నేను బాబుని యెత్తుకొచ్చేసరికి మీరు చూస్తున్న కాగితా లేనా?"

మాధవ్ అవునన్నట్టు తలూపాడు.

ఇద్దరిమధ్య నిశ్శబ్దం ఏర్పడింది.

మాధవ్ తల సంధ్య ఒళ్ళో మళ్ళీ అశాంతిగా అటూ యిటూ కదిలింది.

"జ్యోతి పట్లా సుధ పట్లా ప్రవర్తన నీకున్న అనుమానాలు నేను గ్రహించకపోలేదు."

సంధ్యముఖం ఎర్రబడింది. చప్పున అరచేయి తీసి అతని నోటికి అడ్డుగా పెట్టింది. దాన్ని మాధవ్ మృదువుగా తప్పించి చెంపకి ఆనించు కున్నాడు. "నువ్వు మళ్ళీ కన్పించకముందే సుధని నేను తోబుట్టువులా చూడటం ప్రారంభించాను. జ్యోతిమీద నాకెప్పుడూ ఎలాటి ఆసక్తిలేదు. కాని ఇందతా నీకెలా చెప్పటం, నానీడనుచూసినా అసహ్యించుకుంటూ నా గాలి సోకితేనే విషపూరితం అనుకుంటున్న సమయంలో?"

సంధ్య బలవంతంగా రెండు చేతులు అతని నోటికి అడ్డు పెట్టే సింది. క్షణంసేపు మాత్రం ఆగిన మాధవ్ సంధ్య రెండు చేతులూ దోసిలిలో తీసుకుని అందులో ముఖం దాచుకున్నాడు. వెచ్చగా వస్తున్న అతని ఉచ్ఛ్వాస నిశ్వాసాలు సంధ్య అరచేతుల్ని తాకుతున్నాయి. అతని

 మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA118B112 |
| పుస్తకం పేరు | విజేత |
| తారీఖు | 28/10/24 |
| ముందు అట్ట | no |
| వెనుక అట్ట | no |
| మొత్తం పేజీలు | 207 |
| పెద్ద సైజు పేజీలు | No |
| ఖాళీ పేజీలు | no |
| లేని పేజీలు | 1 to 4,1 to 132 |
| తయారు చేసినది | Triveni |
| పేజీలు విడదీసినది | Triveni |
| స్కాన్ చేసినది | Mounika |
| పరీక్ష చేసినది | prathyusha |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |